# ఊర్జితారణ్యపర్వము తిక్కనదే


గ్రంథకర్త :

**గోపినాథ శ్రీనివాసమూర్తి**

(గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)






ప్రచురణ కర్త :

**గోపినాథ వసుంధరాదేవి**

శ్రీరస్తు　　శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః　　శ్రీ గణేశాయనమః



# ఊర్జితారణ్యపర్వము తిక్కనదే






గ్రంధకర్త :

**గోపినాథ శ్రీనివాసమూర్తి**

(గోపినాధ వేంకటకవి మనుమని మనుమడు)



ప్రచురణ కర్త :

**గోపినాథ వసుంధరాదేవి**

# విషయసూచిక

ఏలూరిపాటి అనంతరామయ్య
M A (Skt) M A (Tel) B P, B Ed
ప్రిన్సిపాల్ (రిటైర్డు)
ఆంధ్రవ్యాస, కవికుల రత్నదీప, ఆగమఅలంకార

16-1-24/ C/6/1,F2 శ్రీసాయి అపార్టుమెంటు,
కమ్యూనిటీ హాలు దగ్గర, సైదాబాద్ కాలనీ,
హైదరాబాద్ - 500 059

# డాక్టరేట్ డిగ్రీ కర్హమైన గ్రంథం

రామాయణ కవులలో విశిష్టస్థానం సంపాదించుకొనిన గోపినాథ వేంకటకవి గారి, మనుమని మనుమడు, శ్రీనివాసమూర్తిగారు వీరు ఆంధ్రప్రదేశ్‌స్టేట్ ఎలెక్ట్రిసిటీబోర్డులో చీఫ్‌ఇంజినీరుగా పనిచేసి విశ్రాంతి తీసుకొంటున్నారు తమ పూర్వులయిన వేంకటకవిగారి కృతులు అలభ్యంగా ఉండటం చూచి, వాటిని పునర్ముద్రింపజేయాలని సుమారు మూడుపుష్కరాల క్రితం భగీరథ ప్రయత్నం ఆరంభించిన వీరి సాహిత్య కృషి వాటి ప్రకాశన ప్రయత్నంతో ఆగక, ఆంధ్ర సాహిత్యంలోని ఇతర గ్రంథాలపైకి కూడా ప్రసరించింది గురజాడ శ్రీరామమూర్తిగారి సూచనలో అంకురించినది అరణ్యపర్వశేషం తిక్కన పూర్తిచేశాడన్నది మరుగున పడిపోగా,ఊర్జితారణ్యపర్వం తిక్కనదే అని శ్రీనివాసమూర్తిగారు వక్కాణించటంతో మారాకువేస్తున్నది దీనికి ఉపపత్తులు సమీకరించి పాదుగట్టి, నీరుపోసి, పెంచి, పెద్దచేయటానికి శ్రీనివాసమూర్తిగారు తీసుకొనిన శ్రద్ధ ఆశ్చర్యకరంగా ఉన్నది అరణ్యపర్వశేషంలోని పదప్రయోగాలు, పద్యాలఎత్తుగడలు, చిన్నవచనాలు, వాడిన ఛందస్సులు మొదలయినవి తిక్కనరచనలలో ఎక్కువగా ఉన్నాయికాని, నన్నయఎర్రనరచనలలో లేవని వీరు ప్రతిపాదించినది తేలికగా త్రోసిరాజనదగినదిగా కనిపించటంలేదు కవిత్రయంవారిరచనలే కాక చింతల పూడియెల్లయ, జక్కన, మొదలయిన వారి రచనలనుంచి కూడా వీరు సంపాదించినయుక్తులు వీరి విస్తృత పరిశీలనకు తార్కాణాలు విశ్వనాథ, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి పాటిబండ మాధవశర్మ, ఓగేటి అచ్యుతరామశాస్త్రి ప్రభృతుల అభిప్రాయాలు స్పృశించిన తీరు ఆధునిక సాహిత్య విమర్శలను వీరు బాగా ఆకళించుకొన్నారని తెలియజేస్తుంది 'పూరించె' పదానికి లేని విస్తృతార్థాలు కల్పించి చెప్పుకొంటూ, అరణ్యపర్వశేషం ఎఱ్ఱన రచించాడని ఇతరులు ప్రచారం చేశారంటున్నారు అస్థిమాల, కౌస్తుభం, యశోదాస్తన్యం, గరళం వంటి పదాలకు వీరు చెప్పిన అర్థాలు ఆ పదాలకు విస్తృతార్థాలుగా గ్రహించాలి వాద ప్రధాన రచనలలో ఇటువంటివి తప్పవు కవిత్రయ భారతాన్ని ఇంతగా దుర్భిణీ వేసి చూచి, పోల్చి చేసిన రచనలు తక్కువనుకొంటాను ఎలాగూ శ్రీనివాసమూర్తిగారు ఈగచ్చపొదను మళ్ళీ కదిలించారు గనుక తెలుగువిశ్వవిద్యాలయం వంటి సంస్థ ఏ పాంచాహ్నికంగానో ఒక విద్వద్గోష్ఠిని ఏర్పాటు చేసి అరణ్యపర్వకర్తృత్వం గురించి కవిత్రయరచనామర్మజ్ఞులు పాల్గొనేటట్టు చేసి, వారు వ్యక్తీకరించిన భావాలు, గ్రంథంగా ప్రచురిస్తే బాగుంటుంది విద్యుద్విభాగంలో చీఫ్ ఇంజినీరయిన శ్రీనివాస మూర్తిగారు విద్యుద్వేగంతో సాహిత్యలోకవిహారం చేసి కనులకు మిరుమిట్లు గొలిపేకాంతులు విద్వత్సంస్తవనీయమైన భారతంపై ప్రసరింపజేసినందులకు వారి నభినందిస్తున్నాను ఈ గ్రంథంలో నిబంధించిన వాటి కంటే విశేషాలు, వారు మౌఖికంగా వివరిస్తుంటే వా రింజనీరు కంటే ఏ ఆచార్యులో అయిఉంటే సాహిత్యాని కింకెంత మేలు కలిగేదో అనిపిస్తుంది ప్రచురణ భారం గురించి ఆలోచించక వారి కింకాతోచిన విమర్శనీయ విషయాలను మూర్తిగారు గ్రంథస్థం చేయాలి నేనే, ఏ విశ్వవిద్యాలయోపాధ్యక్షుడనైనా, అయిఉంటే, వీరి ఈగ్రంథానికే వీరికి డాక్టరేట్‌డిగ్రీ ఇచ్చి ఉండేవాడిని

ఏలూరిపాటి అనంతరామయ్య

గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

# భూమిక

'గోపినాధ వేంకటకవి పూర్వకవి పరంపర' అని నేను వ్రాసిన గ్రంధమును 4-9-1994 తేదీన 'ఉదయం'దినపత్రికయందు 'వ్యాసపీఠం' క్రింద శ్రీ జి.వి మార్తాండశర్మ గారు 'అరణ్యపర్వశేషాన్ని తిక్కన తెలిగించాడా?' అను శీర్షికతో సమీక్షిస్తూ 'ఇటువంటి మౌలికాంశంపై ఎవ్వరు ఇంతకాలంగా పరిశోధనకు పూనుకోకపోవడం నిజంగా తెలుగుసాహిత్యానికి, సాహిత్యచరిత్రకు అపచారమే అవుతుంది కనుక ఇప్పటికైనా ఈ విషయాన్ని సమగ్రంగా చర్చించాల్సిన అవసరం ఎంతైనా ఉంది' అను అభ్యర్థనతో ముగించుట ముదావహము.

ఉస్మానియావిశ్వవిద్యాలయమువారు అనేకతాళపత్రములను సేకరించి, పరిశీలించి, పారాంతరములతో ప్రచురించిన భారతసంశోధితప్రతి సహాయముతో కలిగిన క్రొత్తచూపువలన, ఊర్జి(వృద్ధిపొందిన)తారణ్యపర్వము తిక్కనదే' అని పైచర్చకు సిద్ధాంతీకరించిన గ్రంధమిది. ఈభావనాబలము తిక్కన కరుణవలన కలిగినదని విశ్వసించి, తిక్కనకే అంకితమిచ్చిన గ్రంధరాజమిది

భారతములోని అసంగతములను, విశేషములను పేర్కొని, వాటిసమన్వయ సాధనకు అరణపర్వచతుర్థాశ్వాసప్రత్యేకత చూపి, నన్నయ,తిక్కనలు భావించిన రీతిగ అర్థయుక్తి,అర్థగతి, ప్రబంధశబ్ధభావములు నిర్ణయింపబడినవి అంతేకాక 'కిమస్థిమాలాం' శ్లోకగూఢార్థమును అవధరించి, హరిహరనాధుడు మెచ్చి కృతిపతిత్వ మర్థించుటకు తిక్కన కలలో వచ్చి చెప్పినట్లు విరాటపర్వమున ఉన్నది. కనుక ఆశ్లోకమును సాధారణశ్లోకముగ భావించుట భావ్యము కాదని, శ్లోకములోని అస్థిమాల, కౌస్తుభ, కాలకూట, యశోదాస్తన్యపద విశేషముల ద్వారా, తిక్కన రచిత కావ్య విశేషముల ద్వారా ఆగూఢతను విడదీసి, విపులీకరించి, సమన్వయసాధన చేయబడినది

తిక్కన వదలిన భారతభాగమే ఎఱ్ఱన వ్రాయగలడు కానీ 'అష్టాదశపర్వనిర్వహణ సంవృతమైపెనుపొందియుండ నం దాది(పర్వము)దొడంగి మూడుకృతులు(అశ్వాసములు) నన్నయ రచ నాద్యంతములను తిక్కన తెలిపినాడు ఆదిత్రిపర్వములనో, ఆదిత్రికృతులనో అని చెప్పక 'తొడంగి' పదప్రయోగముచేత ఆదిపర్వకధ నుండి విరాటపర్వపు ముందరి అరణ్యపర్వమూడుకృతు (అశ్వాసము)ల రచనాంతమును సూచించెనని భావించుట భావ్యము

తిక్కన రచనకు 'హృదయాహ్లాది చతుర్థ మూర్జితకధోపేత' మనెను అనగా నిలిచిపోయిన నన్నయరచనను కొనసాగించిన హృదయాహ్లాదమైన చతుర్థాశ్వాసము, వృద్ధిపొందినకధతో కూడిన దనెను. అనగా వృద్ధిపొందని చతుర్థాశ్వాసకధ, నన్నయ రచనాభాగమని చెప్పకయే చెప్పుచున్నది కనుక కథాభాగములో వదలిన భాగము లేదు కాని హరిహరనాధునితో 'దేవా దివ్య చిత్తమున అవధరింపు' మని 'కధ జగత్ప్రసిద్ధిగావున పూర్వపర్వార్థ యుక్తి సేయునట్టి యెడల, యత్నమించుకంతయైనను వలవదు, వలసినట్లు చెప్పవచ్చి యుండు'ననెను ఈపద్యము విరాటపర్వమున ఉన్నందున, పూర్వపర్వమనగా విరాటపర్వపూర్వ అరణ్యపర్వమని భావముకదా ఏడు అశ్వాసములు కలిగిన అరణ్యపర్వమునందు, మూడుకృతులు(అశ్వాసముల) నన్నయరచనకు కలిపిన వృద్ధిచెందని చతుర్థాశ్వాన నన్నయభాగములో కృతీశ్వరప్రశస్తి రాజరాజవరముగ కలదు కాని వృద్ధిపొందినకధ(ఊర్జితకధోపేత)కలిగిన చతుర్థాశ్వాసకధ, పంచమాశ్వాసకధతో అన్వయము చేయవలసినపుడు మధ్య వచింపవలసిన నన్నయ సారస్వతాంశ ప్రశస్తి అనగా వ్యాససారస్వత భాగకధ కాక నన్నయ సారస్వతభాగమైన కృతీశ్వరప్రశస్తి మాత్రము వదలివేసితినని తిక్కనచెప్పెను ఈవదలిన నన్నయసారస్వతాంశ ప్రశస్తి తనకు చెందినదని మహాభారత అస్తిపంపకములో సంక్రమించిన భారత పొరునిగ, తన భాగమువలె చెప్పకొని, ఆపదకొండు కృతీశ్వర (రాజరాజ) ప్రశస్తిపద్యములను మాత్రమే ఎఱ్ఱన రచించెను కనుకనే రచించితినని చెప్పక పూరించితినని, చతుర్థాశ్వాసాంతమున చెప్పక

గ్రంధకర్త: గోపినాధ శ్రీనివాసమూర్తి (గోపినాధ వేంకటకవి మనుమని మనుమడు)

సప్తమాశ్వాసాంతమున కథ పూర్తయిన తర్వాత, తన అవతారిక వ్రాసిన తర్వాత నన్నయవలె రెండు పద్యములలో నన్నయ సారస్వతమును పోషించిన రాజరాజప్రశస్తి రచించి, యివే తను రచించితినని కథాభాగము తిక్కనదనినట్లు ధ్వనించినాడే కాని చెప్పలేదు వృద్ధిపొందిన భాగమున తిక్కన, గద్యము నన్నయపేర, రచించినట్లు, వృద్ధిపొందిన (ఊర్జిత) పదప్రయోగమే సూచించును (ఇదేఅస్థిమాల భావము) కారణము,అసలునకే వృద్ధిపొందినదిచేరుట సంప్రదాయముకదా! నన్నయపేర తిక్కన గద్యము రచించినందున, కృతీశ్వర ప్రశస్తి రాజరాజపర్యాయముగ ఎఱ్ఱన రచించినాడు కృతీశ్వరప్రశస్తి తిక్కన వదిలిపెట్టితినని చెప్పినందుననే, తాను పూరించితినని ఎఱ్ఱన పాఠకుల సందేహనివారణార్థము చెప్పుకొనినాడు లేనిచో, రచించిన కేవల పదకొండురాజరాజప్రశస్తిపద్యములకు తనపేరు ఎఱ్ఱన చెప్పుకొనియుండెడివాడు కాడు

తిక్కన విరాటపర్వరచనతో ప్రారంభించి చివరిపర్వమైన స్వర్గారోహణ పర్వకథ పూర్తిచేసినతర్వాత క్రింది హరిహరనాథ సంబోధనాపద్యమును ఆశ్వాసాంతమున కాక మధ్యనే రచించియున్నాడు

క॥ శ్రీనిత్యత్వప్రమదా,ధాన కుతూహల నిరూఢతాస్తవ్యాపాం,
గా నిర్భర వేదవ్యా,సానేక వచోనుషంగ హరిహరనాథా (భా18-1-76)

విరాటపర్వమున షష్ఠ్యంతముల తర్వాత 'కథాప్రారంభ' మని విభాగము చేసియున్నను, కథను ప్రారంభింపక అంతస్సన్నిధి కలిగించుకొని ఆశ్వాసారంభపద్యములా అనునట్లు క్రింది శ్రీపదముతో ప్రారంభముకాని మూకుమ్మడి మూడు హరిహరనాథసంబోధనాపద్యములను రచించినాడు (భా 4-1-38,39,40)

క॥ శరణాగత సంశ్రిత భయ, హరణా సురనికర శేఖరానర్ఘమణీ,
స్ఫురణా పరిచయ రంజిత, చరణా వనమాలికా భుజంగా భరణా,

క॥ అజగవ శార్ఙాలంకృత, భుజగర్వ నిరస్త దైత్య భూమస్తుత్యా ,
త్రిజగద్ధారణ నిత్యా, భుజగ సమాచరిత శయన భూషణకృత్యా ,

క॥ జలనిధి హిమవద్భూధర, కలిత జననకేళీ కౌతుక వ్యక్తావ్య,
క్తలలిత సౌందర్య స్ఫుర, దలఘుతను శ్రీ సనాథ హరిహరనాథా

తిక్కన భారతరచన తర్వాత రచించిన కవులందరును షష్ఠ్యంతముల తర్వాత 'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన కావ్యంబునకు కథాప్రారంభం బెట్టిదనిన' అని కావ్యరచనను ప్రారంభించిరి భగవంతుని కంకితము చేసిన కవులు కూడ తిక్కనవలె అంతస్సన్నిధి కలిగించుకొని కృతిభర్త సంబోధనాపద్యములను రచింపలేదు తిక్కన రచనను అనుసరించిన తిక్కన దగ్గరికాలపు ఎఱ్ఱన నృసింహపురాణమున కూడ అట్లు రచింపలేదు ఎందుకని? ఆలోచింపుడు 'ఆశ్వాసమధ్యలో నిలిచిపోయిన రచనను మరెవ్వరును పూరింప పూనుకొనలేదు' అని సమాధానము వచ్చును

స్వర్గారోహణపర్వకథ పూర్తయిన తర్వాత నున్న పైపద్యము 'శ్రీ' పదముతో ప్రారంభమై 'హరిహరనాథా' అను సంబోధనతో నుండుటవలన, కథారచనను ప్రారంభించునట్లు ధ్వనించు ఆశ్వాసారంభపద్యమా అనిపించి, విరాటపర్వమున 'అంతస్సన్నిధి కలిగించుకొని నివేదించుకొనిన మూడు మూకుమ్మడిపద్యములు శ్రీపదప్రారంభము లేక, కడపటి పద్యమునందు మాత్రమే 'హరిహరనాథా' అను సంబోధన కలిగియున్నందున అరణ్యపర్వ చతుర్థాశ్వాసమధ్యలోని 'భూసతికిం దివంబునకు' పద్యమునుండి కేవలకథతో పంచమ,షష్ఠమ,సప్తమాశ్వాసకథలను అనగా విరాటపర్వప్రారంభము వరకు హరిహరనాథునకు వరుసగా నివేదించిన సంకేతముగ దేవకీదేవి స్తన్యమును మాని యశోదాస్తన్యమును ఆస్వాదించిన రీతిగ (ఇదేయశోదాస్తన్య భావము) నున్నది కనుక వృద్ధి పొందిన అరణ్యపర్వము తిక్కన హరిహరనాథాంకితముగ రచించెనని తెలియగలదు అట్లు వదలిపెట్టిన ఆశ్వాసారంభ,ఆశ్వాసాంతపద్యములను ఎఱ్ఱన పూరించియుండుటచే, ఎఱ్ఱననే

ఈభావనలకు అడ్డుగోడ కట్టినట్లు 'భాసురభారతార్థముల భంగులు' అను నృసింహపురాణ పద్యములోని 'గాథలు త్రవ్వు తెలుంగువారికిన్' పదప్రయోగముచే సూచించి 'మించినవేడ్క' అని తర్వాత పద్యమున తెలిపినాడు

ఇక అనుబంధమున వివరింపబడిన భారతవతారికను పరిశీలింతము భారతసంశోధిత ఆదిపర్వారంభములోని మొదటి వచనము సరియైన పాఠాంతరములతో, విరాటపర్వమొదటివచనమును సరిపోల్చి చూచెదము

'అనిసకలభువనరక్షణప్రవణులైన హరిహర యాద్యులైన హరిహరహిరణ్యగర్భపద్మోమా వాణీసతుల స్తుతియించి తత్ప్రసాదాసాదిత నిత్య ప్రవర్ధమాన మహామహీ రాజ్య విభవుండును (భా1-1-2)

'అనిసకలబ్రహ్మప్రార్థనంబు సేసి తత్ప్రసాదాసాదిత కవిత్వతత్త్వ నిరతిశయానుభావా నందభరితాంతః కరణుండనగుచుండి యొక్కనా డిట్లని వితర్కించితి' (భా 4-1-2)

రెండువచనములును 'అని సకల' అనుపదముతో ప్రారంభమగుట, రెండింటను 'తత్ప్రసాదాసాదిత' అని సమాసము ప్రారంభమగుట, ఆదిపర్వవచనమందు 'ప్రవణులైన హరిహర' అని విరాటపర్వమునందు 'బ్రహ్మ' అని ప్రయోగించియుండుటచేతను, భారతావతారిక తిక్కన రచనమనియే సూచించుచున్నది ఆదిపర్వములోని ప్రవణులైన (ఆసక్తులైన) హరిహరపదప్రయోగము విరాటపర్వములోని 'దీని (భారతమున) కెద నియ్యకొని వేడ్కనూని కృతిపతిత్వ మర్థింపవచ్చితి తిక్కశర్మ'ను (భా 4-1-18) సూచించి, ఈవచనమునకు ముందరి శ్లోకరచనాకళ, శిల్పము, తిక్కన కవిత్వమని చెప్పకయే బలముతో చెప్పుచున్నది ఇట్లు చూచినపుడు భారతావతారికాభాగము, అరణ్యపర్వశేషము, విరాటాది స్వర్గారోహణపర్యంతము మూడు చోట్ల తిక్కన రచనమని తెలియును దీనిని 'శ్రీవాణీ గిరిజాశ్చ' అను భారతావతారిక శ్లోకములోని 'వక్త్రోముఖాంగేషు' పదప్రయోగము భారతకావ్యచెల్వయైన విరాటపర్వము కావ్యవక్త్రమందును, భారతావతారిక కావ్య ముఖమందును, వృద్ధిపొందిన అరణ్యపర్వము కావ్యాంగమందును పురుషోత్త మాంబుజభవ శ్రీకంధరులు ధరించినట్లు సుస్పష్టమగును అంతేకాక విరాటపర్వాది స్వర్గారోహణపర్యంతకథ. వృద్ధిపొందిన అరణ్యపర్వకథ 'హరిహర' భాగమైనట్లును, కథాభాగముకాని భారతావతారిక 'బ్రహ్మభాగమైనట్లు సూచించి 'హరిహర హిరణ్యగర్భ 'వచనక్రమమునకు సరిపోవుచున్నది

ఎఱ్ఱనపూరణ చేత అరణ్యపర్వమం దంతటను రాజరాజప్రశస్తి, గద్యము నన్నయపేర యుండుటచే నన్నయకాని, ఎఱ్ఱనకాని రచించియుందురని తప్ప, తిక్కన రచియించియుండునని ఆధునికులెవ్వరును భావింపలేదు తాళపత్రకాలపు జనుల భావములు గాలిలో తేలిపోయి కథలైనవి నోటి కథలు కల్పనలై భావపరివర్తన పొందియుండును ఈ విషయములపై పరిశోధనకు కృషిఎవ్వరును చేయలేదు. ఇదే ప్రథమకృషి, అరణ్య పర్వశేషమునందలి వ్యాకరణ విశేషములు, పదప్రయోగము, సమాసము చేయురీతి, పద్యగద్యముల ఎత్తుగడలు, శయ్య, శైలి, చంధోరీతి కంప్యూటరు సహాయముతో పరిశీలించినచో అరణ్య పర్వశేషము తిక్కన రచనమని సందేహములేనిరీతిగ వెల్లడికాగలదని నా విశ్వాసము దాని కీరచన ప్రారంభసూచనమౌగాక ఈ గ్రంథములోని శ్లోకార్థతాత్పర్యములను తెలిపిన డాక్టర్ శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారికి నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను ఒకటి రెండు శ్లోకతాత్పర్యములను డాక్టర్ మూలంపల్లి చంద్రశేఖర శర్మగారు తెలిపిరి వారికి కూడ నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను అడుబోవు తీర్థమెదురైనట్లు విషయములన్నియు విపులీకరించియుండ ఇంక ఆలస్యమెందులకు?

**గోపినాథ శ్రీనివాసమూర్తి.**

(గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

శ్రీరామజయం

# ఊర్జితారణ్యపర్వము తిక్కనదే

★భారతరచనలో సందేహములు★

తెలుగు భారతభారతిని ప్రసాదించినది కవిత్రయమని ప్రచారము కాని అందులో భేదాభిప్రాయము లున్నవి వాటిని తెలిసికొని, వాటిలో సత్యమేదో తెలిసికొను ప్రయత్నమే ఈ రచనకు ప్రేరణ ఆంధ్ర సాహిత్య చరిత్రలో చెలరేగిన భారతరచనా భేదాభిప్రాయములివి

(1) ఆంధ్రసాహిత్య చరిత్రమును క్రీ శ 1850వరకు ఎవ్వరును రచింపలేదు శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారు ఆంగ్లభాషాసంప్రదాయసంపర్కమున అట్టి ప్రయత్నమునకు శ్రీకారము చుట్టిరి. వారు పరంపరగా తత్పూర్వమునుండి నోటికథలుగా చెప్పుకొను ఉదంతములను ఆధారములుగ పేర్కొనుచు కవి జీవితములను రచించిరి అందు నన్నయ రచన అరణ్యపర్వమధ్యలో నిలిచిపోయినను తిక్కన కొనసాగించినట్లు తెలుపు ఉదంతమున్నది కాలప్రవాహమున పండితపరంపరగా తిక్కన రచించెనన్న సత్యమునకు తొడిగిన కల్పన కట్టుకథయయి ఉండుగాక దానిలోని కేవల కల్పనను తొలగించి సత్యమును భాసింపజేయక, లేఖకులు జొప్పించిన వ్రాతలను ఆధారముగ శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ కవుల చరిత్రలో దానినంతను కట్టుకథయని త్రోసిపుచ్చుట, తర్వాతి చరిత్రకారులు దానిని సమగ్రముగ చర్చింపకుండుట విచారకరము

తిక్కన రచనా విధానము అరణ్యపర్వ శేషమున ఉన్నందున, తిక్కన 'అష్టాదశపర్వ నిర్వహణ సంవృతమై పెనుపొందియుండ నం దాది దొడ్డగి మూడు కృతులు' నన్నయ రచించెనని చెప్పినందున, తిక్కన పూర్వపర్వ (అరణ్యపర్వ) అర్థయుక్తి చేయునట్టి యెడల యత్న మించుకంతయైనను వలవద్దని తెలసినట్లు చెప్పవచ్చియుండు' అని చెప్పినపుడు 'అర్థయుక్తి' అనగా ఏమి? తిక్కన 'ఆదరణీయసారవిదితార్థగతి స్ఫురణంబు గల్గి' అని చెప్పినప్పుడు 'అర్థగతి' అనగా ఏమి? యత్నమించుకంతయైనను వలవదని చెప్పినదాన్నినేకదా ఎఱ్ఱన వ్రాయగలడు ఎఱ్ఱన నృసింహపురాణమున మూడు పద్యములలో నన్నయ, తిక్కనలను సమముగా అబ్జాసన కల్పులగా ప్రశంసించి, హరివంశమున నన్నయను

(గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

కుంజరముతో పోల్చి తిక్కన రచనను (అస్థిమాల రచనను) ప్రశంసించుటలో గల అంతరార్థము ఏమి? ఈ విషయ విచారణలపై పరిశోధన చేయక అరణ్యపర్వ శేషమును తిక్కన వదలివేసెనని, ఎఱ్ఱన అరణ్యపర్వశేషమున వ్యాసస్తుతి, నన్నయ తిక్కనల కవిస్తుతులను చేయక పోయినను, ఎఱ్ఱన పదప్రయోగముల అంతరార్థము ఏ సాహిత్య చరిత్రకారుడును గ్రహింపక 'తద్రచనయకా' అను సమాసమునకు 'పూరించె' పదమునకు లేని విస్తృత భావములను కల్పించి చెప్పుకొనుచు అరణ్యపర్వశేషమును ఎఱ్ఱన రచించెనని ప్రచారము చేసిరి.

(2) 16వ శతాబ్దిని జీవించిన 'రాధామాధవకవి' అని పేరుగాంచిన శ్రీ చింతలపూడి యెల్లనార్యుడు తన 'తారకబ్రహ్మ రాజము'న భారతకావ్యహారమున ఒకభాగము నన్నయ, నన్నయప్రాయగా మిగిలిన భాగము తిక్కన సోమయాజి ముత్తెములగు రమణీయపదములతో సుందరముగ రచించెను. (భారతకథ) మధ్యలో రెండు (భాగములను అనగా ఆశ్వాసములను) కలుపు రాజరాజ(ప్రశస్తి)కీర్తి (నాయకశ్రీ) పద్యములనుమాత్రము శివదాసుడైన (శంభుదాసుడైన) ఎఱ్ఱన రచించెను నన్నయ,తిక్కనల ఇరువురిరచితమైన భారతభారతి అనగా భారతకథాభాగము (శారద),ఎఱ్ఱనరచితమైన రాజరాజప్రశస్తిని మధ్యలో ధరించి, భారతరచనాకీర్తి ఇరువురు కవులను మించి కవిత్రయ కీర్తిగా ముగ్గురు కవులకు పొందెనను భావమును 'తక్కినభాగము సొంపారనొనర్చె' అని తక్కిన పదప్రయోగముచే భారతకథాభాగమునకును, 'నాయకశ్రీ' చే కృతీశ్వర ప్రశస్తిని తెలిపియున్నాడు చూడుడు. (తారకబ్రహ్మరాజీయము 1-10)

ఉ॥ భారతకావ్యహార మొకభాగము నన్నయభ ట్టొనర్చె ము<br>
క్తారమణీయవాక్యములఁ దక్కినభాగము సోమయాజి సొం<br>
పార నొనర్చె రెండుఁగలయన్ శివదాసుడు మధ్య నాయక<br>
శ్రీ రచియించె శారదధరింపఁ గవిత్రయకీర్తిమించగన్

పై పద్యములో 'మించగన్' పదము ఎఱ్ఱన 'మించినవేడ్క వీనులకు మిక్కుటమై' పద్యమును, దానిలోని 'కీర్తిసంగసుఖలీలకు నేనును కాంక్ష చేసితిన్' అనుభాగము స్మరింపజేయుట గమనార్హము

(3) [1]'మ శతఘంటము వేంకటరంగశాస్త్రి మున్నగు పండితు లొకరిద్దరు భారత ప్రథమపర్వములు మూడును నన్నయభట్టారకుడు తెలిగించెననియు, నందు కొంత భాగముత్సన్నము కాఁగా దాని నెఱ్ఱాప్రెగడ రచించెననియు వ్రాసియున్నారు '

(4) [2]శ్రీ వీరేశలింగము పంతులవారు తాము క్రొత్త వెలయించిన కవులచరిత్రము ప్రథమభాగమున ''ఇప్పటివారుకొందఱు నన్నయ యారణ్యపర్వము సంపూర్ణము కాగానే చేసెననియు . ఏ కారణముననో యది నశింపగా నెఱ్ఱాప్రగడ నన్నయపేరనే పూరించెననియు మున్నెవ్వరు కనని వినని క్రొత్తవాదము నొకదానిని నారంభించిరి. ఈవాద మపూర్వమైనదే '' ఇత్యాది వాక్యములు వ్రాసి కొన్నియుక్తులతో పైవ్రాతలను (శతఘంటము వేంకటరంగశాస్త్రి గారి వ్రాతలను)పూర్వపక్షముసేయుచు, నన్నయ యారణ్యపర్వమునఁ గొంతభాగము వ్రాసి మృతినొందగా, మూడువందలయేండ్లయిన తరువాతఁ దక్కినభాగము నెఱ్ఱన నన్నయపేరుపెట్టియే పూరించెనని సిద్ధాంతీకరించినారు

(5) [3]పైపండితుల వ్రాతలను,కవులచరిత్రములోని యుక్తులను,ఆంధ్రమహాభారతమును,ఎఱ్ఱాప్రెగడ యితరగ్రంథములను మఱియుఁ గొందఱు ఇతర కవులగ్రంథములను పరిశోధింపగా ఎఱ్ఱాప్రెగడ కావించినది శిథిలభాగ పూరణయేకాని సంపూర్ణరచనము కానేకాదనియు గ్రంథమంతయు నన్నయదే యనియు' శ్రీనడకుదుటి వీరరాజుపంతులుగారు రక్తాక్షినామసంవత్సర చైత్రమాసపు 'భారతి' మాసపత్రిక(1924 ఏప్రిల్) 'అరణ్యపర్వము-ఎఱ్ఱాప్రెగడ' అను వ్యాసమునందు తమవాదమును ప్రకటించియున్నారు దీనినే శ్రీవేదాల తిరువేంగళాచార్యులవారు'ఆంధ్ర సాహిత్యోపన్యాసములు' అనుగ్రంథమున బలపరిచియున్నారు

పై వాదములన్నిటిలో నన్నయ అరణ్యపర్వమున 'శారద రాత్రులుజ్జ్వల' అను చతుర్థాశ్వాసపద్యము వరకురచించి కీర్తిమాత్రుడై పోయెననియు, ఎఱ్ఱన 'స్ఫురదరుణాంశు' అనుపద్యమునుండి రచించి నన్నయరాత్రివర్ణనకు వన్నెతెచ్చి, నన్నయతిక్కనల

---

1, 2, 3 నడకుదుటి వీరరాజు పంతులుగారి 'అరణ్యాపర్వము-ఎఱ్ఱాప్రెగడ' వ్యాసము రక్తాక్షి చైత్రమాస 'భారతి' లోనుండి గ్రహించిన భాగములు

వారధినిర్మించి భారతభారతికంఠహారమును పూర్తిచేసెనని నేటి సాహిత్యలోక విశ్వాసము కాని ఇదిసరికాదు అని 1969/70సం॥మున ముద్రించిన 'ఆంధ్రమహాభారతము సంశోధితముద్రణము'లోని పాఠాంతరములను సూక్ష్మముగ పరిశీలించి తిక్కన, ఎఱ్ఱనలరచనలతో సమన్వయముచేసిన తెలును

పై విషయమును పరిశోధించుటకుముందు ఇప్పుడు భారత స్వరూప మెట్లున్నది, దానిలో కనబడు అసంగతు లేవి? విశేషము లేవి? వాటి అవగాహన లేమిటి? ఎఱ్ఱన,తిక్కనపద్యములనుండి ఆరా తీయుదము భారతకథనాస్వరూపము అరణ్య పర్వములోనే మార్పును పొందును కనుక దానినే పరిశీలింతము

మహాభారత తాళప్రతులను ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు సేకరించి, పరిశీలించి, తాళపత్రపాఠాంతరములన్నిటితో ప్రచురించిరి వారు పరిశీలించిన అరణ్యపర్వ 24 తాళప్రతుల వివరములను 'సాధనసామగ్రి' అను అంశమున వివరించిరి వాటిలో తిక్కన, ఎఱ్ఱనల జన్మస్థానము, బహుపండితకవుల కాలవాలమైన నెల్లూరు ప్రాంతపు తాళప్రతి ఒకటైనను లెకుండుట గమనార్హము. ఒక వేంకటగిరిసంస్థానముననే కొన్ని తాళప్రతులుండుటయు గమనార్హమే ఆ24తాళపత్రములను గ్రహించిన కర్తలుగా ఈక్రిందివారిని పేర్కొని వాటికి అ, ఆ, ఇ, ఈ లను పేర్లుపెట్టిరి

1) ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడ - 14 ప్రతులు 2) గౌతమీ గ్రంథాలయము, రాజమహేంద్రవరము- 2 ప్రతులు 3) దివ్యజ్ఞానసమాజము,అడయార్- 2 ప్రతులు 4) సంస్కృత అకాడమీ - 1 ప్రతి 5) ఆంధ్రవిశ్వవిద్యాలయము - 1 ప్రతి 6) సరస్వతీమహల్ గ్రంథాలయము.తంజావూర్-1 ప్రతి 7) శ్రీవాయల్పాడుకన్యకాపరమేశ్వరీ దేవాలయము- 1 ప్రతి 8) శ్రీకొమరగిరి నారయ- 1 ప్రతి 9) శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ- 1 ప్రతి

పై24తాళప్రతులలో 15ప్రతులు 19వశతాబ్దిని లిఖించిన తాళప్రతులు. మిగత 9లో6తెలుగుసంవత్సరములు మాత్రమే కలిగినందున సరిగా ఎప్పుడు వ్రాసినది తెలుపజాలమనిరి తాళపత్రశిథిలకాలపరిమితి ననుసరించి అవియును 19వశతాబ్ది లేక 18వశతాబ్దిచివరివిగా పరిగణింపవచ్చును. పైఉస్మానియా విశ్వవిద్యాలయమువారు సంశోధించిన 1970భారతస్వరూపమునే మన మిచ్చట పరిశీలింతము అది ఇది

★సంశోధితభారతప్రతి స్వరూపము★

## అరణ్యపర్వము ప్రథమాశ్వాసము

1 క శ్రీకీర్తి [1]శ్రీ[2]వల్లభ, లోకజనస్తుత్యసర్వ[3]లోకాశ్రయ ర
త్నాకరపరివృత[4]సకలధ, రాకాంత జితారి రాజరాజనరేంద్రా

★పాండవుల వనగమనము★ (సం 3-1-8)

2 వ [1]అక్కథకుండు శౌనకాది మహామునులకుం[2]జెప్పెనట్లు పాండవులు నిజాయుధం . . . . (కథాభాగము)

398 --జనమేజయునకు వైశంపాయనకథితంబైన పుణ్యాకథయతి[3] రమణీయంబుగాను

399 బిరుదాంకభీమ భీమే, శ్వరకృత[1]కృత్యప్రసాద సౌజన్యగుణా
భరణ పరగండభైరవ, పరనృపమణిమకుటఘటితపద [2]బుధవినుతా

400. ఉత్సాహము రాజవంశరత్న రాజరాజ దేవ నిత్యలక్ష్మీ, జయాభిరామ ధర్మమిత్ర [1]మిత్త్రవిద్వదం
[2]భోజవనపయోజమిత్త్ర భూరికీర్తికౌముదీ, రాజితత్రిలోక నిఖిలరాజ[3]లోక పూజితా

గద్యము ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీ మహాభారతంబునందారణ్యపర్వబునందు బాండవవనప్రవేశంబును నన్నది ప్రథమాశ్వాసము.

## అరణ్యపర్వము ద్వితీయాశ్వాసము

1 క శ్రీరమ్య [1]ధర్మనిత్య, ప్రారంభవిభాసి రాజపరమేశ్వర ఘో
రారి మదకుంభికుంభ వి, దారణ [2]దారుణకృపాణ3దక్షిణహస్తా

---

1 — 1 ప్రియవల్లభ- ఇ,ఝు, స్త్రీ వల్లభ- ఈ,ఐ,త 2 విభవా- వ,స 3 లోకప్రియ- ల,స 4. సర్వధరా- ఈ,ఐ,త,ఎస్,బి,ఒ ప్రతిలో 1నుండి 7వరకుగల పద్యములు లోపించినవి

2 — 1 అక్కథికుండు- కొన్ని ప్రతులు 2 జెప్పినట్లు- కొన్ని ప్రతులు

398 — 3 రమ్యంబుగాను- కొన్ని ప్రతులు

399 — 1 నిత్యప్రసాద- కొన్ని ప్రతులు 2 విబుధనుతా- పెక్కు ప్రతులు

400 — 1 భూరివిద్వదం- అ,క,చ,వీ,శ,ష 2 భోజనీపయోజమిత్ర- ల 3 రాజ అ,ఎ,ఏ,ఒ

1 — 1. నిత్యధర్మ- ఎ,ఏఐ,ఓ,ఘ,త 2 సునిశిత- ఎ,ఏ,ఓల,స విహరణ ఘ 3 ధరవర- ట, ధరనిజ- ఈ,ఇ,త

2 వ. సం 3-49-29 [1]అక్కథకుండు శైనకాదిమునులకుం [2]జెప్పెనట్లు [3]సాంత్వన వచనంబుల భీమసేనునకుం . . (కథా భాగము)

354 వ . . . వైశంపాయనకథి[3]త కథా[4]క్రమం బతి[5]రమ్యంబుగాను

355.క కలికాల[1]భరతలక్ష్మీ, లలనాస్పద వీరగుణవిలాస విరోధి
ప్రళయాంతక నిఖిలమహీ, వల[2]యోద్వహబాహు విష్ణువర్ధన [3]మూర్తీ

356 పృథ్వీవృత్తము సమస్త [1]భువనాశ్రయా వినయ [2]సత్యనిత్యోదయా
[3]సమీహిత [4]గుణక్రియా [5]స్థిరవిశాలకీర్తిప్రియా
[6]నమన్నృపకిరీటచుంబిచరణద్వయా సంతత
[7]క్షమాభరణ రాజరాజ పరగండ [8]భేరుండకా

357 గద్యము [1]ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబు నందారణ్యపర్వంబున బృహదశ్వుదర్శనంబును . వాతాపి భక్షణంబును [8]నన్నది ద్వితీయాశ్వాసము

## అరణ్యపర్వము - తృతీయాశ్వాసము

1 క [1]శ్రీమందిర [2]బుధజనచిం, తామణి కోదండపార్థ ధర్మవిచారో
ద్దామ నల[3] నృగభగీరథ, రామచరిత్రాభి[4]రామ రాజ[5]నరేంద్రా

*అగస్త్య చరిత్రము* (సం 3-98-1)

2 వ [1]అక్కథకుండు శౌనకాది మహామునులకుం [2]జెప్పెనట్లు (కథాభాగము)

---

2 వ అక్కథికుండు- పెక్కుప్రతులు 2. చెప్పినట్లు 3 సాంత్వ- కొన్ని ప్రతులు శాంతవచనంబుల- పెక్కుప్రతులు 4 ఉవాచ సాంత్వయన్ రాజా 3-29-25 భం

354 3 తంబైన పుణ్యకథయతి కొన్నిప్రతులు 4 శ్రవణంబు కొన్నిప్రతులు 5 రమణీయంబుగాను కొన్ని ప్రతులు

355 1 విభవ- ఉ 2.యాస్పద- ఆ,ఊ,గ,ఝ, యోద్భవ- క 3 దేవా- ళ, పెక్కు ప్రతులు, నృపతీ- కొన్ని ప్రతులు

356 1 మహిమాశ్రయ- ఝ 2 నిత్యసత్యోదయా- అ,ఔ,ఝ 3 సమాహిత- కొన్ని ప్రతులు 4 మనః- అ,ఆ, హిత- కొన్ని ప్రతులు జయ-ఖ 5. శుభ- పెక్కు ప్రతులు 6 సమన్నృపపదద్వయా దిగధినాథదత్తాభయా- ళ 7 క్షమాభిణ దిగ్గయాసుకవిజాలభాస్వద్వయా- ళ, 8 హృద్భైరవా- ఈ,ఇ,త, భీమాహ్వయా- ఎ,ఏ,ఓ, కంఠీరవా- ఆ,చ,జ,ద

357 1 ఇతిశ్రీ ఏ,ఘ, ఇతి- క,జ,శ 8 అపత్యార్థంబగస్త్యుండు లోపాముద్రనభిగమించుటయు ఒ

1 1 శ్రీమండిత- స 2 ఘనబుధ చింతామణీ- జ 3 గయ- ఈ,ఓ,గ, నృప- శ ష 4.రాజ- ఆ 5 మృహేంద్రా- ఝ.ప

2 1 అక్కధికుండు- ఊ,ట,ల 2 జెప్పినట్లు- కొన్ని ప్రతులు

*గ్రంధకర్త:* గోపినాథ శ్రీనివాసమ్మూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

397 [5]ధౌమ్యరోమశాదిమహీసురవరులు వర్ణించిరని[6]వైశంపాయనకథితంబైనకథ రమ్యంబుగ

398 క [1]భూపకులతిలక నృపవి, ద్యాపార[2]గ నిత్యసత్యధనధాన్య దయా
లాపచతురాస్య ధర్మ, వ్యాపార3విచార విష్ణువర్ధన [4]నృపతి

---

397 5 ధౌమ్యాది మహీసురవరులు- పెక్కుప్రతులు, వైశంపాయ కథితంబైన పుణ్యకథ- పెక్కు ప్రతులు, వైశంపాయనునకభిమతంబైన కథ- గ,ఘ

398 1 ఈపద్యమునకు ముందు ఇ ఎ ఏ ఒ ఓ ద డ జ ల ప్రతులలో అధికపాఠములు

క 'వీరావతార విమలా! చార బుధాధార హారశరదిందుసుధా
సారధవళాద్రిగంగా! పూరయశోదార ధీర బుధజనవినుతా'- ఇ'

క 'వీరావతార విమలా! చార మహోదార హారశరదిందుసుధా
ధారావధాతగంగా! పూరయశోదార ధీర బుధనుతచరితా
యశస్సార ('ల' ప్రతి) 'ఏ' 'ఏ'

క 'రాజ కులాగ్రగణ్య మృగరాజపరాక్రమ రాజరాజ వి
భ్రాజితశుభ్రకీర్తి పరిపాండుర సర్వదిగంతరాళ ఘో
రాజిముఖోపలబ్ధ విజయప్రమదాశ్రిత బాహుదండని
స్తేజితవైరివీర కులదీప మృడప్రియ విష్ణువర్ధనా 1-1-162

ఈ పై ఉత్పలమాల ఆదిపర్వము ప్రథమాశ్వాసాంతమున గలదు. కొద్దిమార్పులతో నిచ్చట ఆవృతమైనది.
దీనిలో గల కొన్ని పాఠభేదములు
శుభ్రకీర్తి - శుద్ధకీర్తి - ఇ, ఘోరాజిముకావలబ్ధ విజయభ్రమ తాయత బాహుదండ- ద
ప్రమదాశ్రిత - ప్రమదాసిత - ఉ ఒ , మృడప్రియ - బుధప్రియ - ఉ ఒ

ఈ యుత్పలమాలాపద్యము 'ఒ'ప్రతిలో 397వ పద్యము తరువాతను 'ఉ' ప్రతిలో 398వ పద్యము తరువాతను, 'ఇ,క,ద' ప్రతులందు 399వ పద్యము తరువాతను గలదు

2 చరిత్ర విలస దనవద్య దయా ఎ ఓ ర గ యతుల సత్యధన ధాన్యదయా ఈ ఐ క ఝ త శ, షరగ ధర్మసత్య ఆ 3 విభాసి ఏ,ఔ,చ జ ట శ ష, సవిలాసి ఘ సహిష్ణు ఈ ఐ క త 4 మూర్తి ఏ ఓ గ, దేవా ట

"వీరావతార" అను కందపద్యమునకుగల అధికపాఠము లింకను క్రిందజూపబడుచున్నవి

క వీరావతార విమలా! చార బుధాధార వారశరదిందుసుధా
ధారావతారచేతః! పూరయశోదార వీర బుధజనవినుతా' ద డ
ధారావదాతచేతో
హారియశః పూరపూరితాశా వివరా- జ

క వీరావతార విమల, విచార బుధాధార హారశరదిందుసుధా
ధారావదాతచేతః పూరయశోమూర్తి కీర్తి బుధజనకీర్తి- ఒ

399 వసంతతిలకము

[1]శ్రీరమ్యరాజకులశేఖర [2]రాజరాజా, భూరిప్రతాప పరిభూతవిరోధి [3]వర్గా
హారమృతాబ్జహరహాసతుషారకుంద, [4]స్ఫారద్యశఃప్రసర [5]పాండుకృతత్రిలోకా

400 గద్యము ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబున దధీచికథయును నన్నది తృతీయాశ్వాసము

## అరణ్యపర్వము - చతుర్థాశ్వాసము

1.క [1]శ్రీరాజరాజకుల[2]ని, స్ఫారసుధాహార[3]హారసన్నిభకీర్తి
శ్రీరమణ ధనుర్విద్యా, పారగ కోదండపార్థ పార్థివతిలకా

---

399 1 ఇచ్చట నదికపారములు గలవు అవిముందు ప్రదర్శింపబడును 2 రాజరాజ- ఇ ఈ ఊ ఐ ఒ ఘ ఘ,చ,త, ఈ పారమునందొక విశేషము కలదు వసంతతిలకావృత్తము పాదాంతములందు 'గగ'ము లుండ వలసియుండగా నిచ్చట "రాజ" యనుచోట గురువు, లఘువు, మాత్రమే కలదు ఇట్టి పారమే అనగా పాదాంతమున లఘువుగల పారము వావిళ్లప్రతియందు మూడవపాదము చివర కాన్పించు చున్నది "కుందతారాయశ " నన్నయ కిట్టి పద్ధతి యిష్టమేమో తెలియదు దీనికి మరియొక ఉదాహరణము అది 2-240వ పద్యమునందు "రాజనారాయణాఖ్యా" అనుచోట కొందరు "రాజనారాయణాఖ్య" అని గ్రహించుచున్నారు 3 వర్గ- గురువునకు లఘువు 4 తారాయశః- వా ఇచ్చట యతిభంగము స్ఫారద్యశః- కొన్ని తాళప్రతులు 5 పాండురిత- ఎ,ఏ,ఒ,ఓ,చ,ల అధికపారములు

తోటకం ధరణీశ నిరంతర దానాయశః, పరిపూర్ణ దిగంతర భానునిభా చ త.

కరుణాకర నిర్మల కాంతియుతా, శరణాగతరక్షణ సత్యనిధీ
దీనిలో (గల కొన్ని పారభేదములు
రక్షక రక్షణ- ఐ,ఔ,జ
సత్యనిధీ - సత్యయుతా- ఈ ఐ

ఈ తోటక వృత్తము వీ,శ,ష, ప్రతులందు వసంతతిలకమునకు మాఱుగాను, తక్కిన ప్రతులం దధికపారముగాను గలదు

1 1 శ్రీరాజ దేవదేవ పురారాతిపదాబ్జభృంగ యమృతాంశుకులాం
భోరాశిచంద్ర శౌర్యప్రారంభ యశోభిరామ పార్థివభీమా - వా
శ్రీరాజరాజ కులవిస్తార సుధాహార హీర సన్నిభకీర్తి
శ్రీరమణ ధనుర్విద్యాపారగ కోదండపార్థపార్థితిలకా - వీ శ ష, పెక్కుప్రతులు
శ్రీవనితోరస్థల నిజభూవనితాప్రియమనోజ భుజబలవీరా
శ్రీవనితాశ్రయవిద్యా (ప్రియనిత్య) శ్రీవనితానన దిగంత సేవిత కీర్తి - అ ఉ ట.ద 2 తుషార- ఊ స; నీహారసుధాహారహాసహరసిభకీర్తి - స 3. తార స

(గ్రంధకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

2 వ [1]అక్కధకుండు శౌనకాదిమహామునులకుం[2]జెప్పెనట్లు పాండవులు కథాభాగము

. . . . . .

138.క సురచాపచిత్రగగన, [1]స్ఫురణం బురణించునట్లు భూవనిత నిరం
తరచిత్రతయైయొప్పెను, సురుచిర నవతృణ[2]శిలీంధ్ర సురగోపములన్

139 వ తత్సమయానంతరంబున

140 ఉ [1]భూసతికిం దివంబునకు (బొల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై [2]విలసిల్లె మహర్షిమండలో
[3]పాసితరాజహంసగతి [4]భాతి ప్రసన్నసరస్వతీక మ
బ్జాసనశోభితం [5]బగుచు నబ్జజుయానముతో సమానమై

141 ఉ శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దార సమీరసౌరభము తాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూర పరాగపాండురుచిపూరము లంబరిపూరితంబు[1]లై

**నన్నయభట్ట కవిత్వము సంపూర్ణము**

**★ఇక్కడనుండి ఎఱ్ఱాప్రెగడ కవిత్వము★**

142 చ [1]స్ఫురదరుణాంశు [2]రాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతర హంససారసమధువ్రతనిస్వసముల్ సెలంగఁగాఁ
గరము [3]వెలింగె వాసరముఖంబులు శారదవేళఁజూడగన్

---

2. 1 అక్కధికుండు- పెక్కు ప్రతులు 2 జెప్పినట్లు- ఆ ఊ ఎ ఒ ఓ ఘ చ జ ర ల

138 1 స్ఫురణము బురుడించునట్లు - ర వీ, స్ఫురణంబురుణించునట్లు - వా, స్ఫురణంబురణించునట్లు- పెక్కుప్రతులు 2 శిఖీంద్ర ఆ ఈ ఉ ఐ చ ఝ త

140 1 'ఉ' ప్రతిలో - ఈ పద్యముతో ఎఱ్ఱాప్రెగడ కవిత్వమారంభమని యున్నది 2 విలసిల్లు- ఛం 3 ధ్యాసిత - అ.ఒ గ డ ద 4 భాసి - వా, కొన్ని ప్రతులు; బారి ఇ ఏ, భాతి- ఒ ఘ జ.- వీ శ ష 5 బనగ- ఊ ఒ చ

141 1 ఈ పద్యముతో నన్నయభట్ట కవిత్వము సమాప్తమైనదని అన్ని ప్రతులు (ఉ తప్ప)

142 10వ పుట చూడుడు

*గ్రంధకర్త:* గోపినాధ శ్రీనివాసమూర్తి (గోపినాధ వేంకటకవి మనుమని మనుమడు)

143 శా దానాంభః[1]పటలంబునం బృథుపయోధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహిత[2]చ్ఛలన బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గెనాఁ
గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ [3]వనాంతంబునన్

414 వ గువలాశ్వుండు ధుంధుమారుం డైన విధంబు సెప్పెనని వైశంపాయనుండు జనమేజయున కెఱింగించిన తెఱంగు

415 క [1]చరమ యుగచరిత [2]ధర్మ, స్థిరీకరణచతురచరిత ధీగుణలీలా
పరికరపరిచితనయ[3]వి, స్తర వితరణవివరణైకదానవినోదా

416. మాలిని [1]కరివరకిరికూర్మక్ష్మాధరాధీశతుల్యో, ద్ధరణగుణ ధురీణోద్దండబాహార్గళాగ్ర స్ఫురితనిఖిలగోత్రాభోగ భాగైకభోగా, [2]తరుణరుచిరమూర్తీ ధర్మ [3]తంత్రానువర్తీ

గద్యము సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం ..నన్నది చతుర్థాశ్వాసము

---

142 1 ఔ ప్రతిలో ఈక్రిందనున్న పాఠము అధికముగాఁ గలదు
శ్లో మునింస్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాసమకల్మషం।
వేదావాసం సరస్వత్యావాసం వ్యాసం నమామ్యహం।
వ అని
సీ భవ్యచరిత్రుఁడాపస్తం బసూత్రుండు శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూరనార్యునకును పోతమాంబికకును
నందఁనుం డిల పాకనాటిలో నీలకం,ఠేశ్వరస్థానమై యెసగమెసగు
గూడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు,ధన్యుండు ధర్మతాత్పర్యనిరతుఁ
గీ డెఱ్ఱనార్యుండు సకలలోకైక విదుతుఁ, డైన నన్నయభట్ట మహాకవీంద్ర
సరససారస్వతాంశ ప్రశస్తి తన్నుఁ, జెందుటయు సాధుజనహర్ష సిద్ధిగోరి
కం ధీరవిచారుడు తత్కవి, తారూఢియు కొంతదోప, ద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరింపఁగడంగె కర్ణపుట పేయముగాన్
వ అది యెట్లనిన 2. రాగమున- ఇ ఏ 3 వెలుంగె- కొన్ని ప్రతులు.
143 1 ప్రకటంబునం - ర,డ,, కపటంబునం - ఆ ఇ ఏ ఒ ఘ జ ల. 2 చ్ఛలన మాచ్ఛాదించి - అ ఝ, చ్ఛలననాచ్ఛాదించి - ఈ ఐ ఔ త 3 వనాంతంబులన్ - కొన్ని ప్రతులు
415 1. పరమయుగచరిత ధర్మస్థిరకరుణాచతుర- ఇ.ఉ 2 ధర్మస్థిర కర్మాచరణ చతురధీగుణ ఈ ఐ.ఝ, త వీ,శ,ష, ధర్మస్థిర కరుణాచతుర ఊ,ఏ,ఒ,గ,ఘ,ద 3 విస్తరణైక సుధీనిదాన దానవినోదా- ఇ,ఈ,ఎ,ఏ,ఇ,ఝ,త
416 1 కవివరఫణికూర్మ- ఉ.శ,ష 2 ధరణసుఖితమూర్తి- వా, తరుణ విమలమూర్తీ ఈ ఐ త తరుణరుచిర- వీ,శే,ష, కొన్ని ప్రతులు 3 నిత్యానువర్తీ- చ సంధానవర్తీ- ఔ

ग्रంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

## అరణ్యపర్వము - పంచమాశ్వాసము

1.క శ్రీయువతీప్రియ నృపనా, రాయణబిరుదాంక భీమ రమణీయ[1]గుణ
శ్రీయుత నిర్మలధర్మప, రాయణ రవితేజ రాజరాజనరేంద్రా

★ధర్మరాజునకు మార్కండేయుడు పుత్త్రునకుండఁదగు గుణంబులం దెల్పుట★ (సం 3-196-1)

2.వ అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పెనట్లు - (కథాభాగము)

435 వ వైశంపాయన[3]వర్ణితంబయిన కథావిశేషంబు సవిస్తరంబు[4]గా

436 క రాజకులతిలక భువనవి, రాజిత [1]సితకీర్తి దివిజరాజవిభవ ని
ర్వ్యాజపరాక్రమ సకలధ, రాజనసంపూజ్య ధర్మరక్షణదక్షా

437. స్రగ్విణి. సర్వలోకాశ్రయా [1]సౌమ్యభావోదయా, నిర్వికారాకృతీ నిత్యసత్యోన్నతీ
గర్వితోద్యద్భుజాకల్ప కల్పోల్లస, త్సర్వసర్వంసహాచక్ర చక్రాయుధా

438. గద్యము ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతం
బునం దారణ్యపర్వంబునఁ నన్నది పంచమాశ్వాసము.

## అరణ్యపర్వము - షష్ఠాశ్వాసము

1.క [1]శ్రీలలితమూర్తి సుమహ, చ్చాళుక్యవరేణ్య పుణ్యచారిత్ర విచి
త్రాలం[2]కారోజ్జ్వల[3]కవి, తాలాపకలాప[4]సంతతానందమతీ

---

1 1 గుణా- ద

435 3 కథితంబయిన కొన్ని ప్రతులు 4 నక్కథకుండు శౌనకాది మునులకుం జెప్పిన నత్యంత విస్మితమనస్కులై సంతానంబునం బొంగి తర్వాత కథాప్రకారం బంతయు మాయందలి వాత్సల్యంబున వినిపింపవే యనుటయు- ఎ,ల

436 1 చిరకీర్తి- స కొన్నిప్రతులు

437 1 సర్వబోధోదయా- ఔ

438 8 ననుకథలుగల- ఔ,క

1 శ్రీకర శాత్రవరాజివ, శీకర మృగరాజ రాజశేఖరగంగా శీకర యశఃప్రతా పని,రాకర రవితేజ రాజరాజ నరేంద్రా- ఎ స 2 కరణోజ్జ్వల తాస్మేరమతీ- స 3 కలితాలాప- ళ. పెక్కు ప్రతులు 4. సంతత(తా) స్మేరమతీ- స పెక్కుప్రతులు రంజితాత్మీయమతీ- ఈ ఐ త

గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపీనాథ వేంకటకవి మనుమని మనుమడు)

★దుర్యోధనుని విషాదము★ (సం 3-236-1)

2 వ [1]అక్కధకుండు శైనకాదిమహామునులకుంజెప్పెనట్లతిమానుషంబైన .(కథాభాగము)

410 క విమలాక్షాత్ర [1]గుణోన్నత, విమలాదిత్యాత్మజన్మ విలసత్కమలా
రమణీకరకమలోజ్జ్వల [2]విమలాంబుజరేణురాగ [3]విలసితవక్షా

411 వనమయూరము,భూసురకదంబసురభూరుహవికాసో,ద్భాసిత[1]కృపారస విపాక[2]సుగుణైకో[3]
ల్లాస హరహార మృగలాంఛన మృణాళీ, [4]హాసినవకీర్తి [5]విసరాకలితలోకా

412. గద్యము ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన
శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబునందు నన్నది షష్ఠాశ్వాసము

## అరణ్యపర్వము - సప్తమాశ్వాసము

1 క శ్రీకర సోమాన్వయర, త్నాకరహిమధామ ధార్మికాంచితవినయో
త్సేక [1]భువనైకవీర మ, హాకావ్యరసప్రయోజనారూఢమతీ

★రాముడు లక్షణుని సుగ్రీవునొద్దకుఁబంపుట★ (సం 3-266-4)

2 వ అక్కధకుండు శౌనకాదిమహామునులకుం[1]జెప్పెనట్లు (కథాభాగము)

467 వ . ..ధరణీదేవునకు నరణీప్రదానంబుసేసి తత్ప్రయుక్తాశీర్వాదంబులు గైకొని
పరమానందంబు[3] నం బొందిరని యిట్లు పాండుతనయుల వనవాసప్రకారంబు
సవిస్త[4]రమధురంబుగా నుపన్యసించి

---

2 1 అక్కధికుండు - ఈ ఐ గ చ ట త ల

410 1 గుణోజ్జ్వల - ఈ.ఐ 2 విమలోంభోరాశిరాగవిలసిత -ఔ ద, విమలాంబుజ వేణుగాన వికసిత వదనా - ఈ ఐ.త 3 వికసితరక్షా - స ళ, వికసిత దీక్షా - గసళ, విలసితదీక్షా -ద

411 1 కృపాణకరుణైక - ఔ 2 గుణధైర్యో - గ 3 ల్లాసిదరహాస - ఇ ఈ ఉ ఐ త ల్లాసమదహాస ఊ ఎ, ల్లాసదరహాస - ల కొన్ని ప్రతులు, ల్లాసహరహాస - ఔ స ళ 4 హాసనవకీర్తి ఈ చ.త ; హాసనిత - ఊ 5 విలరాళినతలోకా - క

412 8 ఈ గద్యము వివిధ ప్రతులందు వేరువేరు విధములుగా నున్నది

1 1. రమణీయ వరద మహా - ట

2 1 జెప్పినట్లు - పెక్కుప్రతులు

467 3 నంబొందిరవి - పెక్కు ప్రతులు, మానందంబునుంబొందిరి- వా 4 రంబుగా- కొన్నిప్రతులు.

గ్రంధకర్త గోపినాధ శ్రీనివాసమూర్తి (గోపినాధ వేంకటకవి మనుమని మనుమడు)

468 క అనఘుఁడు గృష్ణద్వైపా, యనశిష్యుఁడు బోధనిధి సమంచిత మేధా
ఘనునకు [1]పారిక్షితునకు, ననవరతానంద సుఖసమగ్రత యొసగెన్

469 సీ భవ్యచరిత్రుఁడాపస్తంబసూత్రుండు, శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు [1]సూర, నార్యునకును బోతమాంబికకును
నందనుఁడిలఁ [2]బాకనాటిలో నీలకం, ఠేశ్వరస్థానమై యొసక మెసఁగు
[3]గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు, ధన్యుండు ధర్మైక తత్పరాత్ముఁ
తే డెఱ్ఱనార్యుండు సకల[4]లోకైకవిదితుఁ, డయిన నన్నయభట్టమహాకవీంద్రు
సరస[5]సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ, జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁగోరి

470 క ధీరవిచారుఁడు తత్కవి, తా[1]రీతియుఁగొంత దోప దద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరించెఁ గవీంద్ర కర్ణపుట[2]పేయముగాన్

471 క వీరావతార విమలా, చార మహోదార శుభవిచార సుజనమం
దార [1]నవకీర్తిమౌక్తిక, హార హరపదాబ్జమధుకరాత్మ [2]విహారా

472 తరలము అమితవైభవ లోభమోహ 1మదాదిదుర్లభ మంజువి
భ్రమ [2]విలాసితకామినీజనపంచబాణ నిరంతరా
నమదశేషనృపాలమౌళి [3]పినద్ధముగ్ధ మణిప్రభా
క్రమ [4]సమంచిత విస్ఫురత్పద కాంతినిర్జితపంకజా

గద్యము ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్య పర్వంబునందు నన్నది. సర్వంబును సప్తమాశ్వాసము శ్రీమదాంధ్ర మహాభారతమునందలి యారణ్యపర్వము సమాప్తము

---

468 1 జనమేజయునకు -ఇ ఏ.

469 1 పోతనార్యునకును సూరమాంబకును - ఈ ఐ త 2 బ్రాకనాటిలో - అ ఇ ఏ ద 3 గుడ్లూరి - పెక్కు ప్రతులు 4 కవీంద్రవినుతుడైన - ఒ 5 సారస్వతాంశు - ఘ, సారస్వతాంశ ప్రసక్తి - ఇ ఏ ఔ గ ఘ చ

470 1 రీతియ(యె)-కొన్ని ప్రతులు, రీతియొకింతదోప-ఒ 2.మోదముగాన్ ఊ సేవ్యముగాన్-ఒ

471. 1 నవశుక్తి-ఘ 2 విచారా-ఇ ఏ

472 1 మదాది-ఈ త వీ, భయాది-వా పెక్కుప్రతులు 2 వికాసి విలాసినీ-వా కొన్నిప్రతులు,విలాసితకామినీ- పెక్కుప్రతులు 3 కనద్వైశుద్ధ ఇ ఏ 4 సమర్పిత-అ ఈ ఔ గ ఘ త ద శ ష, సమంచిత-ఇ ఏ చ, సమర్పిత-వా కొన్నిప్రతులు

(గ్రంథకర్త గోపీనాథ శ్రీనివాసమూర్తి (గోపీనాథ వేంకటకవి మనుమని మనుమడు)

**★సంశోధిత ప్రతినుండి తెలియు విషయములు★**

పైసంశోధితభారతపాఠములను పరిశీలించి క్రిందివిషయములను గ్రహింపవచ్చును

(1) 'భూసతికి దివంబునకు' పద్యమునుండి ఎఱ్ఱాప్రెగడ కవిత్వమారంభమని 'ఉ' తాళప్రతిలో ఉన్నది.

(2) 'శారదరాత్రులుజ్జ్వల'పద్యముతో నన్నయభట్టుకవిత్వము సమాప్తమని 'ఉ' తప్ప తక్కినతాళప్రతులలో కలదు

(3) 'ఔ'తాళప్రతిలో క్రిందిపాఠము అధికముగా'స్ఫురదరుణాంశు'పద్యమునకు ముందుకలదు

''శ్లో॥ మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషం
వేదావాసం సరస్వత్యావాసం వ్యాసం నమామ్యహమ్

వ॥ అని

సీ॥ భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు, శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూర, నార్యునకును పోతమాంబికకును
నందనుం డిలపాకనాటిలో నీలకం, రేశ్వరస్థానమై యొసగమెసగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు, ధన్యుండు ధర్మతాత్పర్యనిరతుఁ

తే.గీ॥ డెఱ్ఱనార్యుండు సకలలోకైక విదితుఁ, డైన నన్నయభట్ట మహాకవీంద్ర
సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ, జెందుటయు సాధుజనహర్ష సిద్ధి గోరి

క॥ ధీరవిచారుఁడు తత్కవి, తారూఢియు కొంతదోప దద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరింపఁగడంగె కర్ణపుటపేయముగాన్

వ॥ అది యెట్లనిన''

పైపాఠాంతరములలో 'భూసతికిం'పద్యమునుండి నన్నయరచనకానిచో అరణ్యపర్వశేషరచన తిక్కనదను ప్రబలకారణములకు తా వొసంగును కనుక అరణ్యపర్వశేషములోని సప్తమాశ్వాసాంతమునందలి ఎఱ్ఱన పూరణపద్యము ననుసరించి తర్వాతికాలపువారు ఎఱ్ఱన కవితారంభముగా చతుర్థాశ్వాసమునకు మార్చియుండవచ్చును. ఇట్టి మార్పులు

చేర్పులు లేఖకులు చేయుదురనుటకు ఈక్రింది అప్పకవీయములోని పద్యమును అధారముగ తీసికొనవచ్చును

ఉ॥ నన్నయ ముఖ్యసత్కవిజనంబులు కావ్యములందు లేఖకుల్
గొన్నియు బారకాధములుఁగొన్నియుఁ బోకడబెట్టి తక్కువై
యున్నెడఁ గాంచి జానపదు లోడక దిద్దిన తప్పుత్రోవలె
ల్ల న్నిజమంచుఁగైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే (అప్ప 3-202)

'ఔ' తాళప్రతిలో వలె వ్యాసస్తుతి, ఎఱ్ఱనఅవతారిక పద్యములు, ఈ పద్యముతో నన్నయకవిత్వము సమాప్తము మున్నగువ్రాతలు 'స్ఫురదరుణాంశు' పద్యమునకు ముందు చొప్పించుటయే ఇట్లు లేఖకులు చేయుదురనుటకు సాక్ష్యము శారదరాత్రుల పద్యముతో నన్నయకవిత్వము సమాప్తమని, 'స్ఫురదరుణాంశు' పద్యమునుండి ఎఱ్ఱన కవిత్వమారంభ మనునవి లేఖకులవ్రాతలేకాని కవి చెప్పుకొనినవి కావని దీనినుండి సులభముగా గ్రహింపవచ్చును కనుక ఈపద్యముల తర్వాతవి నన్నయరచనయేనా? లేక తిక్కనరచనా? ఎఱ్ఱనదా? అను పరిశోధన కావ్యరచనాపద్ధతి ననుసరించి, కవులు చెప్పుకొనిన అవతారికావిషయములనుండి నిర్ణయింపవలసిన ఆవశ్యకము కలదు

★కవి నిర్ణయమునకు మూలసూత్రములు★

నన్నయరచన మూడుపర్వము లనుటకు, ఆదిపర్వమునుండి అరణ్యపర్వ చతుర్థాశ్వాస మధ్యవరకున్న రచన ననుసరించియే తక్కిన అరణ్యపర్వశేషమునందును కలదని చూపవలెను

తిక్కనరచన 'భూసతికిం' పద్యమునుండి అని తెలిసికొనుటకు, అరణ్యపర్వ చతుర్థాశ్వాసమధ్య భూసతికింపద్యమునుండి రచన నన్నయరచన కన్న భిన్నమనియును, నిర్వచనోత్తర,విరాటపర్వాదిభారతరచన ననుసరించియున్నదనియు చూపవలెను

స్ఫురదరుణాంశుపద్యమునుండి ఎఱ్ఱనరచన అనితెలిసికొనుటకు, ఆరచన నన్నయతిక్కనల రచనలకంటె భిన్నమనియు, హరివంశ,శ్రీలక్ష్మీనృసింహపురాణ రచనలోని బీజములు అరణ్యపర్వశేషమందు కలవని చూపవలెను అంతేకాక, తిక్కన అరణ్యపర్వశేషకథ రచింపలేదని చెప్పినట్లు చూపవలెను

రసహృదయుడైన పాఠకుడు పైభారతమును చదువునపుడు ఎదుర్కొను అసంగతములు ఇవి

★భారతములోని అసంగతములు, విశేషములు★

(1) అరణ్యపర్వచతుర్థాశ్వాసమధ్యలో నన్నయభట్టుకవిత్వము సంపూర్ణమని 'శారదరాత్రులుజ్జ్వల' పద్యము తర్వాత వ్రాసియుండును వెంటనే 'ఇక్కడినుండి ఎఱ్ఱాప్రెగడకవిత్వము ప్రారంభము'అని 'స్ఫురదరుణాంశు'పద్యమునకు ముందు కనబడును. కాని చతుర్థాశ్వాసాంతమున ఎఱ్ఱాప్రెగడ 'అవతారిక' కానరాదు

(2) ఎఱ్ఱాప్రెగడ కవిత్వము చతుర్థాశ్వాసమధ్యము నుండి ప్రారంభమని చెప్పినను, ఆశ్వాసాంతగద్యమునన్నయపేరుననే, నన్నయరచించినట్లే ఉండును. సప్తమాశ్వాసాంతమున ఎఱ్ఱన తనపేరు చెప్పినప్పుడు, గద్యము నన్నయపేరనే రచింపవలసిన అవసరమేమో, చతుర్థాశ్వాసాంతము వదలి సప్తమాశ్వాసాంతముననే తనపేరు ఎందుకు చెప్పుకొనవలసివచ్చినదో సప్తమాశ్వాసాంతమునకాని, చతుర్థాశ్వాసాంతమునకాని చెప్పలేదు

(3) పంచమ, షష్ఠమాశ్వాసములలో కూడ గద్యము నన్నయ వ్రాసినట్లే ఉండును

(4) ఆరణ్యపర్వము సప్తమాశ్వాసముతోనే ముగియును.భారతమున మరే పర్వమును ఏడుఆశ్వాసములుగా విభజింపబడలేదు నన్నయగారే రచించియుండినచో ఆరణ్యపర్వము పంచమాశ్వాసముగనో, షష్ఠమాశ్వాసముగనో ముగిసెడిదని కథాగమనమునుబట్టి (నన్నయరచించిన తీరునుబట్టి) మన కనుపించును

(5) అరణ్యపర్వసప్తమాశ్వాసాంతమున భారతకథపూర్తి జనమేజయునకు వైశంపాయనుడు చెప్పినవెంటనే, ఎఱ్ఱనఅవతారికరెండుపద్యములలో కలదు తదుపరి రాజరాజప్రశస్తి, నన్నయగద్యము కలదు ఎఱ్ఱన ఆరణ్యపర్వ శేషరచన పూరించినట్లు చెప్పినపుడు, వెంటనే నన్నయ రచించినట్లు నన్నయగద్యము ఎందుకున్నది? ఎఱ్ఱన తన అవతారికలో 'ఆరణ్యపర్వశేషము' 'తత్కవితారీతియు కొంతతోప' 'తద్రచనయకా' 'సాధుజనహర్షసిద్ధికోరి' పూరించితి ననెను. 'తద్రచనయకా' అనగా నన్నయ శయ్యాశైలిరచనవలె రచించెదనని కాని, నన్నయ పేరుననే రచించెద ననికాదు కదా? నన్నయపేరున గద్యముండుటకు కారణమేమి? కవిరచనకు ప్రమాణము శబ్దమే కదా? శబ్దభావమును మీరి ఎందుకున్నది?

(6) ఎఱ్ఱన సప్తమాశ్వాసాంతమున తన అవతారికలో చెప్పుకొనిన విషయము, చతుర్థాశ్వాసాంతమున అదేచోటున చెప్పుకొనవచ్చునుకదా? చతుర్థాశ్వాసమే తన ప్రథమఆశ్వాసాంతరచనమైనపుడు పంచమ,షష్ఠమాశ్వాసాంతములు కూడ నన్నయ పేరుపెట్టి పర్యాంతకథ ముగిసినతర్వాత, అదియును గద్యమునకు ముందు మాత్రమే రచింపక, రాజరాజప్రశస్తికి ముందు మాత్రమే తన అవతారిక రచించుటకు హేతువేమి? దీని భావము-తన అవతారిక తరువాత రచించిన 'రాజరాజప్రశస్తే' తాను రచించితినను భావమా? 'భాసురభారతార్థముల భంగులు నిక్క మెఱుంగనేరమిన్ వ్యాసమునిప్రణీత పరమార్థము తెల్లగఁజేసినట్టి యబ్జాసనకల్పులం దలతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్' అను ఎఱ్ఱన నృసింహపురాణపద్యపాదములు భారతకథాభాగరచన నన్నయతిక్కలదే అని తెలియజేయుటలేదా?

(7) 4864 వ్యాసశ్లోకములను అరణ్యపర్వశేషకథయందు ఎఱ్ఱన తెలిగించినచో వ్యాసస్తుతి చేసెడివాడు కాని ఎఱ్ఱన సప్తమాశ్వాసాంతమున వ్యాసస్తుతి చేయలేదు ఎందుకు? సప్తమాశ్వాసాంతము చేరిన తర్వాత భయమేమియు లేదుకదా.తనపేరు కడపట చెప్పినపుడు ఏవిషయమునకాని దాపరికమేమి?

(8) ఎఱ్ఱన, నన్నయస్తుతి చేయలేదు తిక్కనస్తుతి చేయలేదు నన్నయ సారస్వాతాంశప్రశస్తి తనకెట్లు చెందినదో చెప్పలేదు కాని తదుపరికావ్యమైన నృసింహపురాణ, హరివంశములలో నన్నయ, తిక్కనల స్తుతి కలదు దీనికి కారణమేమి?

పై విషయముల మధ్యనున్న సందేహములను తిక్కన, ఎఱ్ఱన వ్రాసుకొనిన విషయములతో సంగతముచేసినచో అనుమానములు పటాపంచలై తిక్కన, ఎఱ్ఱనలు ఎవరెవరు ఏదేది ఎక్కడెక్కడనుండి వ్రాసినది సత్యప్రకాశమగును. తిక్కన, ఎఱ్ఱనలు ఇరువురును మహానుభావులు, మహాకవులు అనుటలో నెట్టి సందేహమును లేదు కాని వారివారి పదములలో ప్రకాశించుభావము ఏకీకృతమై (అంగీకరించి రెండు ఒకే భావమును ప్రకాశింపచేసి) సహృదయుల నలరింపవలెను. కావున ఇద్దరు ప్రయోగించిన పదములతో ఇరువురు చెప్పుకొనినది, సత్యమై భాసించు విధమున, వారి అంతరార్థములను సమన్వయము చేసికొనెదము.

*గ్రంథకర్త* గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

కవిఊపిరి శబ్దబ్రహ్మము శబ్దబ్రహ్మము నుపాసించుకవి తన ఆత్మతపఃఫలమున, తన ఆలోచనాపరంపరను శబ్దములలో నిక్షిప్తము చేయును కనుకనే మహాకవులను సాధారణకవులను వేరుపరచునది, అంతఃకరణమునకు ప్రమాణమైన వారిశబ్దమే తను చెప్పదలచిన పదములలో, తన ఇతరసంకల్పములను కూడ వెదజల్లుశబ్దములనే ఎన్నుకొని మహాకవి ప్రయోగించును కవి అంతఃకరణమును తెలుసుకొనుటకు కవి ప్రయోగించిన పదములే పరితలకు మార్గమైన అడుగుజాడలుగా ఆధారము క్షరముకాని రమ్యమైన యట్టి కవిప్రయోగ అక్షరసముదాయములే రమ్యపదమని, అట్టి పదములు కలిగినందున సరసపాదమనియు, ఆపాదములు రసభరితముగ ఆవేశపూరితఛందమున వెలువడునని వాల్మీకి చెప్పిన అనుభవపుమాట కనుక తిక్కన, ఎఱ్ఱన ప్రయోగించిన శబ్దములను సూక్ష్మముగా పరిశీలింతము. అంతకుముందు తిక్కన, అవతారికలోని విశేషములను పరిశీలింతము

**★తిక్కన అవతారికలోని విశేషములు★**

(1) నన్నయ, తిక్కనల భారతము 18 పర్వములకు పెంచబడియుండగా నన్నయ 'అదిదొడంగి మూడుకృతులు' రచించెననెను. భారతము పూర్తి తెలుగు చేసియున్నకాని తిక్కన, దానిలో కొంతభాగము నన్నయ రచించెనని చెప్పడు. అట్టిచో మూడుపర్వములు రచించెననుటతో సరిపోగా, 'అది దొడంగి' అని 'కృతులు' అని నన్నయ రచనాభాగమును చెప్పవలసిన అవసరమేమి? భారతము పర్వములతో నన్నయ,తిక్కనలు రచించిరని చెప్పినపుడు మూడుపర్వములు లేక మూడుఆశ్వాసములు అనిచెప్పక, కృతి అని మరొక పదమును ఎందుకు ప్రయోగించెను?

(2) ఊర్జితకథోపేతము ఆరణ్యపర్వమా? విరాటపర్వమా? ఊర్జితకథోపేతమని వృద్ధిపొందిన ఆరణ్యపర్వమును సూచించుట ఆరణ్యపర్వమధ్యనుండి శుభదాయక కొనసాగింపునకా? రసపరముగా విరాటపర్వమునకు, కథాపరముగ ఆరణ్య పర్వమునకు అన్వయించు శ్లేషకొఱకా?

(3) నన్నయకు 150, 200 సంవత్సరముల తర్వాత రచించిన తిక్కన కాలము వరకు, నన్నయ మూడుపర్వముల పూర్తిరచన ఉన్నచో, తిక్కనతర్వాత భారత సంపూర్ణరచన మున్నచో, తిక్కన నభిమానించు సహృదయుల సమక్షములో

నన్నయ చివరిభాగ అరణ్యపర్వరచనమాత్రము ఎఱ్ఱన పూరించుట కెట్లు నష్టమై పోయినది? దీనిలో తిక్కన అంతరార్థమేమి? లేక పూరించిన ఎఱ్ఱన, అష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై, సంవృతమై పెనుపొందిన భారతములో ఎందుకు పూరింపవలసి వచ్చినదో తెలుపవలసిన అవసరము లేదా?

(4) తిక్కన రచించిన 'కిమస్థిమాలాం' శ్లోకము, హరిహరనాథుని మెప్పు వడసి తనకు దర్శనమిచ్చుటే కాక, తిక్కనతండ్రినికూడ వెంటపెట్టుకొని వచ్చినట్లు చెప్పిన శ్లోకము సాధారణశ్లోకమా?కానిచో'మానిషాద'అనుశ్లోకము రామాయణార్థమును ధ్వనించిన విధమున భారతపరమైన గూఢార్థము తిక్కన ధ్వనించెనా?

(5) తిక్కనకు కలలో హరిహరనాథుడువచ్చి 'పంచమవేదమైన భారతము జనులకు ఆరాధ్యము' ఆ'గౌరవమూహించి, నీ వఖండితభక్తిన్', 'తెలుగుబాస వినిర్మింప' తలచుట, సమ్మతించి, 'వేడ్కనూని కృతిపతిత్వ మర్థించి వచ్చితి తిక్కశర్మ' అని అమృతము వంటిపలుకులు పలికిన భగవంతునికి 'భవత్కారుణ్యక్షీరాంబుధి నాదు తుచ్ఛచిత్తంబున విస్తారమహితముగ నునిచితి, వారయ నచ్చెరువుకాదె యఖిలాండవతీ!' అని భారతరచన మొదలిడిన తిక్కన, అరణ్యపర్వశేషరచన వ్రాయనిచో, రచించినది ఖండితభారతభాగమేగాని, భారతమెట్లగును? అది భగవదాదేశభంగముకాదా? ఇందు'అఖండితభక్తిన్''తెలుగుబాస'అని పూర్తిచేయ వలసిన భావమును కందపద్యమున చివరపదముగ, తేటగీతి ప్రథమపదముగ విభజించుటలో, ఏమైన విశేషముకలదా? 'నిర్మింప' కాక, 'వినిర్మింప' అని వాడుటలో ఏమైన విశేషము కలదా?

(6) షష్ఠ్యంతములు కాగానే 'కథాప్రారంభము' అని విభాగముచేసి కథ ప్రారంభింపక, అంతస్సన్నిధి కలిగించుకొని మూడు ఆశ్వాసములను మూకుమ్మడిగా, 'శ్రీ' పద ప్రారంభము లేని మూడు పద్యములకు ఒకే సంబోధనతో హరిహరనాథుని సంబోధించు కందపద్యములు (ఆశ్వాసారంభములను గుర్తుచేయువంటివి) వ్రాయుటలోని ఆంతర్యమేమి? ఇది అరణ్యపర్వ మధ్యలో వచ్చు పంచమ, షష్ఠమ,సప్తమాశ్వాసములు తిక్కనరచించిన సంకేతమా? కథాప్రారంభమని అంతస్సన్నిధి కలిగించుకొని చెప్పిన పద్యములతర్వాత వ్రాయవచ్చునుకదా? దీని(కథను రచింపని) అంతరార్థమేమి?

(7) షష్ఠ్యంతములలో 5 కందపద్యములు చెప్పెనుకదా, అంతస్సన్నిధి కలిగించుకొని 5 సంబోధనాపద్యములు తిక్కన ఎందుకు వ్రాయలేదు? మూడుపద్యములలోని ఆంతర్యమేమి? 'ఏపట్టునఁ బూజ్యమూర్తియగు భారతసంహితఁ జెప్పగంటిన్, ఆపుట్టుఁ గృతార్థతంబొరసె'' లోని అంతరార్థమేమి? 'ఏను విన్నపంబుసేయు తెలుంగుగా నంతసన్నిధిం గలిగించుకొని యమ్మహాకావ్యంబునర్థంబు సంగతంబు సేసెద' అనిన దాని అంతరార్థమేమి?

(8) 'దేవా దివ్యచిత్తంబున అవధరింపుము' అని తిక్కన 'కథ జగత్ప్రసిద్ధిగావున' పద్యమును రచించెను. ఈ విషయములోని 'పూర్వ పర్వ అర్థయుక్తి'ని గురించి అవతారికలోనే చెప్పకొనవచ్చునుకదా? భగవంతుడు ప్రత్యక్షమైనపుడు స్వయముగ ఎందుకు చెప్పలేదు మామూలు చిత్తమునకాక 'దివ్యచిత్తమున' లోని అంతరార్థమేమి?

పై విషయములను చర్చింపక తిక్కన ఆరణ్యపర్వశేషమును రచింపలేదనుట అపచారము కనుక పైవిషయములను విశదీకరించుచు మునుముందు చెప్పిన అనుమానములను, విశేషములను కూలంకషముగా చర్చించి సందేహనివృత్తి చేసికొనవలసిన అవసరము కలదు తద్వారా తిక్కన, ఎఱ్ఱనలమాటలను సమన్వయ పరచుకొనవలసిన అగత్యము కలదు.

★చతుర్థాశ్వాసముయొక్క ప్రత్యేకత★

ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు ప్రచురించిన శ్రీమదాంధ్ర మహాభారత సంశోధితప్రతులకు అనుబంధముగా గద్యపద్యప్రథమపాదసూచికలను యిచ్చియున్నారు అరణ్యపర్వసంశోధితప్రతిలోని గద్యపద్యప్రథమపాదసూచికలను సూక్ష్మముగా పరిశీలించిన ఈక్రిందివిషయములను తెలిసికొనగలము

(1) నన్నయ 'మఱియునుంగాక', మఱియును, మఱియు, అంత, అంతనట, అయ్యవసరంబున, అట్టియవసరంబున, అను ఏకపదవచనములను తనగ్రంథమునందు రెండు భిన్న పద్యములలో నున్న రెండు ముఖ్యవాక్యములకు సంబంధము కల్పుటకై ప్రయోగించియున్నాడు. ఇట్లు నన్నయ ప్రయోగించిన సంబంధపదములుకాక వేరైనవి అరణ్యపర్వచతుర్థాశ్వాసమున ఏకపదవచనము లుగా సమాసముగా,'తత్సమయానంతరంబున' (3-4-139) 'అనివెండియు'

(3-4-155) 'కావున' (3-4-165, 385) 'తదనంతరంబ' (3-4-226, 244) అనునవి ప్రప్రథమముగా దర్శనమిచ్చును.

(2) 'మఱియును' అను ఏకపదవచనము(ఆది 1-23; 4-18,84, 5-221, 6-7,94, 7-23, 8-184, 220) (సభా 1-12, 20, 65, 211, 2-285) (అరణ్య 2-94, 3-149, 4-92)లలో ప్రయోగింపబడియున్నది ఆదిపర్వ ద్వితీయ, తృతీయ, ఆశ్వాసములందును, సభాపర్వద్వితీయాశ్వాసమునందును, అరణ్యపర్వ ప్రథమాశ్వాసమునందును 'మఱియును'అను ఏకపదవచనము నన్నయ ప్రయోగింపబడలేదని పై వివరములనుండి గ్రహింపగలము. పైనున్న అన్ని ఆశ్వాసములకంటే అరణ్యపర్వ చతుర్థ, పంచమ, షష్ఠమ, సప్తమాశ్వాసములలో గద్య పద్య సంఖ్య ఎక్కువ అయినను పై పేర్కొనిన వానికంటే ఒక్కటైనను ఎక్కువగా ఎందుకు ప్రయోగింపబడలేదు

(3) ఆదిపర్వమునుండి అరణ్యపర్వ తృతీయాశ్వాసమువరకు గల 13 ఆశ్వాసములలో 36 మధ్యాక్కరలు రచింపబడియున్నవి చతుర్థాశ్వాసమున 3, 48, 102, 309లలో 4 మధ్యాక్కరలు ఉన్నవి తరువాత 3 ఆశ్వాసములలో లేనేలేవు 309లోని మధ్యాక్కర యతిస్థానమున తక్కిన 39 మధ్యాక్కరలకంటే భిన్నముగ నున్నది కనుక 102, 309 మధ్యలో కవి మార్పు సూచించుచున్నది

(4) ఆది,సభాపర్వములలో లేని తిరిగితిరిగి ప్రయోగింపబడు పద్యపు ఎత్తుగడలు అనుటయు (3-4-193) 'ఇవ్విధంబున' (3-4-306) 'అనుడు' (3-4-362) 'అధిప' (3-4-391) అరణ్యపర్వ చతుర్థాశ్వాసముననే ప్రప్రథమముగా దర్శనమిచ్చును

(5) 'పాల్వెసగంగ', 'ఆసకల' 'పొంపిరివోయి'అను నూతనపదములు అరణ్యపర్వ చతుర్థాశ్వాసముననే ప్రప్రథమముగా దర్శనమిచ్చును

(6) ఏఆశ్వాసమునను లేనన్ని'మత్తకోకిల'పద్యములు అరణ్యపర్వ చతుర్థాశ్వాసముననే కన్పించును.

(7) వ్యాసభారతమునందలి వన(అరణ్య)పర్వమున లేని సరస్వతీదేవిని స్తుతించు పద్యము, అరణ్యపర్వచతుర్థాశ్వాసముననే కలదు

(8) వ్యాసభారతమునందలి స్త్రీపర్వములోని శ్లోకములభావము అరణ్యపర్వ చతుర్థాశ్వాసమున ఉన్నట్లు సంశోధిత ప్రతిపారాంతరములు తెలియజేయుచున్నవి

(గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

పైమార్పులన్నియు చతుర్థాశ్వాసమునందే ప్రారంభింపబడియుండుట చతుర్థాశ్వాసమధ్యలో కవిమార్పు సూచితము పైమార్పు (4-102) మధ్యాక్కర(4-139) 'తత్' పదముతో కూడిన తొలి ఏకపదసమాసవచనముల మధ్య ఉండునని పై ప్రయోగములు సూచించును కనుక ఇరువురుకవుల సంకలితమైన చతుర్థాశ్వాసమును తీసివేసినచో ఇరువురికవుల విడివిడి రచనలు ప్రత్యక్షమగును దానిని పరిశీలించుటకు మొదటిమూడు అరణ్యపర్వఆశ్వాసములకు, కడపటిమూడు ఆశ్వాసములకు ఆధారమైన వ్యాసముని భారతశ్లోకసంఖ్యను, సంశోధిత గద్యపద్యములతో సరిపోల్చి దృఢపరచుకొందము

| విషయము | నన్నయ మొదటిమూడు ఆశ్వాసముల మొత్తము | నూతనకవి కడపటి మూడు ఆశ్వాసముల మొత్తము | |
|---|---|---|---|
| ఆధారమైన వ్యాసశోకములు | 5375 | నన్నయ 690పద్యములకు సరియగునూతనకవి 903 పద్యములకు సమాన పద్యసంఖ్య | 3795 |
| సంశోధితప్రతి గద్యపద్యములు | 1157 | | 1320 |
| అందులో వచనములు | 467 | | 417 |
| పద్యములు | 690 | | 903 |
| ఉత్పలమాల | 33 | 82 5 | 108 |
| చంపకమాల | 49 | 84 | 110 |
| మత్తేభము | 9 | 44 3 | 58 |
| శార్దూలము | 2 | 8 4 | 11 |
| కందములు | 341 | 255.2 | 334 |
| సీసములు | 69 | 65 | 85 |
| సీసములలో ఆటవె ఎత్తుగడ కలవి | 63 | 40 5 | 53 |
| సీసములలో తేటగీ ఎత్తుగడ కలవి | 6 | 24 5 | 32 |
| ఆటవెలది | 76 | 65.1 | 80 |
| తేటగీతి | 68 | 69.5 | 91 |
| మధ్యాక్కరలు | 20 | -- | - |

ఏకవియైనను విశేషపద్యములను కొన్నియే రచించును. కనుక ఈ సరిపోల్చుటలో వాటిని త్యజించదమైనది

వృత్తభేదమునకు కొంతవరకు కథాభేదము కారణమైనను, ప్రతి అంశమునందును చాలభేదము కనబడుటకు ముఖ్యకారణము కవిమార్పే అనకతప్పదు దీనికి బలమునిచ్చు అంశములు క్రిందచూడవచ్చును

(1) మూలమునలేని వ్యూహరచన అరణ్యపర్వములోని రామరావణయుద్ధమున కనబడును

(2) చతుర్థాశ్వాసమున క్రొత్తగా దర్శనమిచ్చిన .ఏకపదవచనములేకాక 'అయ్యవసరంబున' (3-6-57) 'ఇవ్విధంబున' (3-6-379) 'అని యడుగుటయు' (3-7-441) అను ఏకపదవచనములు ప్రప్రథమముగా భారతమున అరణ్యపర్వ షష్ఠమ, సప్తమాశ్వాసములలో దర్శనమిచ్చును

(3) 'అగుగాక' (3-5-338) 'నావిని' (3-5-358) 'అకట' (3-5-408) 'ఆలోనన' (3-6-8) 'అకటకట' (3-6-20) 'అనవిని' (3-6-293) 'నావుడు' (3-7-226) అను తిరిగితిరిగి ప్రయోగింపబడిన నూతన ఎత్తుగడలు భారతమునందున్న వాటిలో కొన్ని మాత్రమే యివ్వబడినవి ఇవి భారతమునం దంతటను అరణ్యపర్వమందలి పైమొదటి పద్యములనుండే దర్శనమిచ్చును

(4) 'నావుడు', 'అనవుడు' పదముల ఎత్తుగడలు కాని, పదప్రయోగముకాని ఎక్కువగా యిక్కడనుండే కన్పడును

(5) ఇంద్రజిత్తును 'ఇంద్రజి' (3-7-121) అని ప్రయోగించుటవంటి నూతన ప్రయోగములు అరణ్యపర్వమునుండే ప్రారంభమగును.

(6) పద్యరచనయందు చిరస్థితిని కాక క్షణక్షణమార్పు పొందు చరస్థితులను వర్ణించుట అరణ్యపర్వమధ్యమందే ప్రారంభమగును

(7) అరణ్యపర్వశేషరచన నన్నయ రచించినట్లు గద్యమున తెలుపుచున్నను, తిక్కన రచనా చాయ అత్యధికముగ గోచరించుచున్నది ఎఱ్ఱన నృసింహపురాణ, హరివంశములలో తిక్కన, నన్నయలను స్తుతించి, అరణ్యపర్వ శేషాంతమున తిక్కనను స్మరింపక అరణ్యపర్వశేషమును పూరించితిననెను కనుక పూరించినది అరణ్యపర్వశేషకథనా? రాజరాజప్రశస్తా? నన్నయ సారస్వతాంశప్రశస్తి అనగా భావమేమి? పరిశీలింపవలసిన అవసరము కలదు

గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపీనాథ వేంకటకవి మనుమని మనుమడు)

(8) నన్నయ రచింపని 'స్రగ్విణి' వృత్తము తిక్కన రచించెను ఆ వృత్తము అరణ్యపర్వ పంచమాశ్వాసమున కలదు అది నన్నయ సారస్వతాంశ ప్రశస్తియా? ఎట్లగును?

**★ఎఱ్ఱన రచనలోని సందేహములు★**

ఎఱ్ఱన అరణ్యపర్వశేషమును పూరించినట్లు ఈక్రిందివిధముగా చెప్పుకొనెను (3-7-469 నుండి 472)

గీ॥ ఎఱ్ఱనార్యుండు సకలలోకైక విదితు, డైన నన్నయభట్టమహాకవీంద్రు
సరససారస్వతాంశప్రశస్తి తన్ను, (జెందుటయు సాధుజనహర్షసిద్ధిగోరి

క॥ ధీరవిచారుఁడు తత్కవి,తారీతియుఁ గొంతదోప తద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్

క॥ వీరావతార విమలా,చార మహోదార శుభవిచార సుజనమం
దార నవకీర్తిమౌక్తిక,హార హరపదాబ్జ మధుకరాత్మవిహారా

తరలము॥ అమితవైభవ లోభమోహభయాది దుర్లభ మంజువి
భ్రమవికాసి విలాసినీజనపంచబాణ నిరంతరా
నమదశేషనృపాలమణి పినద్ధముగ్ధమణిప్రభా
క్రమసమర్చిత విస్ఫురత్పద,కాంతినిర్జితపంకజా,

శ్రీమదాంధ్రమహాభారతమున రెండుఅంశములు కలవు ఒకటి వ్యాసాంశ కథ అనగా వ్యాసభాగమైన భారతకథ రెండవది నన్నయసారస్వతాంశప్రశస్తి అనగా నన్నయ సారస్వతభాగమైన (రాజరాజ) ప్రశస్తి. ఈ రెండు ఎఱ్ఱన రచించెనా? లేక రాజారాజప్రశస్తి మాత్రమే రచించెనా? అను విషయము పరిశీలింపవలెను.

ఎఱ్ఱనఅవతారిక,అరణ్యపర్వశేషకథ పూర్తియైనతర్వాత పైచూపిన పద్యములలో చెప్పుకొనెను దానితర్వాత రాజరాజప్రశస్తిపద్యములు రెండు ఉన్నవి కనుక ఎఱ్ఱన రచించినది అవతారికముందరి కథయా? లేక అవతారికతర్వాతి రాజరాజప్రశస్తియా?

భారతకథను, రాజరాజప్రశస్తి రెండు భాగములను రచించినచో చతుర్థాశ్వాసాంత కథ ముగిసిన తర్వాత తన అవతారిక రచించియుండవచ్చునుకదా ఈ సందర్భమున 'కై' తాళప్రతిలోని పాఠాంతరములను గుర్తు చేసికొనుట అవసరము అందు వ్యాసస్తుతి

ఉన్నది సప్తమాశ్వాసాంతమున వ్యాసస్తుతి లేదు చతుర్థాశ్వాసమున లేఖకులు చొప్పించిరని కనుక దానిని తీసివేయబడినదని భావింపవచ్చును వ్యాసస్తుతి లేక, నన్నయ,తిక్కనల స్తుతులు లేక ఎఱ్ఱన కథరచించియుండు ననిభావింప వీలులేదు పైగా అరణ్యపర్వశేషమును రచించితినని చెప్పక పూరించితినని చెప్పుటవలన, కథ రచించియుండుననుట సందేహాస్పదమే కనుక రాజరాజప్రశస్తి భారతకథ రచనలను సూక్ష్మముగా పరిశీలింతము

★ఎఱ్ఱన రచన పరిశీలనము★

ఎఱ్ఱన రాజరాజప్రశస్తిని పరిశోధించి శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు 'ఆంధ్రవాఙ్మయారంభదశ' గ్రంథమునందు నన్నయ భారతములోని 'నన్నయభారతము - రాజరాజు చిత్రీకరణ'యందు యిట్లు తెలిపియున్నారు

| ఆశ్వాసము | ఎఱ్ఱన రచన | | నన్నయ మూలము |
|---|---|---|---|
| 5 | శ్రీయువతీప్రియ | | -- |
| | నృపనారాయణ | . | రాజనారాయణ |
| | బిరుదాంకభీమ | | బిరుదాంకభీమ |
| | రమణీయగుణశ్రీయుత | | గుణరాజిత |
| | నిర్మలధర్మపరాయణ | . | నిత్యనిరంతరధర్మమతీ |
| | రవితేజ | | విభాకరతేజ |
| | రాజకులతిలక | .. | రాజాన్వయతిలక |
| | భువనవిరాజితసితకీర్తి | . | జగత్పరిపూజితకీర్తివిభాసి |
| | దివిజరాజవిభవ | . | హరినిభవిభవ |
| | నిర్వ్యాజపరాక్రమ | | -- |
| | సకలధరాజనసంపూజ్య | . | భూజనపూజ్యమాన |
| | ధర్మరక్షణదక్షా | .. | ధర్మధురంధర |
| | సర్వలోకాశ్రయా | . | సర్వలోకాశ్రయా |
| | సౌమ్యభావోదయా | .. | విమలవిచార |
| | నిర్వికారాకృతీ నిత్యసత్యోన్నతీ గర్వితోద్యద్భుజాకల్పకల్పోల్లసత్ సర్వంసహాచక్ర | . | నిఖిలవలయోద్యయ బాహు |

(గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

| | | |
|---|---|---|
| | చక్రాయుధా | విష్ణుమూర్తీ |
| 6 | శ్రీలలితమూర్తి | -- |
| | సుమహచ్చాళుక్యవరేణ్య పుణ్యచరిత | శ్రీమచ్చళుక్యకుల శిఖామణి |
| | విచిత్రాలంకారోజ్జ్వలకవితాలాపకలాప | కావ్యగీతిప్రియ |
| | సంతతానందమతీ | సంతతస్మేరమతీ |
| | విమలక్షాత్రగుణోన్నత విమలాదిత్య } | |
| | జన్మ విలసత్కమలారమణీయకర } | విమలాదిత్యతనూజ |
| | కమలోజ్జ్వల విమలాంబుజరేణురాగి } | |
| | విలసితవక్షా } | -- |
| | భూసురకదంబసురభూరుహ | ధరణీసురవరసురభూజ |
| | వికాసోద్భాసితకృపారసవిపాక | కరుణారసపూర్ణ |
| | సుగుణైకోల్లాస | భూరిగుణరత్నభూషణ |
| | హరహాసమృగలాంఛనమృణాళీ } | . విశుద్ధయశశ్శరదిందు |
| | హాసి నవకీర్తి విసరాకలితలోకా } | చంద్రికారాజితసర్వలోక |
| 7 | శ్రీకర సోమాన్వయరత్నకరహిమధామ | శీతాంశువంశప్రకాశీ |
| | ధార్మికాంచితవినయోత్సేక భువనైకవీర | . వినయసత్యనిత్యోదయా |
| | మహాకావ్యరసప్రయోజనారూఢమతీ | -- |
| | వీరావతార | వీరావతార |
| | విమలాచార | విమలాచార |
| | మహాదారశుభవిచార | విమలవిచార |
| | సుజనమందార | విశిష్టాంభోజవనమిత్ర |
| | నవకీర్తిమౌక్తిహార | . శుభయశఃపరిశోభిత |
| | హరపదాబ్జమధుకరాత్మవిహార | .. పురారాతిపూజనాసక్తమతీ |
| | అమితవైభవ | హరినిభవిభవ |
| | లోభమోహభయాది దుర్లభ | వ్యసనవివర్జిత |
| | మంజువిభ్రమవికాసివిలాసినీజనపంచబాణ | యువతీమదన |
| | నిరంతరావనమదశేషనృపాలమౌళీ } | . నానావనీనాథకిరీట |
| | మూర్ధమణిప్రభక్రమసమర్చిత } | తటీవిలసద్రత్నసం |
| | విస్ఫురత్పదకాంతినిర్జితపంకజా } | ఘటితపదకమలా |

(గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

4. చరమయుగచలితధర్మస్థిరీకరణ
చతురచరిత } . కలికాలభరత
ధీగుణలీలాపరికర విమలధీరమణ
పరిచితనయవిస్తర నయబంధుర
వితరణ వివరణైక దానవినోదా దానవినోదా
కరివరహరికూర్మక్ష్మాధరాధీశ తుల్యోద్ధరణ
గుణధురీణోద్ధండ బాహార్గళాగ్ర
స్ఫురితనిఖిలగోత్రా భోగ
భాగ్యైకభోగా తరుణసుఖితమూర్తి ---
ధర్మతంత్రానువర్తీ ధర్మనిరత

ఎఱ్ఱన అరణ్యపర్వశేషమున రచించిన ఆశ్వాసాంతపద్యములను వాటి ఛందోవివరములను నృసింహపురాణ, హరివంశములలో రచించిన విధమును పరిశీలింతము

అరణ్యపర్వచతుర్థాశ్వాసాంతమున 1 కందము 1 మాలిని
అరణ్యపర్వ పంచమాశ్వాసాంతమున 1 కందము 1 స్రగ్విణీ
అరణ్యపర్వ షష్ఠమాశ్వాసాంతమున 1 కందము 1 మయూరము
అరణ్యపర్వ సప్తమాశ్వాసాంతమున 1 కందము 1 తరలము
నృసింహపురాణ ప్రథమాశ్వాసాంతమున 2 కందములు 1 మాలిని 1 వనమయూరము
నృసింహపురాణ ద్వితీయాశ్వాసాంతమున 2 కందములు 1 భుజంగప్రయాతము 1 స్రగ్విణీ
నృసింహపురాణ తృతీయాశ్వాసాంతమున 1 కందము 1 పృధ్వీవృత్తము 1 మాలిని
నృసింహపురాణ చతుర్థాశ్వాసాంతమున 2 కందములు 1 మందాక్రాంత 1 అంబురుహవృత్తము
నృసింహపురాణ పంచమాశ్వాసాంతమున 1 కందము 1 శార్దూలము 1 మాలిని
హరివంశప్రథమ,తృతీయ,చతుర్థ,అష్ఠమాశ్వాసాంతములందు 1శార్దూలము 1కందము 1మాలిని
హరివంశ ద్వితీయ, షష్ఠమ, సప్తమాశ్వాసములందు 1 ఉత్పలమాల 1 కందము 1 మాలిని
హరివంశ పంచమ, నవమాశ్వాసములందు 1 మత్తేభము 1 కందము 1 మాలిని
హరివంశ ఉత్తర ప్రథమ, సప్తమాశ్వాసములందు 1 ఉత్పలమాల 1 కందము 1 మాలిని
హరివంశ ఉత్తర ద్వితీయాశ్వాసమునందు 1 మందాక్రాంత 1 కందము 1 మాలిని
హరివంశ ఉత్తర తృతీయాశ్వాసమునందు 1 స్రగ్ధర 1 కందము 1 మాలిని
హరివంశ ఉత్తర చతుర్థాశ్వాసమునందు 1 శార్దూలము 1 కందము 1 మాలిని

హరివంశ ఉత్తర పంచమాశ్వాసమునందు 1 మత్తేభము 1 కందము 1 మాలిని
హరివంశ ఉత్తర షష్ఠమాశ్వాసమునందు 1 తరలము 1 కందము 1 మాలిని
హరివంశ ఉత్తర అష్టమాశ్వాసమునందు 1 తోదకము 1 కందము 1 మాలిని
హరివంశ ఉత్తర నవమాశ్వాసమునందు 1 క్రౌంచపదము 1 కందము 1 మాలిని
హరివంశ ఉత్తర దశమాశ్వాసమునందు 1 కందము.

నన్నయ ఆదిపర్వ ప్రథమాశ్వాసాంతమున, సభాపర్వ ద్వితీయాశ్వాసాంతమున మూడు పద్యములు రచించి తక్కిన ఆశ్వాసాంతములందు రెండు పద్యములు (1 విశేషవృత్తము, 1 కందము) రచించినాడు తిక్కన తన ఆశ్వాసాంతములందు మూడు పద్యములు 1 వృత్తము 1 కందము 1 మాలినీవృత్తము రచించినాడు అరణ్యపర్వ అశ్వాసాంతములందు ఎఱ్ఱన తన పద్ధతిని మాని తిక్కనవలె కాక నన్నయవలె 2పద్యము(1 కందము 1 విశేషవృత్తము)లనే రచించి నన్నయ కొన్ని అక్షరముల (కతిపయాక్షరముల)నే వాడి నన్నయ విశేషణ పర్యాయపదములు కాని, తద్భావములను కాని ప్రకాశపరచి నన్నయ శయ్యాశైలి యనునట్లు 'తద్రచనయకా' పై పద్యములను రచించినాడు. నన్నయవలె అవతారిక పరోక్షముగ రచించుటచేత 'తత్కవితారీతియు కొంతదోప' 'తద్రచనయకా' అని రచనకాక పూరణచేసి నట్లే తెలుపుకొనినాడు

పై పట్టికను పరిశీలించిన అరణ్యపర్వమునందలి చతుర్థ, పంచమ, షష్ఠమ, సప్తమాశ్వాసాంతములందు వరుసగా మాలిని, స్రగ్విణి, వనమయూరము, తరల విశేషవృత్తములను రచించినట్లు గమనింపగలము 'నన్నయ సారస్వాతాంశప్రశస్తి' తన్ను చెందినదని, 'తత్కవితారీతియు కొంతదోప', 'తద్రచనయకా' పూరించెదనన్న పై రచనలో 'స్రగ్విణీ'వృత్తరచన తిక్కనమాత్రమే రచించెనుకాని నన్నయకథయందుకాని అశ్వాసాంతపద్యములలోకాని రచింపలేదు. నన్నయ 'మాలిని', 'మయూర'వృత్తములను ఆదిపర్వషష్ఠమ,పంచమాశ్వాసాంతములందు రచించినను, 'స్రగ్విణీ','తరల' వృత్తములను ఆశ్వాసాంతములందు రచింపలేదు.ఎఱ్ఱన నృసింహపురాణ ద్వితీయాశ్వాసాంతమున స్రగ్విణీ వృత్తమును రచించినను అరణ్యపర్వశేషాంతమునందే ప్రప్రథమమైనదనియు, అది తిక్కనరచనాప్రభావమని భావింపదగును.

తిక్కన సర్వపర్వాశ్వాసాంతములందును రచించిన 'మాలిని' విశేషవృత్తమును ఎఱ్ఱన అరణ్యపర్వచతుర్థాశ్వాసాంతమున ఎన్నుకొనుటవలన, నన్నయ ఆదిపర్వ షష్ఠమాశ్వాసాంతమున రచించిన 'మాలినీ'వృత్తమునే ఆశ్వాసాంతపద్యముగ వాడి

ఆదిపర్వ ద్వితీయ,పంచమ,అష్టమ,సభాపర్వద్వితీయాశ్వాసకథాభాగములందు కూడ రచించియుండుటవలన, వృద్ధిపొందిన అరణ్యపర్వచతుర్థాశ్వాసకథ అస్థిమాలగ నన్నయ పేర రచించిన తిక్కనకవితను స్ఫురింపజేయుట కట్లు ఎఱ్ఱన రచించెనా అనిపించును

తిక్కనమాత్రమే కథాభాగమున రచించిన 'స్రగ్విణీ'వృత్తమును నన్నయ సారస్వతకథాభాగమునకాని, ఆశ్వాసాంతములందును లేకున్నను, ఎన్నుకొని అరణ్యపర్వ పంచమాశ్వాసాంతపద్యముగ రచించినందువలన, పంచమాశ్వాసకథ పూర్తి నన్నయ పేర అస్థిమాలగా తిక్కనరచించెనని పాఠకులకుస్ఫురింపజేయుటకు ఎఱ్ఱన 'స్రగ్విణీ'వృత్తము నెన్నుకొనియుండునని తోచును

వర్షాకాలమునందలి మేఘసముదాయ ప్రకృతికి వనమున పరవసించి పింఛము విప్పి నృత్యమాడు'మయూరము'ను తలపించు 'మయూరవృత్తము'ను ఆదిపర్వ పంచమాశ్వాసాంతపద్యముగ మాత్రమే నన్నయ రచించెను కాని కథాభాగమున రచింపక అరణ్యపర్వచతుర్థాశ్వాసమధ్యలో వర్షఋతువర్ణనచేసి పరమపదించెననియు, వర్షఋతువర్ణనతో నన్నయరచన అంతమైనదని సూచించుటకు ఎఱ్ఱన అరణ్యపర్వ షష్ఠమాంశ్వాసాంతపద్యముగ ఎన్నుకొనె ననిపించును. కనుక 'తత్సమయానంతరంబున' అను ఏకసమాసవచనము తిక్కన ప్రారంభవచనమని, దానితర్వాతి 'భూసతికిం' పద్యములోని 'శరత్సమాగమ' సమాసము నన్నయ, తిక్కనల కవితా సమాగమ సూచన సమాసమని ధృవీకరించుచున్నది

సప్తమాశ్వాసాంతమునందలి 'తరల'వృత్తరచన తిక్కన అస్థిమాలరచన తరలిపోవుటను సూచించుటేకాక క్రిందివిషయములను కూడ స్ఫురింపజేయుచున్నది

1. నన్నయ తరలవృత్తముతో ప్రార్థనచేసి ప్రారంభించిన భారతరచన అస్థిమాలయైన అరణ్యపర్వశేషపూరణాకృతజ్ఞతను సూచించిను
2. 12సంవత్సరముల వనవాసమునుండి పాండవులు అజ్ఞాతవాసమైన విరాటనగరమునకు తరలిపోవుటను సూచించుచున్నది.
3. తిక్కన అస్థిమాల గూఢరచన తిక్కన రచనగా తరలుటనుకూడ ఈ 'తరల' వృత్తము సూచించుచున్నది

(గ్రంధకర్త గోపినాధ శ్రీనివాసమూర్తి (గోపినాధ వేంకటకవి మనుమని మనుమడు)

4 నన్నయభాగకథకు ఎఱ్ఱనపూరించిన కృతీశ్వరుడైన రాజరాజుకూడ శంభుదాసుడు అతడు తరలిపోవుటకు సూచనగా ఎఱ్ఱన 'తరల'వృత్తమును రచించియుండునని తోచును.

పై నాలుగు ఆశ్వాసాంతవృత్తములను స్త్రీపర్వ ప్రథమాశ్వాసాంతమున అవరోహణ క్రమములో 189,140,110,4 పద్యములుగా 'మాలిని', 'స్రగ్విణి', 'వనమయూరము' 'తరల'వృత్తములను చూడవచ్చును కనుక అరణ్యపర్వశేషమును రచించి విరాటాదులను తిక్కన రచింపక, విరాటాది స్వర్గారోహణకథ ముందు రచించి తర్వాత అవరోహణముగ తిక్కన అరణ్యపర్వశేషకథ పూరించెనని, దాని కనువుగ ఆశ్వాసాంత విశేషవృత్తములను ఎఱ్ఱన ఎన్నుకొని ధ్వనించెనా అని తోచును

ఎఱ్ఱన తను అరణ్యపర్వశేషమున రచించిన కేవలరాజరాజువర్ణనమును ఒక కావ్యముగ కాని లేక విడిప్రతిపతిగకాని చెప్పుకొనలేడు కనుక తను అరణ్యపర్వశేషమున రచించిన విషయమును 'నన్నయభట్టమహాకవీంద్రు సరససారస్వతాంశ ప్రశస్తి' అని, 'ఉన్నత సంస్కృతాది చతురోక్తి పథంబుల కావ్యకర్తవై ఎన్నికమై ప్రబంధపరమేశుడనంగ అరణ్యపర్వశేషాన్నయ మంత్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించితి' వని 'ప్రౌఢాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు (నన్నయ తిక్కనలు) కావ్యశయ్య కీలించిన (తగిలించిన) కీర్తి సంగసుఖలీలకు కాంక్షచేసితి' నని రాజరాజ గుణరూపవర్ణనను వివిధములుగ వర్ణించిన శబ్దశక్తిచిత్రరూపమునే జక్కన 'ప్రబంధపరమేశ్వరుడై విరచించె శబ్దవైచిత్రి అరణ్యపర్వము నశేష'మని 'ఎఱ్ఱయ, శంభుదాసు డాచిత్రకవిత్వ వాగ్విభవజృంభితు' అని శ్రీనాథుడు 'పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని రేవసూక్తి వైచిత్రి నొక్కక్కమాటు' అని పేర్కొని శ్రీనాథుడు తన రచనయందు క్రింది పద్యములలో ఆ సూక్తి వైచిత్రికళ చిత్రించినట్లు భావింపవచ్చును.

క॥ సర్వజ్ఞనామధేయము, శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును దక్కొరు, సర్వజ్ఞుడనుట కుక్క సామజమనుటే

క॥ సిరిగలవానికి జెల్లును, దరుణులు బదియాఱువేలు దగ బెండ్లాడన్
దిరిపెమున కిద్దరాండ్రా, పరమేశా! గంగవిడువు పార్వతి చాలున్.

ఏ విశేషవృత్తమైనను ఆశ్వాసాంతమున రచించుటకు వీలుండగా పై

గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

నాలుగువృత్తములనే ఎన్నుకొని అనేక విచిత్రవిషయములను పాఠకులకు స్ఫురింపజేయుట చేతనే కృతీశ్వరుని (ప్రబంధపరమేశ్వరుని) వర్ణించు ఆశ్వాసాంత విశేషపద్యములను ఎఱ్ఱన రచించెనని జక్కన తన విక్రమార్క చరిత్రమున యిట్లు రచించెనని భావింపవచ్చును

'ప్రబంధపరమేశ్వరుడై విరచించె శబ్దవైచితి నరణ్యపర్వము నశేషము,'
'చిత్రకవిత్వ వాగ్విభవజృంభితు '

పై పద్యములోని 'జృంభితు' పదప్రయోగము ఆశ్వాసాంతరచన సూచించుటేకాక 'ప్రబంధపరమేశుడనంగ' 'ప్రబంధపరమేశ్వరుడై' పదప్రయోగములచే సాంగత్యదోషములను పరిహరింపచేయు ఆలోచనకు దారిచూపి 'ప్రబంధపరమేశ్వరు'డనునది బిరుదముకాదు 'కృతీశ్వర పర్యాయపదమని సూచించుచున్నది ఎఱ్ఱన రచించిన నాలుగు ఆశ్వాసాంతములలో తిక్కన నాలుగు విశేషవృత్తములను వాడి నన్నయవి మూడే రచించుట తిక్కన అరణ్యపర్వశేషకథను రచించినట్లు సూచించినాడు.

ఇక కథాంశవిషయమున పరిశీలింతము నన్నయభాగమున ప్రయోగింపబడక అరణ్యపర్వమున ప్రప్రథమముగా దర్శనమిచ్చు ఏకపదవచనము 'అని వెండియు' (3-4-155) నందు ఒక్కసారే ప్రయోగింపబడినది ఎఱ్ఱన హరివంశమున పూర్వభాగమున లేక, ఉత్తరభాగమున (5-187) నందు మాత్రమే కలదు నృసింహ పురాణమున అసలు ప్రయోగింపబడలేదు తిక్కన భారతభాగమున (4-2-29, 5-205) (5-2-85, 247, 3-44, 185, 4-4) (6-1-139) (7-1-65, 2-291, 343, 5-100, 199, 242) (8-1-153, 2-10, 83, 101, 117, 3-117, 143, 260, 378) (9-2-340) (10-1-21, 55, 2-38) (11-2-36, 46) (12-1-44, 67, 104, 325; 2-102, 328, 3-321, 425; 4-61, 96, 113, 173, 321, 5-56, 182, 252, 6-107, 152, 578, 603, 614) 13-1-38, 81, 174, 267; 2-176, 313, 321, 373, 468, 3-109, 229, 4-20, 243, 383, 5-78, 143, 259, 387, 427, 464) (14-1-37, 2-160, 3-10, 46, 176, 4-77, 188, 278) (18-1-8)లలో ప్రయోగింపబడియున్నది

'అనివెండియు' తర్వాత ప్రప్రథమముగా మనకు దర్శనమిచ్చు ఏకపదవచనము 'కావున' (3-4-165), 385 ఈ ఏకపదవచనము ఎఱ్ఱన నృసింహపురాణమున కాని,

...వంశమునకాని ఒక్కసారియైనను ప్రయోగింపబడలేదు. కాని తిక్కన భారతభాగమున (4-1-239 2-255, 3-65, 5-219) (5-1-324) (6-1-135) (7-1-68) (11-1-135) (12-1-98, 179, 2-332, 4-42, 5-146, 416) (13-4-25, 369, 5-433) (14-1-151, 2-183, 3-12)నందు ప్రయోగింపబడినది

నన్నయ భారతభాగమునలేని ఏకసమాసవచనము తర్వాత వచ్చునది 'తదనంతరంబ' (3-4-226, 244) (3-5-268) (3-6-349) (3-7-77) అనగా అరణ్యాపర్వశేషమున 5 సార్లు ప్రయోగింపబడినది. ఇది నృసింహపురాణమున (1-15) (5-132) హరివంశపూర్వభాగమున (4-98) (7-162) యందును ఉత్తరభాగమున 2-151, 3-180, 4-131, 235, 5-43, 7-43, 97 యందును కలదు. తిక్కన భారతమున (4-1-26, 2-317, 3-26, 195, 5-396) (5-1-204) (6-1-244, 2-308) (7-1-19, 151, 4-317) (13-1-323, 3-11, 5-371)నందు కలవు

నన్నయ (1-5-123) యందు మాత్రమే ప్రయోగించిన 'అయ్యవసరంబున' అను ఏకసమాసవచనము అరణ్యపర్వశేషమునందు (3-6-57) నందు మాత్రమే కలదు ఇది నృసింహపురాణమునలేదు. హరివంశపూర్వభాగమందు (4-142) యందును, ఉత్తరభాగమందు (2-21) యందు కలదు. తిక్కన భారతభాగమున (4-2-34) (6-2-243) (7-1-164, 189, 3-118, 122) (8-1-228) (9-1-217)లయందు కలదు.

నన్నయ ప్రయోగింపని 'ఇవ్విధంబున' అను ఏకసమాసవచనము అరణ్యాపర్వశేషమున (3-6-379) నందు ఒక్కమారే ప్రయోగింపబడియున్నది ఇది నృసింహపురాణమున ప్రయోగింపబడలేదు హరివంశమున పూర్వభాగమున లేక, ఉత్తరభాగములో (4-201)నందు మాత్రమే ఒక్కసారి ప్రయోగింపబడియున్నది తిక్కనభారతభాగమున (6-2-189, 254) (7-3-150, 5-186) (8-2-233) (9-1-144, 165, 269, 301) (10-2-100) (13-1-248, 2-438, 5-240)లలో కలదు

నన్నయ భాగమున ప్రయోగింపబడని 'అనియడుగుటయు' అరణ్యాపర్వశేషమున (3-7-44)లోమాత్రమే కలదు ఇది నృసింహపురాణ,హరివంశములలో ప్రయోగింపబడలేదు తిక్కనభారతభాగమున (7-5-431) (8-2-398) (13-2-100, 475, 4-448 లలో కలదు

అరణ్యపర్వమున నన్నయభాగమున కానరాని ఎత్తుగడలు చాలకలవు అందు తిరిగితిరిగి ప్రయోగింపబడిన ఎత్తుగడలలో కొన్నిటిని పరిశీలింతము. అనుటయు (3-4-193)ఇవ్విధంబున(3-4-306)అనుడు(3-4-362)అధిప(3-4-391)అగుగాక (3-5-248) నావిని (3-5-358) అకట (3-5-408) ఆలోనన (3-6-8) అకటకట (3-6-20) అనవిని (3-6-293) నావుడు (3-7-226) ఇవి తిక్కన భారతభాగమున అనేక పర్యాయములు కనవచ్చును నృసింహపురాణ, హరివంశములలో కొన్ని ఎత్తుగడలు కనబడక, కొన్ని కనవచ్చినను, ఎఱ్ఱన తిక్కన ననుసరించినట్లే మనము భావింపవలెను కారణము ఎఱ్ఱన భారతమునందు 'నన్నయ సారస్వతాంశప్రశస్తి' తనకు చెందినదనే చెప్పెను కాని తిక్కనపేరు పేర్కొనలేదు. నన్నయ మార్గముకన్న తిక్కన కవితామార్గము భిన్నముకదా ఎఱ్ఱన తిక్కననే అనుసరించెనని విమర్శకులందరు తెలిపియున్నారు. కనుక ఇట అవి ఉటంకింపబడలేదు

**★నూతనకవి తిక్కన అను భావనకు ఆధారములు★**

అరణ్యపర్వమున ఉన్న రామాయణకథలో ఇంద్రజిత్తునకు ఇంద్రజి అని (3-7-121) ప్రయోగింపబడియున్నది చూడుడు

క॥ అంతఁబటుతోమరంబుల,నెంతయు వెసన్నృపతనూజునింద్రజివైనన్,
సంతతశరములనన్నిటి,నింతింతలు శకలములుగ సేసెనతండున్ (3-7-121)

తిక్కన నిర్వచనోత్తర రామాయణమున (1-81) (4-18)ల యందు 'ఇంద్రజి' అని ప్రయోగించియున్నాడు చూడుడు

క॥ ఇంద్రజి ననిలోఁజంపి మ,హేంద్రాది త్రిదశనుతుల కెక్కిన యనుజున్,
సాంద్రానుమోదమున రఘు చంద్రుడు మోమెలమిఁబొంద సంభావించెన్ నిరా(1-81)

ఇట్లే తిక్కన గరుత్మంతుని 'గరుడి' అని అరణ్యపర్వశేషము (3-5-202) నిర్వచనోత్తరరామాయణము (3-27, 32) నందును ప్రయోగించియున్నాడు. చూడుడు 'అనిన సంతసిల్లి యగ్నిదేవుండు దానిం గైకొనియె నదియును నతని సభమత భోగంబులంబ్రీతునింజేసి తదీయతేజోధాతువు ధరియించి యచ్చోటువాసి యాక్షణంబ గరుడియైగగనంబునకునెగసి' (3-5-202)

క॥ పఱతెంచి, కదియబడి యే, త్రైలు వ్రేసిన
మోముదాకి తిరిగె గరుడి' యత్తఱిఁ జక్రంబున హరి (ని.రా.3-27)

అరణ్యపర్వ రామాయణమునందు రామరావణ యుద్ధమున వ్యాసమూలమునలేని వ్యూహరచన తెలుగుభారతమున కలదు. చూడుడు భా.(3-7-73, 74)

క॥ అది యెల్లవిని దశానను,డుదిత క్రోధుఁడయి మంత్రియుతముగ వెడలెన్;
మదగజఘోటకసైనిక, పదభరభుగ్నావనీవిభాగుండగుచున్

'వ॥ ఇట్లు వెడలి యభేద్యంబగు నౌశనవ్యూహంబు సంఘటించి వనచరబలంబు ...యి నడచినం గని రాఘవుండును బార్హస్పత్యవ్యూహంబు దీర్చిపేర్చి యెదురుకొనియె

వ్యూహరచన వాల్మీకిరామాయణమునకంటె భిన్నమైన వ్యూహరచన కనబడును. తిక్కనభారతమున వ్యూహరచన చేసియుండుట సర్వవిదితము

'స్ఫురదరుణాంశురాగరుచి బొంపిరివోయి' ఇది ఎఱ్ఱన ప్రప్రథమపద్యమని సంశోధితప్రతిలో కలదు. కాని 'బొంపిరివోయి' పదము ఎఱ్ఱన రచనయందెచ్చటను అనగా నృసింహపురాణమునకాని, హరివంశమునకాని ప్రయోగింపబడలేదు, కాని ఆ పదము అరణ్యపర్వశేషముననే 4-142, 5-223, 7-433ల యందు నూతనకవి రచనగా ప్రయోగింపబడియున్నది ఈపదము తిక్కనభారతభాగమున (4-2-86, 122) (5-1-94, 2-214) (7-1-280, 3-268) (8-2-151; 3-282, 384) (9-1-5; 2-5, 267) (12-2-446, 6-337) (13-5-212) (14-2-120, 3-67, 203) నిర్వచనోత్తర రామాయణమున (3-65) (5-95) (6-27) (7-62) యందును ప్రయోగింపబడియున్నది.

భూసతికిం దివంబునకు పద్యములోని 'పాల్పెసగంగ' పదము నన్నయ రచనలోలేదు తిక్కనభారతభాగమున ఆశ్రమవాసద్వితీయాశ్వాసమున 38వపద్యమున 'ఉ॥ తారకశోభితాంబరవిధంబున (బొల్పెసగంగ... ' అని ప్రయోగింపబడియున్నది. ఈపద్యము (భూసతికిం)నుండి ఎఱ్ఱన కవిత్వమారంభమని ఔ తాళపత్ర ప్రతియందున్నట్లు సంశోధిత ప్రతియందు మనము చూచితిమి కాని దీనిపైన 'తత్సమయానంతరంబున' అను ఏకసమాసవచనము కలదు అదియును నన్నయ తన రచనయందు ప్రయోగించియుండలేదు. తనరచన చివరిపదముగా దానిని ప్రప్రథమ వచనఎత్తుగడగా ప్రయోగించియుండుననుట, దానితర్వాతి పద్యమునందే'పాల్పెసగంగ'అని ప్రప్రథమముగా

ప్రయోగించియుండు ననుట సమంజసముకాదు. పై 'తత్' ప్రారంభముతో తదనంతరంబ, తదవసరంబున (5-4-348) అను ఏకసమాసవచనములు ఎత్తుగడతో వచనములు., పద్యములు, తదనుష్ఠాన ప్రకారంబు సెప్పెద (12-6-36) తత్ప్రకారం బెట్టిదనిన (12-5-58) తత్సంతతిజాతులెల్ల (12-2-216) ఎత్తుగడవచనములును తత్ప్రదేశంబు (4-2-115) (10-2-10) తత్సాధనంబు (14-2-114) తత్క్షమున (13-4-204) ఎత్తుగడలును తిక్కనభారతమున కలవు 'తత్'తో ప్రారంభమగు ఏకసమాసవచనములు నన్నయవి కావు. కనుక 'తత్సమయానంతరంబున' అను ఏకసమాసవచనము తిక్కన రచనయైనట్లును అక్కడినుండి తిక్కనరచన ప్రారంభమైనట్లును భావింపవచ్చును. ఈ 'తత్' ప్రయోగము నన్నయసంస్మరణగా భావింపవచ్చును.

★స్వర్గారోహణ పర్వరచన తర్వాత తిక్కన అరణ్యపర్వశేషరచన★

ఈక్రిందిచతుర్థాశ్వాసములోని పద్యముల సంశోధితప్రతిపారాంతరములు స్త్రీపర్వ శ్లోకభావములు అరణ్యపర్వచతుర్థాశ్వాసరచనకు మూలమైనట్లు అందు వివరింపబడినవి

(1)మ॥ ఉపవాసవ్రత సంతతాధ్యయన తీర్థోపాసనాదిక్రియై
కపరత్వంబునఁజేసి యైహికము దుఃఖప్రాయమై పోవఁగా
విపులానందముఁ బొందగల్గుఁదుది నావిర్భూత భోగైకలో
లుపబుద్ధిం జిరపుణ్యశీలురకు నాలోకంబునన్ భూవరా భా.(3-4-176)

పై పద్యమునకు పారాంతరముగా 'ఈక్రింది శ్లోకమునకు స్త్రీ పర్వములోని కుంబకోణప్రతి మూలము అని వ్రాయబడియున్నది

యే యోగయుక్తాస్తపసి ప్రసక్తాః స్వాధ్యాయ శీలా జరయన్తి దేహాన్
జితేంద్రియాభూతహితే నివిష్టా స్తేషామసౌ నాయమరిష్ను లోకః భా (11-186-38)

(2)వ॥ అనినవిని ధర్మనందనుండు బ్రాహ్మణ ప్రభావంబు వినవలతుం జెప్పవే యనిన మార్కండేయుండిట్లని చెప్పెఁ దొల్లి హైహయవంశోద్భవుండైన ధుంధుమారుం డనుపేరి రాజకుమారుండు మృగయాసక్తుండై వనంబునఁ గుమ్మరువాఁడొక్కయెడం భా.(3-4-181).

పై (భా.3-4-181)పారమునకు పాఠాంతరమున ఈ క్రింది కుంభకోణప్రతి శ్లోకము స్త్రీ పర్వమున నున్నది మూలమని వ్రాయబడియున్నది

'హైహయానాం కులకరోరాజా పరపురంజయః
కుమారో రూపసంపన్నో మృగయాం వ్యచరద్బలీ' అని మూలము (11-187-3)

(3)మత్తకోకిలము. కాలచక్రము నిర్వికల్పముగాఁగ నే నొనరింతు ను
న్మీలితక్రమవిక్రమైకసమృద్ధినై లయవిక్రియా
వేళ నింతయు సంహరింతుఁ బ్రవృద్ధయోగబలోల్లస
త్కాలరూపము దాల్చి దుర్వహ గర్వ నిర్వహబుద్ధినై(3-4-278)

దీనికి 'కాలచక్రం నయామ్యేకో' అను కుంభకోణప్రతి మూలము (11-192-34) అని పాఠాంతరము కలదు

(4)క॥ ఉఱవగు నారికెపంటలు,గొఱియలపాడియును దఱచగుం ‸ బురుషులకుం;
దెఱవలు సుట్టములయ్యెద,రెఱచియు భుజియింతు రర్థి నెల్ల జనంబుల్ (3-4-294)

ఈపద్యమునకు మూలము కుంభకోణప్రతిలోని ఈక్రిందిశ్లోకము అని పాఠాంతరములందివ్వబడినది.

భార్యా మిత్రశ్చ పురుషా భవిష్యంతి యుగక్షయే
మత్స్యామిషేణ జీవన్తో దుమన్తా శ్చాప్య జైడకమ్ (11-193-20)

(5)వ॥ అంతఁగలియుగాంతంబునందు భువనవిదితం బయిన శంబళగ్రామంబున కల్క్యాత్మకుండైన విష్ణుయశుండను బ్రాహ్మణుండు జనియించి సంస్మరణమాత్రన వేదశాస్త్రంబులును సమస్త శస్త్రాస్త్రవిశేషంబులు నధిగమించి సార్వభౌముండయి. ..

పై భా.(3-4-308) వచనమునకు స్త్రీపర్వములోని క్రింది కుంభకోణప్రతి శ్లోకము మూలమైనట్లు సంశోధితప్రతి పాఠాంతరము.

కల్కిర్విష్ణుయశానామ ద్విజఃకాలప్రచోదితః
ఉత్పత్స్యతే మహావీర్యో మహాబుద్ధి పరాక్రమః భా (11-194-93)

పై కుంభకోణప్రతి స్త్రీపర్వశ్లోకభావములనుబట్టి తిక్కన స్వర్గారోహణపర్వము తర్వాత అరణ్యపర్వశేషరచన చేసినట్లు ఋజువుచేయుచున్నది

ఇది నడకుదుటి వీరరాజు పంతులుగారి 'అరణ్యపర్వశేషము-ఎఱ్ఱాప్రెగడ' వ్యాసానుసారిగ నున్నది. దానినుండి గ్రహింపబడినది చూడుడు

"భట్టారక మహాశయుని భారతములోని యాది, సభాపర్వములు రెండును విశ్వజనీనములై జగద్వ్యాప్తములయ్యెను సలక్షణ కవిత్వ నిర్మాణ లాలసులు, పురాణ శ్రవణాభిలాషులు మొదలగువా రనేకులు, ఆతని గ్రంథమునుండి ప్రతులను వ్రాసుకొనుచు, వ్రాయించుకొనుచుఁ గొనిపోవుచుండిరి రాజరాజనరేంద్రుడును గొందఱ వ్రాయసకాండ్ర నేర్పఱచి తన యభిమాన గ్రంథమగు నాంధ్రమహాభారతమునకుఁ బ్రతులను వ్రాయించుచు ననేక రాజాస్థానములకుఁ బంపుచు వచ్చెను ఈరీతి నన్నపార్యుని కావ్యకన్యక మాతృకగా ననేక పుత్రికాపుత్రికలును జనింప నాంధ్రభారతములోని మొదటి రెండు పర్వములు దేశమున నెల్లయెడల వ్యాపింపఁగలిగెను

ఆరణ్యపర్వము మాత్రము దక్కినవానివలెఁ గడల్కొనఁజాలదయ్యెను ఏమన, అది విఘ్నకారియను ప్రవాదము లోకమున గలిగియుండెను (ఈవాడుక యారణ్యపర్వాంధ్రీకరణ దివసములయందు నప్పుడప్పుడు నన్నియకుఁ గల్గిన వార్ధక చిహ్నములగు రోగాదులచేతను,పిమ్మట గలిగిన మరణము చేతను మఱింత దృఢపడియుండును )

ఆరణ్యపర్వమును సాధారణముగా నేటికిని గొందఱు పురాణముగానైనఁ జదువనొల్లరు మఱిగొందఱు ఆరణ్యపర్వముగాక తక్కిన గ్రంథమంతయు ఁజదివి పిమ్మట నారణ్యపర్వమును బరించి, కడపట శాంతినో, తొలి పర్వమును మరలఁజదివి పురాణపఠనమును ముగించెదరు మహాభారత పఠనమున నింక ననేకభేదములున్నవి కాని వనపర్వమును మాత్రము మొదటివానితో వరుసను జేర్చి పఠింపకుండుట సర్వసామాన్యమైన విషయమైయున్నది.

మనపూర్వు లారణ్యపఠన లేఖనములకు భయపడచువచ్చి రనుట నేడును వినబడియెది. అప్పటివారికి దైవతాదులయందును, పురాణములయందును నపరిమిత భక్తివిశ్వాసములుండెడివి. ఇక్కాలమునను గొందఱు పెద్దలు, ఉపనిషత్తులు భోజనానంతరము పఠింపరాదని శాసింతురు దేవీనవరాత్రములయందు సరస్వతీ పూజకుఁ దాటియాకు గ్రంథములనే కాని యచ్చుపొత్తములను పూజాపీఠమునఁ జేర్పనీయని ముదుసలులు గొంద ఱిప్పుడును గలరు. అందును గొందఱు గీర్వాణ భాషాగ్రంథములనేకాని తెలుగుబాసతోనున్న తాటియాకుగ్రంథములనైన ఁబూజింపనీయరు శ్రీకృష్ణాష్టమీ దివసంబున బోతనార్యుని భాగవతమును జదువువారి నధిక్షేపించిన వృద్ధవిద్వత్కవి యొకడిప్పుడును గలఁడు ఏతాదృశభాక్త్యాదులు పూర్వమునుండినేటిదాఁకఁ బరంపరగా వచ్చుచున్నది

| గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు) |
|---|

చూడుడు ఇక్కాలమున 'ఆర్ వేంకటేశ్వర్ అండ్ కంపెనీ' (ఆనందముద్రాల యాధిపతులు) ఆంధ్రవచనభారతమును బ్రకటించుఁ దొలుత నాది,సభాపర్వములఁ బ్రకటించియు"విఘ్నకారి"యను భయముచేతనే యారణ్యపర్వమును మాని ముందుగా శాంతిపర్వమును బ్రకటించినారు. (ఇవ్విషయము తద్వచనగ్రంధకర్తలచే నాకుఁ దెలియవచ్చెను.)

ఇయ్యారణ్యపర్వ విఘ్నభయము మన భారతవర్షమున నేనాఁడు జనియించెనో తెలిసికొను నాధారములు కానరావు గాని, మనయాంధ్రదేశమందుంబోలె వంగఘూర్జర, మహారాష్ట్రాది దేశములయందును నారణ్యపర్వమును ప్రధమ, ద్వితీయపర్వములతో వడుసను జేర్చి చదువరనియు, శాంతికి ముందో,గ్రంధాంతముననో దానిని చదివి శాంతిపర్వమును బఠించెద రనియుఁ దద్దేశవాసులు చెప్పెదరు "

ఈ క్రింది అరణ్యపర్వ శేషాంతభాగములు కవి విరాటపర్వారంభమునకు సరియగునట్లు రచించినట్లు సూచించును

(1)ఉగ్రశ్రవసుడను పౌరాణికుడు శౌనకాది మహామునులకు చెప్పినట్లు నన్నయ రచింపగా అరణ్యపర్వాంతమున వైశంపాయనుడు జనమేజయునకు 'అనవరతానంద సుఖసమగ్రత'యిచ్చినట్లు చెప్పబడినది. ఈ 'సమగ్ర'పదప్రయోగముచే విరాటపర్వముతో ప్రారంభించిన కథయొక్క కథాంతము అరణ్యపర్వాంతమున పూర్తయినట్లును, అనవరత పదప్రయోగముచే చతుర్థాశ్వాసాంతమునుండి రాజారాజప్రశస్తికాని, హరిహరనాథ ప్రశస్తికాని లేనట్లు వ్రాయబడియున్నదని తెలిపినాడు కాని ఇప్పటి ప్రతులలో రాజరాజప్రశస్తి ఎఱ్ఱనచే రచింపబడియున్నది. ఈ రచన 'అనవరత' (విశ్రాంతిలేకుండ) శబ్దప్రయోగమునకు విరుద్ధముగానున్నది నన్నయరచన ప్రకారము ఉగ్రశ్రవసుడు శౌనకాదిమహామునులకు, వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన క్రమమున చెప్పెను వైశంపాయనుడు జనమేజయునకు సమగ్రముగా చెప్పినట్లు నన్నయ సారస్వతాంశమును పొందిన ఎఱ్ఱన ఎట్లు చెప్పగలడు? ఎఱ్ఱన ఉగ్రశ్రవసుడు శౌనకాది మహామునులకు సమగ్రముగా చెప్పినట్లు చెప్పవలసియుండును.

(2) కః అనఘుడు గృష్ణద్వైపాయ,నశిష్యుడు బోధనిధి సమంచితమేధా
ఘనునకుఁ బారిక్షితునకు ననవరతానంద సుఖసమగ్రతయొసగెన్ (3-7-468)

అనుపద్యముతో విరాటపర్వ ప్రారంభమున కనువుగ అరణ్యపర్వము(3-7-468)తో

గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాధ వేంకటకవి మనుమని మనుమడు)

ముగించి నన్నయపేర గద్యమును రచించినాడు "మహాభారతంబు సమస్త దురితాపహంబును నభిమతశుభావహంబునుం గావున నొక్కమహాఫలంబుగోరి జనమేజయుండు గృష్ణద్వైపాయనమహాముని కారుణ్యంబు వడిసి తదీయ ప్రియశిష్యుండయిన వైశంపాయనునివలన వినినకథ యగుటంజేసి తత్ప్రకారంబు నడపెద' (4-1-43) అని విరాటపర్వ ప్రారంభవచనము

(3)అరణ్యపర్వ కడపటి వచనమున 'ఇట్లు పాండుతనయుల వనవాసప్రకారంబు సవిస్తరమధురంబుగా నుపన్యసించి' (3-7-467) అని 'సమేతాః పాండవాశ్చైవ సుఖసుప్తా మనస్వినః, అభ్యేత్య చాశ్రమం వీరా స్సుఖసుప్తా మనస్వినః, అరణేయం దదుస్తస్మై బ్రాహ్మణాయ తపస్వినః' అను వనపర్వ కడపటి శ్లోకమునకు అమూలకముగ విరాటపర్వ ప్రారంభమున కనువుగ రచించెను. "అది యెట్లనినం పరమపవిత్రులగు పాండుపుత్రుల చరిత్రం బుపాఖ్యానసహితంబుగా వ్యాఖ్యావంబు సేయుచుండ వారలసమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె (4-1-43)" అని విరాటపర్వ ప్రారంభము

(4) 'ఇచ్చి మఱియు నిట్లనియె పదమూడవయేడు సనుదెంచె నింక మీ రజ్ఞాత వాసంబు సలుపవలయు నందు మీరెవ్వ రెక్కడ నేరూపంబునం జరియింపంగోరిన నయ్యెరూపంబు లలవడియెడు నెట్లున్నను మిమ్ము నెవ్వరు నెఱుంగకుండునట్లుగా వరంబిచ్చితి నింక నొండెయ్యదివలసిన నడుగు మనిన' (3-7-465) అను అరణ్యపర్వవచనమునకు మూలమైన 'వర్షం త్రయోదశమిదం మత్ప్రసాదాత్ కురూద్వహః। విరాటనగరే గూఢాః అవిజ్ఞాత శ్చరిష్యథ' (3-314-28)అను శ్లోకమునకు సరియగునట్లు నిగూఢవృత్తిమై శబ్దమును 'మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్య లంగనానహితముగాగ నేమిగతి నమ్యగుపాయనిగూఢవృత్తివై నహితుల కప్రభేద్యమగు నాపదమూడగునేడు మత్పితామహులు చరించి రంతయుఁగ్రమంబున నాకెఱుగంగఁ జెప్పుమా' (4-1-44) అని విరాటపర్వప్రథమపద్యమున రచించినాడు.

(5) చతుర్థాశ్వాస మధ్యలో అనగా నన్నయరచన ముగిసిన చోట 'హరిహరనాథసంబోధన' రచించు అవకాశము లేనందున హరిహరనాథుని రూపమును తన మనస్సున నిలుపుకొని అరణ్యపర్వశేషకథను మాత్రము తన మనస్సులో నివేదించి విరాటపర్వాది రచనవలె ఆశ్వాసారంభమందు హరిహరనాథసంబోధనను, ఆశ్వాసాంతమందు హరిహరనాథ ప్రశస్తిని రచించుటమాని జగత్ప్రసిద్ధమగు రీతిగా కథను రచించెనా అనునట్లు స్వర్గారోహణపర్వమధ్యమున కథ ముగియగనే

క॥ శ్రీనిత్యత్వప్రమదా, ధానకుతూహల నిరూఢతాస్త వ్యాపాం
గా నిర్భర వేదవ్యా, సానేక వచోనుషంగ హరిహరనాథా (స్వర్గ 1-76)

అను సంబోధన పద్యము తర్వాత అరణ్యపర్వమున నన్నయరచనను తిక్కన రచనను వేరుపరుచు వచనము 'తత్సమయానంతరంబున' (3-4-139) అని నన్నయు మరణమును సూచించి/వర్షఋతు అంతమును సూచించి 'భూసతికిం దివంబునకు' పద్యముతో నన్నయరచనను సంగతముచేసి నట్లనిపించును

అరణ్యపర్వచతుర్థాశ్వాసముననే తార్క్ష్యుడు అనుముని సరస్వతీదేవిని ఆరాధించి, సరస్వతీదేవి ప్రత్యక్షముకాగా తన సందేహములు తెలిపి సరస్వతీదేవి సమాధానములతో తృప్తి చెందును తృప్తిచెందిన తర్వాత సరస్వతీదేవికి కృతాంజలియై ఈక్రింది విధముగా ప్రార్థించినట్లు వర్ణింపబడియున్నది

అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారద చంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నరోచిరా
చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్తవివిక్తనిజప్రభావ భా
వాంబరవీధివిశ్రుతవిహార ననుం గృపజూడు భారతీ భా (3-4-215)

సంస్కృతవనపర్వములోని తార్క్ష్యుడు స్తుతింపలేదు కనుక ఇది అరణ్యపర్వ శేషమున రచించిన కవిస్తుతిగా భావింపదగును

'సాహిత్యసురభి' అను కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి గ్రంధమునందు వారు ఈపద్యమును గూర్చి ఇట్లు వ్యాఖ్యానించియున్నారు

"ఈపద్యము పూర్వకాలమున సర్వజనులు చదువుచుండెడివారు పుస్తకముచేత బూనినంతనే దేవతాస్తోత్రములు చేసెడివారు స్తోత్రములలో నిది యొకపద్యము ఈపద్యముయొక్కశైలి నిజముగా నన్నయగారిశైలివంటిది తెలుగుజాతియొక్క నోటికివచ్చిన పద్యము.ఇది ప్రార్థనాపద్యమగుటచేత భాగవతముమొదట ప్రార్థనాపద్యములలో నచ్చువేయబడియుండును మరియు తిక్కనగారి భారతములో వ్యాసుని స్తోత్రమైన యొక పద్యమున్నది -'ప్రాంశుపయోదనీలతనుభాసితు' మొదలైన పద్యము ఈపద్యమును కూడ భాగవతముమొదట నచ్చువేసియుందురు సామాన్యముగా నీరెండుపద్యములు పోతన్నగారువ్రాసిన వనుకొందురు. ఈపద్యములలోని రచన అంతమధురముగా నంత హృదయంగమముగా నుండును మొత్తముమీద పోతన్నగారిదేమో అనిపించును"

★పోతనకు తిక్కన మార్గదర్శి★

తిక్కన విరాటపర్వమునుండి స్వర్గారోహణపర్వమువరకే 15901 పద్యములు రచించిన అనుభవముతో నిర్వచనోత్తరరామాయణరచన అరణ్యపర్వశేషమునకు ముందు రచించి దానిలో వలె సంస్కృత,తెలుగుపదములను సమపాళ్ళలో అరణ్యపర్వశేషరచనగా వెలుగొందినదని, కనుకనే సరస్వతీప్రార్థనలో'భారతీ' 'ఏనిన్నుమామయనియెడు' పద్యములో 'భారతీకన్యక' అని తిక్కన రామాయణమున రచించెనని మనము గ్రహింపగలము అరణ్యపర్వము వెంటనే తెలుగుపదములనే ఎక్కువగా రచించిన విరాటపర్వరచన ఉండుటచే అరణ్యపర్వశేషరచన తిక్కనదికాదని పండితులు భ్రమ పొందియుందురనుటలో ఎట్టి సంశయమును లేదు. ఈసందర్భమున ఇట్లున్న భారతములోని పద్యములనే తీసికొని ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు తమ'సారమతినన్నయ'లో చెప్పినవిషయము గమనింపదగినది

''స్ర॥ మౌళిస్రక్సంగరంగన్మధుకర పటలీమానసకృష్టి విద్యా
శాలి స్ఫారాబ్జరేఖాంజలిపుట ఘటనా చారుఫాలస్థల క్ష్మా
పాల శ్రేణి విశాలాంబక కుముదవనీ బాంధవాయత్త చంద్ర
శ్రీలీలా గాఢకాంతిస్మిత వదనరుచిస్ఫీతు నాగేంద్రకేతున్ భా (4-3-78)

చ॥ లలితహయద్విపంబుల విలాసినులన్ మణిరౌప్యకాంచనా
వలుల నజావి గో మహిషవర్గములన్ బహుభూషణంబులన్
బలువిడిఁ గప్పముల్ ధరణిపాలురచేఁ గొని నూఱువేల్ గజం
బులఁ బెఱికించి తెచ్చెఁగురుముఖ్యుఁ డకుప్యధనమ్ములిమ్ముగన్ భా (1-5-39)

ఇందేది నన్నయ పద్యము? ఏది తిక్కనది? అందరు అనుకొనురీతిగా- మొదటిది 'నన్నయది' రెండవది తిక్కనది అది కొండగుర్తు వీరికి కవుల చూపులోని వివేకపాకము తెలియదు ఒత్తుగా సంస్కృతము కానుపించిన అది నన్నయది, బంధము శిథిలముగా ఉండి తరచు తెలుగు పలుకులు పలికినచో- సందేహమేల! - అది తిక్కనదే

రెండు పద్యములందును సామంతరాజుల సంసేవనమును కేంద్రప్రభువు వైభవమును ప్రతిపాద్యవిషయములు మొదటిపద్యమున నాల్గుపాదములును ఒకే సమాసము నిజమునకు 'హస్తినప్రభువు ధృతరాష్ట్రుడు.' కాని పేరునకు మాత్రమే

ఆయన చక్రవర్తి రాజ్యవైభవ మంతయు దుర్యోధనునిది అతడు ఉద్ధతుడు. రారాజుగా తానే చెల్లుబడి యగుచున్నాడు సామంతులు అతని నిగ్రహానుగ్రములకే పాత్రులు. అప్రాగల్భ్యమును ఆడంబరమును చిత్రించుటకు అంత సంస్కృతము కావలసివచ్చినది అది తిక్కనగారి పద్యము ఏమి - ఆ భావమును తెలుగులో చెప్పలేరా? అదిగాదు ప్రశ్నము ఆ ప్రగల్భతను, ఆడంబరమును పద్యము ఎత్తుగడలో దీర్ఘసమాసకల్పనములో తిక్కనగారు స్ఫుటముగా ధ్వనింపజేసిరి మహాకవులకు అది వెన్నతోబెట్టిన విద్య

పరిశేషన్యాయమున రెండవది నన్నయగారిది పాండురాజు కప్పముల గొనితెచ్చుట ఇందలి విషయము దీనినిగూడ కవి పాండుప్రతాపమును వర్ణించు పెద్దపద్యములో దీర్ఘసమాసములతో చెప్పవచ్చును కాని అతడు సునాయాసముగా సామంతుల నదిమి కప్పముల గొనితెచ్చెను అభావమును హేలగా లలితశబ్దములతో తునిగిన చిన్న సమాసములతో చెప్పెను 'నూఱువేల్ గజంబులఁ బెఱికించి తెచ్చె' అను తెనుగుమాటల ఒడుపులో ఆ భావమునకు పదును వచ్చినది ఇంత యర్థమెచట నున్నది? సారమతులు లోనారయుటలో నున్నది-

తిక్కనగారు 'దుర్వారోద్యమ', 'భీష్మద్రోణకృపాది', 'ధ్వాంతాకారిత', 'యానప్రక్రమ' 'లోకస్తుత్య విభూతి', 'ప్రాంశుపయోధనీల', 'సింగం బాకటితో' మున్నగు ననేక పద్యములు సంస్కృతభూయిష్ఠముగా వ్రాయుటలో గల వివేకమిది దీనినంతటిని గాలికి విడిచి ఆయన 'డు,ము,వు,లు' తెచ్చినాడు. ఈతడు తెనుగును మెచ్చినాడు, అని చెప్పుట మన రసికతా దారిద్ర్యమును చెప్పునుగాని వారి కవితాధర్మమును చెప్పదు."

శేషాద్రిరమణకవులు పోతనగారి 'భాగవతపీఠిక'గా 'భాగవతప్రశంస' అను శీర్షికను వావిళ్లవారి 1961 భాగవతప్రచురణమునందు "ఈతని (పోతన) కవిత్వంబు తిక్కన సోమయాజి రచించిన సీ॥ నెత్తమ్మిరేకులమెత్తదనము దెచ్చి సీ॥గండు మీలకు బుట్టి కామబాణములతో , శా॥ దుర్వారోద్యమ .. సీ॥ నడిదివియలుసేసె ఇవిలోనగువానియందుఁబోలె భావంబునను, పాదసామరస్యంబునను గవిత్వం బత్యంత ప్రౌఢంబుగాక మిక్కిలిసుకుమారంబై యుండును" అని వ్రాసిరి

డాక్టర్ శ్రీ పాటిబండ మాధవశర్మగారు తమ 'ఆంధ్రమహాభారతము - ఛందోశిల్పము అను గ్రంధమున సీసపద్యరచనను గురించిన భాగమున యిట్లు వ్రాసియున్నారు

''సీసపద్యనిర్మాణమున అతిచిత్రములైన మర్మములు తిక్కనకు కరతలామలకములు సోమన, శ్రీనాథుడు మున్నగు అనంతరమహాకవులెల్లరును తిక్కన సీసనిర్మాణ చమత్కృతులను ఉపజీవించినవారే (పుట 505) భావరమణీయములయిన తిక్కన సోమయాజి సీసపద్యనిర్మాణభంగుల యందములు విశ్లేషించి నిరూపించుట యసాధ్యమైనపని, పరించి యనుభవమువల్లనే వానివైభవమును శ్రోత గ్రహింపవలయును బహుప్రకారమైన యాయన సీస నిర్మాణము నీక్రింది పద్యములందు దర్శింపవచ్చును

విరాట 2-67,315,360 4-210 5-56 భీష్మ 1-106, ద్రోణ 3-62, కర్ణ 1-62,73,115 శల్య 1-102,116,255 2-233,255,399 అను 1-182,27 ఇది దిఙ్మాత్రోదాహరణము''

చ॥ గజతురగాది సంపదలుఁ గాంతలతోడి విహారలీలలుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలనసేయు క్రమంబుఁ బోరులన్
విజయముఁబొంది పేర్చుటయు విస్ఫురితాభరణానులేపవ
స్త్రజనిత వైభవంబుఁ గలరాజులుఁ బోయిరకాక నిల్చిరే భా(5-2-93)

ఉ॥ దానములం దపంబులను దద్దయుఁ బేర్కలయట్టి వారలున్
మానవనాథులన్ వినమె? మాసెఁదదీయ యశంబులెల్ల, నీ
మానిత కీర్తికీర్తులు సమస్తజగంబులయందుఁబర్వుట
న్మేనులతోడ వారిటుల నేర్చిరె రానమరత్వసిద్ధికిన్ భా(17-1-69)

తిక్కనగారి పై రెండు పద్యములును పోతనగారి భాగవతములోని క్రింది పద్యమును స్మరణకు తెచ్చును

శా॥ కారె రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూటకట్టుకొని పోవంజాలిరే భూమిపై
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు! వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా (భాగ-8-589)

అరణ్యపర్వమున ధర్మవ్యాధుడు కౌశికునకు జీవలక్షణములు చెప్పు సందర్భమున క్రింది పద్యము కనవచ్చును

(గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపీనాథ వేంకటకవి మనుమని మనుమడు)

చ॥ స్థిరమగు పుణ్యకర్మమున దేవభవంబగుఁ బుణ్యపాపసం
కరమున మానుషత్వమగుఁ; గల్మషముల్ పశుకీటభావములో
బొరయఁగఁజేయుఁ; నిప్పగిదిఁ బుట్టుచు చచ్చుచు మోహవార్ధి
దిరుగుచు నుండుగాని యొక తీరముసేరడు జీవుడెన్నడున్ భా(3-4-75)

పై పద్యము ప్రహ్లాదుని చరిత్రములోని పోతనగారి క్రింది భాగవతపద్యమును గుర్తుచేయును

ఉ॥ ,అచ్చపుఁ జీకటిం బడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁబుట్టుచుం మఱలఁ జర్విత చర్వణులైన వారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పినవైన నిజేచ్ఛనైన నే
మిచ్చినవైన ఁగానలకు నేగినవైన హరిప్రబోధముల్ (భాగ -9-181)

ఇంతేకాక అరణ్యపర్వమునందలి సావిత్ర్యుపాఖ్యానములోని క్రింది పద్యమును గమనింపుడు (భా 3-7-190)

తే॥ నీ కొడుకు సత్యవంతున, కీకన్నియ దగు నరేంద్ర యీ కన్నియకున్
నీ కొడుకు దగు ననన్యగు,ణాకరు లియ్యిరువురును సమంచితమూర్తుల్

పోతన భాగవతములోని రుక్మిణీ కల్యాణములోని క్రింది పద్యము పై పద్యపు ప్రభావమనక తప్పదు.

మ॥ తగు నీచక్రి విదర్భరాజసుతకున్ దధ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి నింతమంచి దగునే దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా దర్పహతారాతియై
మగుడౌ గావుతఁ జక్రి యీరమణికిన్ మాపుణ్యమూలంబునన్ (భా గ 10-1737)

పై పద్యములను చూచిన పోతన తిక్కన కవితా ప్రభావుడౌననుట నిశ్చయము. కావున 'అంబనవాంబుజోజ్జ్వల' పద్యమును 'ప్రాంశుఁబయోదనీలతను భాసిత' అను వ్యాసస్తుతిని భాగవత ప్రార్థనా పద్యములందు కనుట తిక్కన పోతన నెంత ఆవేశించెనో అనువిషయమును తెల్పునదియై యున్నది అంతేగాక అరణ్యపర్వశేషము తిక్కన రచనమని పోతన అభిప్రాయమును కూడ తెలియజేయుచున్నది

★తిక్కనది నన్నయ అస్థిమాల రచన★

తిక్కన నన్నయభారతరచన శ్లోకముతో ప్రారంభించినట్లు నిర్వచనోత్తర రామాయణమును శ్లోకముతో ప్రారంభించెను నన్నయ హరిహరహిరణ్యగర్భులను కొల్చినట్లు, తిక్కన శ్లోకము పూర్తికాగానే 'హరిహరపద్మగర్భులను, నాదికవీంద్రుల, నూత్నకవీశ్వరులను భక్తిఁగొల్చి' అనిప్రారంభించెను నన్నయ 'అనిసకల భువన రక్షణ ప్రభువులై తత్ప్రసాదసమాసాదిత నిత్యప్రవర్ధమాన ' అని భారతమొదటి వచనరచన చేసినట్లు, విరాటపర్వమున తిక్కన మొదటివచనము 'అని సకల బ్రహ్మప్రార్థనంబుసేసి తత్ప్రసాదాసాదిత కవిత్వతత్త్వనిరతిశయానుభావానంద భరితాంతఃకరణుండ నగుచుండి యొక్కనా డిట్లని వితర్కించితి' అని ప్రారంభించెను. నన్నయ రాజరాజు కోరికతో పాండవులవలె రాజరాజు చంద్రవంశపు రాజు అని రాజరాజున కంకితమిచ్చెను తిక్కన మనుమసిద్ధి భారతరచనను కోరగా తిక్కన తన భారతము హరిహరనాధునకిచ్చినందున నీవు సూర్యవంశపురాజువని ఉత్తరరామాయణమును నిర్వచనముగ రచించి మనుమసిద్ధికంకితమిచ్చెను 'అని యానతిచ్చిన విని యక్కవివరుండిట్లనియె' అని నన్నయ(1-1-19 నుండి 21) తెల్పిన అంగీకారము తిక్కన మనుమసిద్ధికి చెప్పలేదు 'హరిహరపద్మగర్భులను, నాదికవీంద్రులు, నూత్నకవీశ్వరులను భక్తిఁగొల్చి అని త్రిమూర్తులను, పూర్వకవులను, నూతన కవులను నిర్వచనోత్తర రామాయణమున కొల్చిన తిక్కన, విరాటపర్వ అవతారికలో 'శ్రీయన గౌరినా బరగుచెల్వకు చిత్తముపల్లవింప భద్రాయితమూర్తియై హరిహరంబగురూపముదాల్చిన' హరిహరనాధుని కొల్వక 'విష్ణురూపాయ నమశ్శివాయ' యని పల్కెడుభక్తజనంబు వైదిక ద్యాయిత కిచ్చుమెచ్చు పరతత్త్వమును' ఇష్టసిద్ధికి కొలిచి, సకలబ్రహ్మప్రార్థనము చేసినట్లు వచనమునచెప్పుట గమనింపవలెను భారతరచనానైపుణ్యమునకు వ్యాస,నన్నయలను మెచ్చుకొనెనేకాని 'హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూత్నకవీశ్వరులను భక్తిగొల్చి' అని నిర్వచనోత్తరరామాయణములోవలె చెప్పలేదు. అనగా 'హరిహరాజగజాననార్క షడాస్యమాతృ సరస్వతీ గిరి సుతాదిక దేవతాతతికిన్ నమస్కృతి జేసి' వాల్మీకి వ్యాసభగవానులను కొల్చిన నన్నయపద్యమునే ఇష్టదేవతాస్తుతి, కవిస్తుతులుగా స్వీకరించి తాను నన్నయకావ్యమును ఉభయముగాతీసికొని, కవిమిత్రునిగా నన్నయభారత రచననుకొనసాగించితి నవినట్లు ధ్వనించినాడు కనుకనే 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షో ముఖాంజేషు . పురుషోత్తమామ్బుజభవ శ్రీ కన్దరాశ్శేయసే' అని మంగళముపాడిన

నన్నయకావ్యమును 'శ్రీయన గౌరినా బరఁగు జెల్వకుఁ జిత్తముపల్లవింప భద్రాయతమూర్తియై హరిహరంబగు రూపము దాల్చినట్లు చెప్పి కావ్యారంభము నన్నయనే చేసినందున వాణీహిరణ్యగర్భులను పేర్కొనలేదని కాలాంతరమున నిలిచిపోయినదానిని 'భద్రాయతమూర్తియై పల్లవింప చెప్పినట్లు ధ్వనించినాడు. "ఏయది హృద్య మపూర్వ, బేయది, యెద్దాని వినిన నెఱుక సమగ్రం, బైయుండు నఘనిబర్హణ, మేయది యక్కథయ వినఁగ నిష్టము మాకున్' (1-1-30) అన్న నన్నయరచనను 'ఎయ్యది హృద్యంబును, నపూర్వంబును, సమగ్రజ్ఞానప్రదంబును, నఘనిబర్హణంబును నైనయది యక్కథ మాకువిన నిష్టంబని (18-1-77)'తిక్కన రచించినాడు. నన్నయపైగౌరవము ప్రదర్శించి శ్లేషగా కావ్యభాగమున 'అంబ' అని గౌరిని, 'నవాంబుజోజ్వకరాంబుజ' అని లక్ష్మిని, 'శారద' అని సరస్వతిని సూచించి 'ప్రకటస్ఫుటభూషణరత్నరోచిరాచుంబిత ద్విగ్విభాగ' అని భారతకథాలంకారరత్నకాంతి తాకుచున్న (రాజరాజకీర్తిని తాకుచున్న) దిగ్విభావమైన అరణ్యపర్వశేషరచన 'భూసతికిం దివంబునకు' ప్రారంభపద్యమును, 'శ్రుతిసూక్తవివిక్త నిజప్రభావ' అని వేదసూక్తులయందు విస్పష్టముగానున్న నిజమైనప్రభావముకల భారతమును 'భావాంబరవిశ్రుతవిహార' అని భారతభావమును తిక్కన హృదయమున విశ్రుతముగ విహరింపచేసినట్లు ప్రార్థనను రచించినాడు

"వర్షం త్రయోదశమిదం మత్ప్రసాదాత్ కురుద్వహాః, విరాటనగరే గూఢాః అవిజ్ఞాతా శ్చరిష్యథ"-అను వనపర్వ 314-28 శ్లోకమున ఉన్న గూఢః, అవిజ్ఞాత అను పదములనే 'దానాంభః పటలంబునన్' అను పద్యములో నిగూఢాకారతన్ అనువిధముగ చిత్రికపట్టి ప్రయోగించుట' అని డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు తమ 'ఎఱ్ఱన అరణ్యపర్వశేషము' గ్రంథమున తెలిపియున్నారు ఆపద్యమును పరిశీలింతము (3-4-143)

శా॥ దానంభఃపటలంబునం బృథుపయోధారావలిందాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁబ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గినా
గా నొప్పారె మదోత్కటద్విరద సంఘంబుల్ వనాంతంబునన్

డా॥ పాటిబండి మాధవశర్మగారు పైపద్యములోని 'నిగూఢాకారతన్' అను ప్రయోగము పరామర్శించుచు స్వర్గమునుండి నన్నయ దిగివచ్చి అరణ్యపర్వమున గూఢముగ విహరించుచుండెనా యన్న మృదువైన ధ్వని ఈపద్యమున భావుక హృదయములను స్పృశించుచున్నదని తెలిపియున్నారు. ఎఱ్ఱన తనపేరు సప్తమాశ్వాసాంతమున

చెప్పినపుడు కవి గూఢత ఎక్కడున్నది? తిక్కన 'అస్థిమాల'గూఢతను ఇది సూచించుచున్నందున తిక్కన రచనమని, యిదికూడ తెలుపుచున్నది. ఇట్లుండుట చేతనే స్వర్గమునుండి నన్నయకుంజరము గూఢముగ అరణ్యపర్వరచనయందు విహరించిన రీతిని పై తిక్కన పద్యమునుండి భావించి, హరివంశమున ఎఱ్ఱన ఇట్లు విశదీకరించెను.

ఉ॥ ఉన్నతగోత్ర సంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటమున్ నరేంద్రపూ
జోన్నయ నోచితంబు నయియొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్

పైపద్యములోని 'ఊర్జితసత్త్వము' తిక్కనగారి 'ఊర్జితకథోపేతమును', 'ఉద్ధతాన్య పరిభావిమదోత్కటమున్' 'దానాంబఃపటలంబు'లోని 'ప్రావృట్పయోదానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గెనాగా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్' అన్న 'దానాంభః' పద్యభాగమును, 'ఉన్నతగోత్రసంభవము', 'నరేంద్రపూజోన్నయ నోచితంబు' సమాసములు ఎఱ్ఱనగారి' 'ఉన్నత సంస్కృతాది' పద్యఎత్తుగడను, ఆ పద్యములోని 'అరణ్యపర్వశేషోన్నయమును' భద్రజాతి సంపన్నము' తిక్కనగారి 'భద్రాయతమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూపాయ నమశ్శివాయ' యను పద్యపాదమును స్ఫురణకు తెచ్చుచున్నవి కావున శరద్భయమున నిగూడాకారతడిగ్గిన ద్విరదసంఘము అరణ్యపర్వశేషకథను రచించిన తిక్కన, రాజారాజప్రశస్తి రచించిన ఎఱ్ఱనలు నన్నయభట్టకుంజరము పేర దిగివచ్చిన తీరు ఈ పద్యమున వర్ణింపబడుట గమనార్హము కనుక పైపద్య అర్థతాత్పర్యాదులను ఈభావస్ఫురణతో పరిశీలింతము.

ఉన్నతగోత్రసంభవములోని 'గోత్రమునకు సం.వి.అ.న 1. వంశము 2 పేరు 3 గొడుగు 4 అడవి 5 బలిమి 6 వరిమడి పుం.కొండ అని శబ్దరత్నాకరమున అర్థములు ఇవ్వబడినవి కనుక ఉన్నత వంశమున పుట్టినది । ఉన్నత అడవియందు పుట్టినది; ఉన్నత అడవియందు సంభవించినది - నన్నయ మరణము అరణ్యపర్వ మధ్యలో సంభవించినది - అరణ్యపర్వరచన నన్నయ మరణించినను అస్థిమాలగా పుట్టినది అనగా రచింపక పోయిననూ ఆశ్వాసాంతగద్యము నన్నయ రచించినట్లే తెలుపుచున్నది

ఊర్జితసత్త్వము = వృద్ధిపొందిన కథాబలము కలది । వృద్ధిపొందిన అరణ్యపర్వకథ కలది విదురుడు ధర్మరాజుతనువుచొచ్చినపుడు ధర్మరాజు తనువున కాంతియు బలము

అధికమైనదని ఆశ్రమవాస ద్వితీయాశ్వాస 60,61వ పద్యములందు చెప్పినరీతిగా నన్నయకుంజరసత్త్వము తిక్కన కుంజరమున వృద్ధిపొందిన సత్త్వము భద్రజాతి సంపన్నము = భద్రజాతి (హరిహరనాధుని కృపచే) సంపన్నమైనది/శ్రేష్ఠమైన (భద్రజాతి) మత్తేభపద్యములచే సంపన్నమైనది. విరాటపర్వమున పంచపాండవులు గూఢవృత్తిగా చరించినట్లు అరణ్యపర్వశేషమున గూఢవృత్తిగా కవి చరించినట్లు తెలుపుచున్నది అది అస్థిమాల రచనగా ఊర్జిత(వృద్ధిపొందిన) కథోపేతముగ చరించినట్లు సూచించుచున్నది.

నన్నయ ఆదిపర్వమునుండి అరణ్యపర్వచతుర్థాశ్వాసము వర్షఋతువర్ణన వరకు 61 మత్తేభవృత్తములను రచించెను 1297 గద్యపద్యములు కలిగిన అరణ్యపర్వ నన్నయ రచనలో మాత్రము, కేవలము10మత్తేభములే కలవు అరణ్యపర్వచతుర్థాశ్వాసమునుండి అరణ్యపర్వాంతము వరకు గల 1597 పద్యములలో 69 మత్తేభములతో సంపన్నమైనది

ఉద్ధతాన్య పరిభావి మదోత్కటమున్ = ఉద్ధతులైన అన్యులచేత (గంధర్వులచేత తద్వారా ధర్మరాజుచే విడువబడిన పరాభవముచే ఉత్కటమైన (అధికమైన) మదముకలది ఈ పాదము అరణ్యపర్వశేషరచన చేసిన నన్నయ కథాభాగమును తెలుపుచున్నది

ఈపద్యపాదము 'దానాంభఃపటలంబునన్' పద్యపాదమును 'మదోత్కట ద్విరద సంఘంబుల్' ధ్వనించుటేకాక క్రిందిపద్యభావమునుకూడ సూచించుచున్నవి (3-6-3)

చ॥ అనిశముఁ బాండుపుత్రులకు నప్రియకార్యము రోయునట్టి దు
ర్జనుడు సుయోధనుం డతుల శత్రులచే నవమానితుండుఁబే
ర్చినకృప నొప్పుచున్న కురుసింహులచేత విమోక్షితుండునై
మనమున లజ్జలేక మునిమండన యెమ్మెయి నేగె వీటికిన్ (3-6-3)

నరేంద్రపూజ+ఉన్నయన+ఉచితంబు+అయి= (రాజరాజ) నరేంద్రుని పైకెత్తుటకు (ఆశ్వాసాంతమునుండి ఆశ్వాసారంభమునకు పైకెత్తుటకు) తగినదై, ఒప్పెడు=ఒప్పుచున్న, నన్నయభట్టు కుంజరంబు+ఎన్న = నన్నయభట్టు అను ఏనుగును ఎన్నుటకు, నిరంకుశ+ఉక్తిగతి = నిరంకుశమైన రచనారీతి/మరణించినను అడ్డములేక కొనసాగిన అరణ్యపర్వశేషకధ గతి (రాజరాజప్రశస్తి) రచనారీతి, ఎందునుగ్రాలుట = అరణ్యపర్వమునం దంతటను నన్నయ లేకపోయినను రచించినట్లు పేరుకొనసాగుట, ప్రస్తుతించెదన్ = కొనియాడెదను. ఈ పద్యము నన్నయపై తిక్కనకు గల గౌరవము వ్యక్తీకరించుచున్నది

తాత్పర్యము గొప్ప అడవిలో పుట్టినది (నన్నయ మరణించినను నన్నయపేరున పుట్టిన) వృద్ధిపొందిన అరణ్యపర్వశేషకధాబలముతో ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ పద్యములతో

తెగిన కథను పైకెత్తు రాజరాజప్రశస్తితో, సంపన్నమైన మత్తేభవృత్తములతో, ఉద్ధతులైన శత్రువులచే (గంధర్వులచే) పరాభవింపబడి (పాండవులచేత విముక్తులై) వృద్ధిపొందిన మదముకలిగిన కథకలిగినదిగా నన్నయ రచింపకపోయినను, నన్నయపేరున అడ్డములేని రీతిగా అరణ్యపర్వనందంతటను సంచరించుచున్న నన్నయభట్టు కుంజరమును కొల్చెదను

ఏనుగు చచ్చినా బతికినా విలువ వెయ్యిరూపాయలు అని నానుడి. ఏనుగు బతికినను, చచ్చినను విలువతరుగదను విషయమును, కవికి ఏనుగుకు పోలిక ఉన్నందున పైరీతిగా రచించినట్లు మనము గ్రహింపవచ్చును. భారతామృతమథనమున నన్నయ మరణముతో సంభవించిన మార్పు యిందు వర్ణింపబడినది

పైపద్యమునందు సూచించిన ఉన్నత సంస్కృతాదిపద్యమును పరిశీలింతము

ఉన్నత సంస్కృతాది చతురోక్తిపథంబుల కావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయ మాంధ్రభాష సుజనోత్సవ మొప్పగ నిర్వహించితౌ
నన్నయభట్ట తిక్కకవినాధులకెక్కిన భక్తి పెంపునన్.

పై పద్యముయొక్క అర్థతాత్పర్యములను పరిశీలింతము

నన్నయభట్ట, తిక్కకవినాధులకు=నన్నయ, తిక్కన మహాకవులకు, ఎక్కిన=పై కలిగిన, భక్తిపెంపునన్=భాగమును పెంచుటకు/భక్తి అధికముగా కలిగినందున, ఉన్నత=ఘనమైన అనగా గౌరవ సూచకముగా, సంస్కృత=సంస్కరింపబడిన అనగా మార్పులు చేయబడిన, ఆదిచతుర+ఉక్తిపథంబుల కావ్యకర్తవై=ఆదికావ్యనాయకుడైన రాజరాజును వర్ణించు నైపుణీమార్గముల భారతకావ్యమును రచించిన వాడవై, ఎన్నికము +ఇ= ఆశ్వాసాంత, ఆశ్వాసారంభములను ఎన్నుకొని, ప్రబంధపరమేశ్వరుఁడు= ప్రకృష్టమైన బంధము రాజరాజుకు భారతమునకు కలిగించినవాడు, జన్మజన్మకు బంధము కలిగించు వాడు (బ్రహ్మ), అనంగ=అనునట్లు, అరణ్యపర్వశేష+ఉన్నయము= అరణ్యపర్వశేషములోని ఆశ్వాసాంతకథనుండి ఆశ్వాసారంభమునకు పైకెత్తు రాజరాజప్రశస్తి, ఆంధ్రభాష=తెలుగుభాషలో, సుజన+ఉత్సవము+ఒప్పగ=సుజనుల సంతోషము పొందునట్లు, నిర్వహించితివి=భారమును పొందితివి అనగా రచించితివి

తాత్పర్యము గౌరవసూచకముగా మార్పుచేయబడిన ఆదికావ్యనాయకుడైన రాజరాజును వర్ణించు నైపుణీమార్గములను అనగా ఆశ్వాసాంతరాజరాజప్రశస్తిమార్గము,

ఆశ్వాసారంభరాజరాజ సంబోధనామార్గములను భారతకావ్యమున రచించినవాడవై ఆశ్వాసాంత, ఆశ్వాసారంభచోట్లను ఎన్నుకొని ప్రకృష్టమైనబంధమును రాజరాజుకు అరణ్యపర్వశేషఆశ్వాసాంత, ఆశ్వాసారంభములకు కలిగించినవాడవై కృతీశ్వరుడు (ప్రబంధపరమేశ్వరుడు)అనునట్లు అరణ్యపర్వశేషమున ఆశ్వాసాంతమునుండి ఆశ్వాసారంభములను పైకెత్తు రాజరాజప్రశస్తి రచనను నన్నయ, తిక్కనలపై నీకు కలిగిన అధిక భక్తివలన తెలుగుభాషనభిమానించు జనులు సంతోషము పొందునట్లు నిర్వహించితివి.

పై పద్యమునందు తిక్కనను చేర్చుటకు కారణము అరణ్యపర్వశేషకథ రచించినది తిక్కన అను ఎఱ్ఱన భావనయేనని గ్రహింపగలము లేనిచో నన్నయ సారస్వతాంశప్రశస్తి తన్నుచెందుటయు అని అరణ్యపర్వ సప్తమాశ్వాసాంతమున వ్రాసిన ఎఱ్ఱన అరణ్యపర్వశేషరచనను మాత్రము ప్రసంగించునపుడు తిక్కనను చేర్చవలసిన అవసరములేదు

ఈ సందర్భమున జక్కన తన 'విక్రమార్క చరిత్రము'న చేసిన కవిస్తుతి కూడ రాజరాజప్రశస్తిని మాత్రమే ఎఱ్ఱన రచించినట్లు సూచించుచున్నది కనుక అందలి కవిస్తు. పద్యములను వాటిలోని ఆంతర్యములను పరిశీలింతము (విక్ర 1-12,13,14)

ఉ॥ వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు సత్ప్రబంధముల్
పాయక చెప్పిరిట్లు రసబంధుర వాగ్విభవాభిరామధౌ
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కిరే
యేయెడ నన్నపార్యుగతి నిద్ధర? నట్టి మహాత్ము గొల్చెదన్

చ॥ పరువడి భారతాఖ్యగల పంచమవేదము నాంధ్రభాష సు
స్థిరత రచించుచోఁ గృతిపతిత్వము గోరి ప్రసన్నుడైన యా
హరిహరనాథుచేఁబడసె నవ్యయ సౌఖ్యపదంబు నెవ్వఁడా
పురుష వరేణ్యుఁ దిక్కకవిఁ బూని నుతింతుఁ గృతాధ్వరోత్సవున్

ఉ॥ ఈత్రయిఁ దాఁబ్రబంధ పరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వము నశేషము శ్రీ నరసింహ రామచా

(గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

రిత్రములున్ బుధవ్రత గరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁడా
చిత్ర కవిత్వ వాగ్విభవజృంభితుఁ గొల్చెద భక్తి యుక్తితోన్

పై పద్యముల భావమిది

(1)పదివేలమంది వేయివిధములుగా సత్ప్రబంధములు చెప్పినప్పటికి రసబంధురమైన వాగ్విభవమైన మనోజ్ఞమైన కావ్యరచనాభారమును సాహిత్యప్రపంచముననే భరించినవారు శబ్దశాసనవరేణ్యులు నన్నయవలె ప్రసిద్ధికెక్కినవారు ఎవరైన ఉన్నారా? (2) భారతమను పేరుగల పంచమవేదము సుస్థిరముగ రచింపతలచినప్పుడు, దానిని కోరి ప్రీతితో కృతిపతిత్వముస్వీకరించి ప్రసన్నుడైన ఆహరిహరనాధునిచే మోక్షము పొందిన యజ్ఞకర్తయైన తిక్కనను స్తుతించెదను (3) ఈమూడు తాను (i) శబ్దవైచిత్రిచేత ప్రబంధ పరమేశ్వరుడై శేషములేకుండ అరణ్యపర్వమును (ii) నరసింహ (iii) రామ చరిత్రములను విశేషముగా (వింతగా) రచించెను ఆ చిత్రకవిత్వ వాగ్విభవజృంభితుడైన ఎఱ్ఱన,శంభుదాసుని (శంకరభక్తుని)భక్తియుక్తితో కొల్చెదను

పైపద్యవిషయములలో క్రిందిగూఢములను నిక్షిప్తముచేసినట్లు గమనింపవచ్చును

(1) భారతమున ఆది, విరాట, అరణ్య పర్వ సప్తమాశ్వాసాంతములందు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన అవతారిక లుండుటచే భారతమును కవిత్రయము రచించిరని భావింపుచుండగా నన్నయ కవి స్తుతియందు 'భారత' ప్రస్తావన చేయలేదు. తిక్కన కవిస్తుతిలో 'భారతాఖ్య గల పంచమవేదము'ను ఆంధ్రభాషలో సుస్థిరముగా రచించెనని, ఎఱ్ఱన మూడురచనలు చేసెనని 'త్రయి'శబ్దము ప్రయోగించి శబ్దవైచిత్రి ప్రబంధపరమేశ్వరుడై అరణ్యపర్వమును శేషము లేకుండ రచించెనని చెప్పెను ఇట్లు చెప్పుట తిక్కన పూర్వపరార్థ యుక్తి చేయునట్టి యెడల యత్నమించుకైనను వలవ దనిన దానిని ఎఱ్ఱన శేషము లేకుండ రచించినట్లు ధ్వనించెను ఎఱ్ఱన 'ప్రబంధపరమేశుడనంగ అరణ్యపర్వశేషోన్నయము'ను నిర్వహించినట్లు చెప్పగా, జక్కన 'ప్రబంధ పరమేశ్వరుడై విరచించె శబ్దవైచిత్రి నరణ్యపర్వము నశేషము' అని చెప్పుటలోని ఆంతర్యము 'కృతీశ్వర' పర్యాయపదమే 'ప్రబంధ పరమేశ్వర' అని తెలియజేయును.

(2) ఎఱ్ఱన రచించిన 'హరివంశ' ప్రస్తావన జక్కన చెప్పిన మూడు కావ్యములలో లేదు. కనుక జక్కన 'విక్రమార్కచరిత్రము' వ్రాయునాటికి ఎఱ్ఱన హరివంశము రచింపలేదను భావనకు బల మొసంగి ఎఱ్ఱన, జక్కన సమకాలికులని తెలియగలదు.

(3) ఎఱ్ఱన నృసింహపురాణమున అరణ్యపర్వశేషపూరణను, హరివంశమున రామాయణరచనను మాత్రమే పేర్కొనినందున ఎఱ్ఱన కావ్యరచనాక్రమము (1) అరణ్యపర్వశేషపూరణ (2) నృసింహపురాణము (3) రామాయణము (4) హరివంశము అని తేలును కారణమేమనగా ఎఱ్ఱన తన రచనములందు అంతకుముందు రచించిన ఒక కావ్యమునుమాత్రమే పెర్కొనినట్లు తెలియగలదు రామాయణము ముందు రచించి యుండినచో,అరణ్యపర్వ సప్తమాశ్వాసాంతమున అవతారికలో రామాయణరచనా ప్రస్తావన చేసియుండెడివాడు. అట్లు చేయలేదు. నృసింహపురాణము తర్వాత రామాయణ రచన చేసినట్లు భావించినచో, ప్రతికావ్యము నందును పూర్వము రచించిన కావ్యనామము లభ్యమగును ఎఱ్ఱన సమకాలికుడైన జక్కన చెప్పిన క్రమము సరిపోవును. (4) నన్నయ కవి స్తుతిలో 'య' ప్రాస, తిక్కన కవి స్తుతిలో 'య' అక్షరపు తర్వాతి అక్షరమైన 'ర' ప్రాస జక్కన ప్రయోగించి యున్నందున అదే భారతమున అరణ్య పర్వశేషరాజరాజప్రశస్తిని పూరించిన ఎఱ్ఱన 'నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశప్రశస్తి తన్ను చెందుటయు తత్కవితారీతాయుఁ గొంతతోప తద్రచనయు కా నారణ్యపర్వశేషము పూరించె' అని చెప్పుకొనినందున, అరణ్యపర్వశేషకథ, రాజరాజ ప్రశస్తి రెండును రచించి యుండినచో నన్నయను స్తుతించినట్లు ఉత్పలమాల పద్యము 'య' ప్రాసాక్షరముతో స్తుతించి యుండెడివాడు కాని తిక్కన 'అస్థిమాల'గా నన్నయ గద్యముతో అరణ్యపర్వశేష కధ, ఎఱ్ఱన రాజరాజ ప్రశస్తి యుండినందుననే 'త్ర' ప్రాసాక్షరముతో ఉత్పలమాల పద్యమును రచించినాడు 'త్ర' ప్రాసాక్షరము త,ర రెండు అక్షరముల సంయోగమైనందున తిక్కన కథ, (ఎఱ్ఱన) రాజరాజప్రశస్తి సంకేతముగా రచించినట్లు మన భావనకు వదలివేసినాడు ఈ సందర్భమున 'ర' ప్రాసాక్షరము భారతరచనము నంతటను తిక్కన కవిస్తుతి యందు సూచించుట, అరణ్య పర్వము భారతరచన యందు భాగమగుట గమనార్హము అంతేకాక నన్నయ రచనము ఆది, సభా, అరణ్యపర్వ సగమైనను నన్నయ కవిస్తుతిలో సూచింపకుండుట, తిక్కన రచనము వలననే నన్నయ కీర్తి నన్నయ తదనంతర కాలమందు, దిగంతములకు వ్యాపించినదన్న స్తుతియు గర్భితము.

(5) ఎఱ్ఱన, శంభుదాసుడు, ప్రబంధ పరమేశ్వరుడు అను మూడింటిని ఒకే పద్యమున పేర్కొనుటలో వింత గోచరించును కారణము శబ్దశాసనుని వలె ప్రసిద్ధి కెక్కినవారు కలరా? అని నన్నయ స్తుతిలో చెప్పి, ఎఱ్ఱన కవిస్తుతిలో బిరుదుగా ధ్వనింపలేదు ఎఱ్ఱన శంభుదాస లక్షణాభిధేయమును కాని, ప్రబంధ పరమేశ్వరుడని కాని అరణ్యపర్వ శేష అవతారికలో చెప్పుకొనక 'ప్రబంధపరమేశుడనంగ అరణ్యపర్వశేషోన్నయ మాంధ్రభాష' నిర్వహించితినని, 'గిరిశపద భక్తి తత్పర భావము కలిమి శంభుదాసుండనగా బరగి' అని నృసింహపురాణమున రచించి, గద్యమున 'శంభుదాస లక్షణాభిధేయ ఎఱ్ఱన నామధేయ' అని ప్రథమ స్వతంత్ర కావ్యమైన నృసపింహపురాణముననే పేర్కొనుట, ఎఱ్ఱన పూరించిన రాజరాజప్రశస్తి ప్రత్యేక కావ్యనామముగా పేర్కొనలేకపోవుట చేత అని అనిపించును ఈ సందర్భమున నృసింహపురాణ గద్యమున 'శంభుదాస లక్షణాభిధేయమును' నాచనసోముడు తిక్కన విశేషణములు 'ఉత్తర హరివంశ' గద్యలందు ప్రయోగించుట చూచి అనుకరించెనని భావింపవచ్చును

(6) ఏ కవిగాని కావ్యరచన పూర్తిచేసిన తర్వాత, కావ్యకరణహేతువు తెలుపుచూ అవతారిక రచించుట పరిపాటి కాని అరణ్యపర్వ చతుర్థాశ్వాస మధ్యలో నన్నయరచన ఆగిపోయినది కనుక నన్నయ అవతారిక రచించియుండుననుట అనుమానాస్పదము తిక్కన అష్టాదశపర్వనిర్వహణసవృతమై భారతము పెనుపొందిన దనినాడు అట్లు పూర్తిచేసిన తర్వాత తిక్కన ఆదిపర్వ నన్నయ అవతారిక, 'హరిహరాజగజాననార్క' పద్యము ముందువరకు రచించియుండునని జక్కనకు పరంపరాగత విషయముగ తెలిసియుండ నోపును. కనుకనే నన్నయ స్తుతిలో "భారత" ప్రస్తావన లేదని కూడ పై పద్యములు సూచించును

ఈ విషయమును నన్నయ తిక్కనలే భారతమును రచించిరని ఎఱ్ఱన చెప్పిన క్రిందిపద్యము బలపరచుచున్నది (నృ పు -1-9)

ఉ॥ భాసురభారతార్థములభంగులు నిక్క మెఱుంగనేరమిన్
గాసటబీసటే చదివి గాథలుద్రవ్వు తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లగఁజేసినట్టి య
బ్బాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్

తాను అరణ్యపర్వశేషకథ రచించియుండినచో, నన్నయ,తిక్కనలు తనభాగ్యవిశేషమున అరణ్యపర్వశేషకథను విడిచిపెట్టిరని తాను దానిని రచించి

(గ్రంథకర్త గోపినాధ శ్రీనివాసమూర్తి (గోపినాధ వేంకటకవి మనుమని మనుమడు)

ధన్యుడైనట్లు, పోతన భాగవతమున 'ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్ తెనుగుల్ సేయుచు మత్పురాకృత శుభాదిక్యంబు తానెట్టిదో' అని రచించినట్లు నృసింహపురాణమున 'భాగ్యముగాదె' ఎత్తుగడతో చెప్పుకొని యుండెడివాడు. అరణ్యపర్వశేషమున 'భాగ్యముగాదె' తెల్లముగాదె' 'అవిభుకాంతగాదె' వంటి పద్య ఎత్తుగడలు, వచనమధ్యమున పదములుగ రచించియుండుట గమనార్హము. హరివంశమున వేమారెడ్డి అరణ్యపర్వశేషము రచించిన ధన్యుడివి భారతపరాంశమైన హరివంశమును రచింపమని దానిని తన కంకితమివ్వమని చెప్పియుండెడివాడు. పై పద్యములో నన్నయ తిక్కనలే భారతపరమార్థమును (ఉత్కృష్టమైన వస్తువు అనగా భారత కథాభాగమును) రచించినారని చెప్పుటకు కారణము 'భాసురభారతార్థములభంగులు నిక్కమెఱుంగనేరమిన్' అనినాడు తిక్కన 'విదితార్థగతిస్ఫురణంబు గల్గి అష్టాదశపర్వనిర్వహణ సంవృతమై పెనుపొందియుండ' అనెను అర్థగతి స్ఫురణము కలదని తిక్కన చెప్పగా 'అర్థములు భంగులు నిక్కమెఱుంగ నేరమిన్' అని ఎఱ్ఱన అనుటలోని అంతరార్థమేమి?

★ అర్థయుక్తి, అర్థగతి, ప్రబంధ నిర్వచనములు ★

అర్థభంగి, అర్థగతిరెండును ఒకటేకదా అర్థముల భంగులు అనుట బహువచనమున పలుకుటవలన కనుక అర్థగతి, అర్థయుక్తి అనగా నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు భావించినది ఏమో తెలిసినకాని దాని భావము మనకు తెలియదు కనుక నన్నయ, తిక్కన ఎఱ్ఱన ప్రయోగములనుండి గ్రహించెదముగాక నన్నయ, తిక్కనలు 'అర్థయుక్తి' పదమును క్రిందిపద్యములలో ప్రయోగించియున్నారు (1-1-26) (4-1-42).

ఉ॥ సారమతింగవీంద్రులు ప్రసన్నకథా [1]కవితార్థ [2]యుక్తిలో[3]
నారసి [4]మేలునా నితరు [5]లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్
భారత సంహితారచన బంధురుడయ్యె [6]జగద్ధితంబుగన్

ఆ॥ కథ జగత్ప్రసిద్ధ గావున పూర్వపర్వార్థయుక్తి సేయునట్టియెడల
యత్నమించుకంతయయినను వలవదు, వలసినట్లు సెప్పవచ్చియుండు

ఇక్కడ 'అర్థయుక్తి' భావమేమి? నన్నయ చెప్పిన పూర్వపద్యములనుండి గ్రహించెదముగాక

---

1 కలితా- గి,ద,న,మ,య,లి,వహ, కవితార్థయుక్తితో-వీ ఇది29 ప్రతులలోగల పారము, వివిధార్థయుక్తి (కొన్నిప్రతులు), కథాకధితార్థ - కొ,చొ, కవితార్థతత్త్వమొప్పారసి-టీ 2 తత్త్వమున్నారసి-ఉ,ర, యుక్తితో- ఆ,ఇ,వ,ఓ,ఔ,క,చ,జ,ట,డ,ప,బ,య,వ,శ,ష 3 లోతారసి-అ,ఈ,ఎ,ఏ,ఇ,ఒ 4 మేలనా- అ,ఆ,ఈ, ఉ,ఊ,ఎ,ఓ,క,బ 5. అక్షతనాదము-చొ 6 జగత్ప్రసిద్ధిగన్-ప ర

(గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

రాజరాజు 'భారతకథా శ్రవణాభిరతిన్ మదీయ చిత్తము ననిశంబు భారతకథాశ్రవణ ప్రవణంబ కావునన్, జననుత కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడ దెనుగున రచియింపు మధికధీయుక్తి మెయిన్' అనినాడు అంతేకాదు 'భారతబద్ధ స్పృహులగు వారికి నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థమిలన్' అనికూడ అనినాడు ఈ రెండింటిలో 'భారతబద్ధ' అని చెప్పుటలోని అంతరార్థమేమి? జనమేజయునికి వైశంపాయనుడు భారతకథ చెప్పినట్లు, ఉగ్రశ్రవసుడను సూతుడు శౌనకాది మహామునులకు భారతకథ చెప్పి వారు భారతకథలో భాగమైనట్లు నన్ను భారతబద్ధుని చేసి, అనగా భారతము వినువానిగా చేసి నిరూపితార్థము ఏర్పడునట్లు భారతము రచింపుము అని భావము అందుకనే 'మహాభారతబద్ధనిరూపితార్థమేర్పడ' 'ప్రసన్నకథాకలితార్థయుక్తితో నారసి మేలునా' ప్రయోగములు ఈ సమాసములోని 'తోనారసి'ని 'లోనారసి' అని లేఖకులు సవరించినారు కాని కవిపాఠము 'తోనారసి' అని క్రింది ప్రయోగములనుండి గ్రహింపవచ్చును

నన్నయ 'అర్థయుక్తి' పదమును పై పద్యముననేకాక ఇంకొక రెండు పద్యములలో మాత్రమే రచించియున్నాడు అవి ఇవి (1-1-64) (1-6-270)

క॥ అమితార్థయుక్తితోనా, శ్రమవాసాది త్రిపర్వసహితం బయి యా
శ్రమవాసపర్వ మత్యు, త్తమకథలను వెలయుఁబంచదశపర్వంబై

ఉ॥ పోలఁగ ధర్మశీలుఁడయి భూరిబలాధికుఁడైన ధారుణీ
పాలకురక్ష మున్ వడసి భార్యను బుత్రుల నర్థయుక్తితో
నోలిన మేలుగాఁ బడసి యుల్లకు నున్నది యట్లుగానినా
దేల గృహస్థవృత్తి సుఖమేగి మనంబున నున్కి కష్టమే

సారమతింపద్యమున 'కలిత' 'బంధురుడయ్యే' ఉన్నందున 'తో' ప్రత్యయమే ఉచితమని భావింపవచ్చును

హరిహరనాధుడు తిక్కనను యిట్లు అర్థించినట్లు చెప్పుకొనెను. (4-1-17, 18)

క॥ పారాశర్యుని కృతియయి, భారతమను పేర బరఁగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁద, ద్గౌరవ మూహించి నీవఖండిత భక్తిన్

| అర్థయుక్తి కృతీశ్వర ప్రశస్తి రచన | | అర్థగతి కృతీశ్వర ప్రశస్తి రచన | |
|---|---|---|---|
| ఆశ్వాసారంభము | ఆశ్వాసాంతము | ఆశ్వాసారంభము | ఆశ్వాసాంతము |
| నన్నయ<br>ఆదిపర్వ ద్వితీయాశ్వాసమునుండి ఒకపద్యమున సంబోధనాపూర్వక రాజరాజ వర్ణన | ఆదిపర్వ ప్రథమాశ్వాసాంతమున సభాపర్వ ద్వితీయాశ్వాసాంతమున మాత్రము మూడు పద్యములు రచించి తక్కిన ఆశ్వాసాంతము లందు రెండుపద్యములలో రచించిన రాజరాజ వర్ణన | ఒక కందపద్యము శ్రీతో ప్రారంభించి కృతీశ్వరుని ప్రశంసించి సంబోధనా విధమున ముగించునట్లు రచన | ఆదిపర్వప్రథమాశ్వాసాంతము<br>1 ఉత్పలమాల 1 కందము 1తోటకములో కృతీశ్వర (వర్ణన)ప్రశస్తి<br>సభాపర్వద్వితీయాశ్వాసాంతము<br>1 రథోద్ధతము 1 కందము 1ఉత్సాహములలో కృతీశ్వర ప్రశస్తి<br>తక్కినఆశ్వాసాంతములందు<br>1 కందము 1 వృత్తములలో అనగా రెండు పద్యములలో కృతీశ్వరప్రశస్తి |
| తిక్కన<br>అరణ్యపర్వచతుర్థాశ్వాసమునుండి సప్తమాశ్వాసము వరకు అర్థయుక్తి మాని హరిహరనాధుని మనస్సున నిలుపుకొని విన్నపముగా అరణ్యపర్వ శేషకథ అష్టిమాలగా నివేదించినాడు అనగా అరణ్యపర్వ కథమాత్రము రచించినాడు | పూర్వపర్వ (అరణ్యపర్వ) అర్థయుక్తి రచన మానినట్లు విరాట పర్వము లోని 'కథజగత్ప్రసిద్ధి' పద్యమున హరిహరనాధునకు విన్నవించినాడు | పూర్వపర్వ (అరణ్యపర్వ) అర్థయుక్తి రచన మానినట్లు విరాట పర్వము లోని 'కథ జగత్ప్రసిద్ధి' పద్యమున హరిహరనాధునకు విన్నవించినాడు కనుక భారతకథ' మాత్రమే అరణ్య పర్వమున రచింపబడినది | పూర్వపర్వ (అరణ్యపర్వ) అర్థయుక్తి రచన మానినట్లు విరాటపర్వము లోని 'కథ జగత్ప్రసిద్ధి' పద్యమున హరిహరనాధునకు విన్నవించినాడు కనుక భారతకథ మాత్రమే అరణ్య పర్వమున రచింపబడినది |
| విరాటపర్వ ద్వితీయాశ్వాసమునుండి ఒక కందపద్యమున హరిహరనాధ సంబోధనాపూర్వక వర్ణన | విరాటపర్వ ప్రథమాశ్వాసాంతము నుండి మూడు పద్యములలో రచించిన హరిహరనాధ వర్ణన. | ఒక కందపద్యము 'శ్రీ'తో ప్రారంభించి హరిహరనాధుని ప్రశంసించి సంబోధన విధమున ముగించినట్లు రచన. | ప్రతి ఆశ్వాసాంతమునందును ఒక వృత్తమును ఒక కందపద్యమును, ఒక మాలినీవృత్తమును మొత్తము మూడు పద్యములలో (కృతీశ్వర) హరిహరప్రశస్తి రచన |

(గ్రంధకర్త: గోపినాధ శ్రీనివాసమూర్తి (గోపినాధ వేంకటకవి మనుమని మనుమడు)

తే॥ తెనుఁగుబాస వినిర్మింప దివురుటరయ, భవ్యపురుషార్థతరుపక్వఫలముగాదె
దీనికెడ నియ్యకొని వేడ్కనూని కృతిప, తిత్త్వ మర్థించి వచ్చితి తిక్కశర్మ

ఈ అర్థనను యుక్తముచేయునదే అర్థయుక్తి దాని రచించు చంధోగతియే అర్థగతి లేక అర్థభంగి మనము భారతమునుపూర్తి చూచినచో నన్నయభాగములో రాజరాజ హరహరనాథ ప్రశస్తి పద్యములే అర్థయుక్తమైన అర్థగతి తిక్కన విరాటపర్వమునకు పూర్వపర్వమున అనగా అరణ్యపర్వశేషమున అర్థయుక్తి వదలివేసి హరిహరనాథునకు అంకితము చేసినట్లు హరిహరనాథునికి 'దివ్యచిత్తంబున' అవధరింపుమని అర్థయుక్తి, అర్థగతి, ప్రబంధ నిర్వచనములు చెప్పకొనినాడు విరాటపర్వమునుండి హరిహరనాథప్రశస్తి తిక్కన రచించినాడు అనగా 3 అర్థముల (ముగ్గురితో అర్థించిన మూడు అర్థముల) భంగులు భారతమున కలవు. ఈఅర్థయుక్తి, అర్థగతులను కవిభావించిన రీతిని ఎదుటి పుటయందు చూపిన విధముగా గ్రహింపవచ్చును

కనుక తెలుగు భారతము తెలుగు సాహిత్య చరిత్రలో మొట్టమొదటి ప్రబంధము దేహసంబంధమైన బాంధవ్యములు వ్యవహారికముగ జన్మమాదిగా వ్యాప్తమయియుండగా, సాహిత్యచరిత్రలో కవికావ్యకథాభాగము కవికుమారిగా, కావ్యకన్యగా మానసికముగ ప్రసిద్ధికెక్కినది. కథనురచింపమని అర్థించి కృతిపొందిన రాజును శ్రోతగాచేసినపుడు కావ్యకన్య కావ్యసతిగా, భూపతికి భూసతిగా ప్రసిద్ధికెక్కును కనుకనే తిక్కన 'ఏ నిన్ను మామ యనియెడు, దీనికిఁ దగనిమ్ము భారతీ కన్యక నాకీనర్హుఁడ వగు' అని ప్రబంధ నిర్వచనము మనుమసిద్ధి ప్రభువు చెప్పినట్లు చెప్పినాడు. జక్కన 'విక్రమార్క చరిత్రము' లోని నన్నయస్తుతిలో ప్రబంధమని నన్నయ రచనను పేర్కొనినట్లు 50వ పుటలో చూచితిమి. ఆ 'భారతీకన్యక' భారతమను కన్యకను అంకితము కోరిన మనుమసిద్ధి అని భావము. దానికి తిక్కన బదులు చెప్పక రామాయణమును రచించి మనుమసిద్ధికి అంకితమిచ్చి నచ్చచెప్పెనని మనము భావింపవలెను రామాభ్యుదయమున అయ్యలరాజు రామభద్రకవి తన కృతిభర్త గొబ్బూరి నరసింహునిచే యిట్లు చెప్పించినాడు

చ॥ క్షితిపతి యెవ్వఁడైన నగుఁ గీర్తియసామ్ము నృపాలకోటికిం
గృతిపతియైనవాడె కృతకృత్యుడు గాన నొనర్పు సప్తసం
తతులకు నెక్కుడంద్రు కృతి దాశరదీర్ఘ కథాసుధాచమ
త్కృత కృతి రామభద్ర చెవికిం జవిగొల్పు భవిత్కవిత్వమున్

గ్రంథకర్త గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

రాజు ఎవ్వరైనను బలవంతుడైన, బలహీనుడైనను కావచ్చును. రాజులు కీర్తికాంక్షులు. సామాన్యమనిషియైనను కృతిపతియగుచో వాడిజన్మము సార్థక్యము (కృతకృత్యుడు). సప్తసంతానములలో కృతి గొప్పది అంటారు.

ఎఱ్ఱన నృసింహపురాణములో ఈవిధముగా అనెను.

చ॥ కృతికి విభుండు శ్రీవిభుడు; కీర్తన పావనమైన తద్గుణ
స్తుతి కృతి; విష్ణుదాసులు యశోనిధు లూర్జితపుణ్యులుత్తముల్
కృతిఁగొనియాడువారు; కృతకృత్యుడనైతి మదీయ వాంఛిత
ప్రతతికిఁజెంద గల్పతరుపాకము శ్రీతరకావ్యరూపతన్

కృతిభర్త నరసింహస్వామి. కావ్యమున వర్ణింపబడిన పావనమైనఅంశము కృతి. విష్ణుభక్తులు, యశోనిధులైన కృతికర్తలు, వానిని పఠించి విద్వత్తులుగా వృద్ధిపొందు భావికవులు (ఊర్జితపుణ్యులు), ఉత్తములైన పాఠకులు కృతిని కొనియాడువారు. తను కోరిన రచన కల్పతరువై భగవంతునికిచ్చి తను కృతకృత్యుడైనట్లు ఎఱ్ఱన చెప్పుకొనెను.

"కావ్యం యశసే, అర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షయే; సద్యః పర నిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే" అను ఆలంకారిక ప్రామాణ్యము ననుసరించియేనన్నయ కథారంభ,కథాంతరాజరాజవర్ణనము అర్థకృతే పర్యాయముగా 'అర్థయుక్తి'అని నన్నయ నిర్దేంచినట్లు భావింపవచ్చును. భారతకథకు ఈవల, అవల ప్రతిఆశ్వాసమున నిబంధించిన అర్థయుక్తి (రాజరాజవర్ణనము) అర్థయుక్తి మూలముగనే సమన్వయము చేసుకొనినవే కథ ప్రసన్నమగును. ఇది సంస్కృతకావ్య సంప్రదాయముకాదు. తెలుగున నన్నయ ప్రవేశపెట్టినదే. ఇదే ప్రబంధ నిర్వచనము. ఆశ్వాసములోని భారతకథకృతి. కేవలము భారత కథ మాత్రమే కావ్యమందున్నచో, అది కృతి, ఆశ్వాసమునకు ఈవల అవల కృతీశ్వరప్రశస్తి తగిలించినచో అది ప్రబంధము అని పూర్వుల భావనగా తలంపనగును. ఈసందర్భమున ఆంధ్రసారస్వత పరిషత్తువారు ప్రచురించిన 'తెలుగు సాహిత్యం-మరోచూపు' అనుగ్రంథములోని 'ప్రబంధాలు-సామాజిక, మత, రాజకీయ భూమి' అను ఉపన్యాస వ్యాసములో శ్రీ ఎస్.వి. రామారావుగారు యిట్లు తెలిపియున్నారు.

"అసలు ఆంధ్రవాఙ్మయచరిత్రలో పురాణయుగం, కావ్యయుగం, ప్రబంధయుగం అన్న విభజనమే విడ్డూరంగా కనబడుతుంది. కవిత్రయం చేసినరచన ఇతిహాసంకాగా,

వారు ప్రాతినిథ్యం వహించిన యుగాన్ని పురాణయుగం అని వ్యవహరిస్తున్నాము. అటు సంస్కృతవాఙ్మయంలో, ఇటు ప్రాచీనాంధ్రవాఙ్మయంలో కొన్ని రూఢ్యార్థాలతో ప్రయుక్తమైన 'సాంకేతిక' శబ్దాలను మనసాహిత్యవిమర్శకులు ఈ విధంగా తమకు తోచిన అర్థంలో వాడుకోవడం శోచనీయమైన విషయం. ప్రబంధ శబ్దానికి అదేగతి పట్టింది.

ప్రబంధం అంటే స్వతస్సిద్ధమైన అర్థం కావ్యం. సంస్కృతలాక్షణికులు నిర్వచించిన సర్గబంధమనే మహాకావ్యమే తెలుగులో సుమారు ప్రబంధం అయింది. 16వ శతాబ్దానికి ముందటి తెలుగు కవులందరూ- నన్నెచోడుడు, పాల్కురికి, తిక్కన, ఎర్రన, శ్రీనాథుడు మున్నగువారు తమ కావ్యాలను ప్రబంధాలుగా పేర్కొన్నారు. వీనిలో ఇతిహాసాలూ, ద్విపదకావ్యాలూ, క్షేత్రమహాత్మ్యాలూ మొదలైనవి ఉన్నాయి. కావ్యానికి పర్యాయపదంగా 'ప్రబంధ' శబ్దం ఇంతసుస్పష్టమైన అర్థంలో వాడుకలో ఉండగా - 16వ శతాబ్దంలో వెలువడిన కావ్యాలకు మాత్రమే ప్రబంధాలు అని ఎవరు ఏవేళలో నామకరణం చేశారో కాని, ఆముహూర్తంనుంచి ఆశబ్దానికి ఉన్న సహజమైన అర్థంపోయి అంతకుముందులేని అర్థం వాడుకలోకి వచ్చేసింది. తర్వాతి విమర్శకు లందరూ ఆ అర్థాన్ని రూఢిచేసి ప్రబంధానికి కొన్ని లక్షణాలను ఆపాదించారు. అవి ఏకనాయకాశ్రయము, వస్త్వైకము, స్వతంత్రరచన, శృంగారరసము, ఆలంకారికశైలి, అష్టాదశ వర్ణనలు."

★భారత రచనలో నారాయణభట్టు పాత్ర★

ఇట్లు మానసికబంధమును ప్రబంధమనుట నన్నయకాలమునాటి సంస్కారపరులైన కవిపండితులు వ్యతిరేకించియుండవచ్చును. దానికి రాజరాజు పండితసభలు ఏర్పరచి నన్నయరచనను ఆసభయందు పఠింపజేసి వ్యతిరేకించిన సంస్కారపరులను నారాయణభట్టు వాక్చాతుర్యముచే రాజరాజప్రశస్తిని నన్నయసారస్వతమునందు చేర్చుటను సమ్మతింపచేసియుండవచ్చును. దీనిని గుర్తించు గౌరవమే.

ఉ॥ పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణు నట్లు వానస ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుడుం దనకిష్టుడున్ సహా
ధ్యాయుడు నైనవాఁ డభిమతంబుగ దోడయి నిర్వహింపగన్ (1-1-25)

అను నన్నయ పద్యరచనకు ప్రేరణయై యుండును. లేనిచో, పైపద్యరచనాకారణము పాఠకునకు భారతమున కన్పట్టదు.

ఈఅర్థయుక్తి రచింపక వదలివేసినపుడు కథ జగత్ప్రసిద్ధమగును. కనుకనే తిక్కన పైపద్యమున ఆభావమును వెల్లడించినాడు. అరణ్యపర్వ చతుర్థాశ్వాసము నుండి అర్థయుక్తి రచింపక వదలివేసిన ఎట్లు జగత్ప్రసిద్ధమగునో అనగా 'ప్రసన్న కథాకలితార్థయుక్తి' కాకుండునో క్రింది ఉదాహరణములతో తెలిసికొందము.

'అర్థయుక్తి'తో కూడిన రచన

414.వ॥ ఇట్లు ప్రసన్నులై.... కువలయాశ్వుండు విజయోల్లాసభాసితుండై యుదంకు నిజాశ్రమంబున కనిచి తనపురంబున కరిగి వారాంగనానృత్యగానవిశేషంబు లాలోకించుచు రాజధానిం బ్రవేశించి సముజ్జ్వల సామ్రాజ్యసౌఖ్యంబులం బరఁగు చుండెనని మార్కండేయుండు ధర్మరాజునకుఁ గువలయాశ్వుండు దుంధుమారుండైన విధంబుసెప్పెనని వైశంపాయనుండు జనమేజయున కెఱింగించిన తెఱంగు.

415.క॥ చరమయుగచలిత ధర్మ స్థిరీకరణ చతురచరిత ధీగుణలీలా
పరికర పరిచిత నయవి, స్తర వితరణ వివరణైక దానవినోదా

416.మాలిని కరివరహరికూర్మక్ష్మాధరాధీశతుల్యో
ద్ధరణ గుణధురీణోద్దండ బాహార్గళాగ్ర
స్ఫురిత నిఖిలగోత్రా భోగభోగ్యైక భోగా
దరణ సుఖితమూర్తీ ధర్మతంత్రానువర్తీ

గద్యము ఇది సకల సుకవిజనవినుత.... నన్నది చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

1.క॥ శ్రీయువతిప్రియ నృపవా, రాయణ బిరుదాంకభీమ రమణీయగుణ
శ్రీయుత నిర్మల ధర్మప, రాయణ రవితేజ రాజరాజనరేంద్రా

2.వ॥ అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె నట్లు బహుభంగుల మార్కండేయుండు వివరింపం బుణ్యకథావిశేషంబులు విని సంతుష్టహృదయుండై కౌంతేయపూర్వజుండు మఱియు నమ్మునీంద్రున కిట్లనియె

(పై రచననే) 'అర్థయుక్తి' లేకుండ రచన

414.వ॥ ఇట్లు ప్రసన్నులై.... కువలయాశ్వుండు విజయోల్లాసభాసితుండై యుదంకు నిజాశ్రమంబున కనిచి తనపురంబున కరిగి వారాంగనానృత్యగానవిశేషంబు లాలోకించుచు రాజధానింబ్రవేశించి సముజ్జ్వల సామ్రాజ్యసౌఖ్యంబులం బరఁగు చుండెనని మార్కండేయుండు ధర్మరాజునకుఁ గువలయాశ్వుండు ధుంధుమారుండైన విధంబుసెప్పెనని వైశంపాయనుండు జనమేజయున కెఱింగించిన తెఱంగు.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత.... నన్నది చతుర్థాశ్వాసము

**పంచమాశ్వాసము**

1.వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనట్లు బహుభంగుల మార్కండేయుండువివరింపం బుణ్యకథా విశేషంబులు విని సంతుష్ట హృదయుండై కౌంతేయపూర్వజుండు మఱియు నమ్మునీంద్రున కిట్లనియె

అర్థయుక్తిలేని రచన జగత్ప్రసిద్ధమైన కథారచనవలె మధ్య రాజరాజప్రశస్తి అడ్డంకులులేక కథ సుప్రసిద్ధమై యున్నది.అర్థయుక్తి ఉన్నరచన ఆశ్వాసాంతకథ, ఆశ్వాసా రంభకథతో మధ్యఉన్న అడ్డంకులు తొలగించుకొనుటకు భారతకథను సమన్వయము చేసికొనవలెను. అట్లు సమన్వయము చేసుకొనిననేకాని కథ ప్రసన్నముకాదు.

తిక్కన పూర్తిచేయగనే భారతములో మూడు విధములైన అర్థముల భంగులు ఉండెను. [1]నన్నయ రచించిన అర్థయుక్తి [2](తిక్కన అరణ్యపర్వశేషమున రచింపక వదలివేసిన) అర్థయుక్తి [3]తిక్కన విరాటపర్వమునుండి రచించిన అర్థయుక్తి.

ఎఱ్ఱన రాజరాజప్రశస్తి రచనవలన ఇప్పుడు నన్నయ, తిక్కనల అర్థయుక్తులతో మాత్రమే నిండియున్నది. తిక్కన విడిచిపెట్టిన అర్థయుక్తి, 'గాధలు త్రవ్వు తెలుంగువారికి' (విమర్శకులకు) ఎఱ్ఱన రచించుటచేత, తిక్కన చెప్పిన 'విదితార్థస్ఫురణ' మాయమై 'విషయ స్ఫురణములోపించినదని', ఎఱ్ఱననే 'భాసుర భారతార్థముల భంగుల' పద్యములో తెలిపియున్నాడు. కనుక తిక్కన అరణ్యపర్వశేషకథ రచన లోకమునకు తెలియక లోపించినది.

స్వర్గారోహణపర్వము రచించిన తర్వాత అరణ్యపర్వశేషరచనమునందు ప్రారంభించిన పద్యము 'భూసతికిం దివంబునకు' అని ఆ పద్యములోని 'శరత్సమాగమ'

పద ప్రయోగము సూచించుటయేకాక, 'దానాంభఃపటలంబునన్' పద్యముకూడ సూచించుచున్నది. 'ప్రావృట్పయోదానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గెనా,గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్' అను పాదములోని 'శరద్భయంబున' ప్రయోగమువలన ఈగూఢరచన శరత్కాలమునకు ముందునుండి అని సూచించును. కారణము భయమునకు పూర్వమే నివారణమునకు జాగ్రత్తవహించుట సహజము కదా. భూసతి అనగా భూపతి (రాజరాజునకు) అంకితమైన కథ అని భావముకదా. అది ఎక్కడనుండి? అంతకు పూర్వమునుండి అనికదా. అనగా నన్నయరచన వర్షఋతు కడపటిపద్యము 'సురచాపచిత్ర'తో అంతమని, 'భూసతికిం' పద్యము తిక్కన మొదటి పద్యమని భావము. దానిముందరి 'తత్సమయానంతరంబున' తిక్కన మొదటివచనము అని మనము తెలిసికొనియుంటిమి.

'తత్సమయానంతరంబున' అను ప్రథమవచనమునకు 'వర్షఋతువు గడిచిన తర్వాత' అని కథాపరముగ భావము. 'నన్నయరచన తర్వాత' అని కవిపరముగ భావము. అట్లే కవిపరమైన 'భూసతికిం' పద్యభావమును పరికింతము.

140.ఉ॥భూపతికిం దివంబునకుం బొల్పెసగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై విలసిల్లె, మహర్షిమండలో
పాసిత రాజహంసగతి భాతి ప్రసన్నసరస్వతీక మ
బ్జాసనశోభితంబగుచు నబ్జజయానముతో సమానమై.

భూసతికిం = నన్నయ రచించిన 'సురచాపచిత్ర' పద్యము వరకు ఉన్న కథకు, దివంబునకు = శూన్యముగానున్న విరాటపర్వకథ ప్రారంభమువరకు, పొల్పెసగంగ = ఒప్పిదము ప్రకాశింపగా, శరత్+సమాగమం = వర్షఋతువు అంతమౌతుండగా వచ్చిన శరత్కాలము; ఆ సకల ప్రమోదకరమై = అటు భారతకథాగమనమునకు సంతోషపెట్టునట్లు, ఇటు నన్నయరచన పూరణమువలన జనులను సంతోషపెట్టునట్లు, మహర్షిమండల+ఉపాసిత = మునిసంఘముచే ఉపాసింపబడిన, రాజహంసగతి = నలమహారాజుచే విడువబడిన హంసవిధముగా, ప్రసన్నసరస్వతీకము = ప్రసన్నమైన సరస్వతి కలది(నన్నయ తిక్కనల వాణికలది)సరస్వతి ప్రార్థన కలిగిన చతుర్థాశ్వాసము, అబ్జాసన శోభితంబగుచు = బ్రహ్మచేశోభించి, అబ్జజయానముతో సమానమై = హంసతో సమానమై, భాతి = ప్రకాశించెను.

తాత్పర్యము: రాజరాజాంకితమైన అరణ్యపర్వచతుర్థాశ్వాస మధ్యలో నిలిచిపోయిన భూపతినుండి హరిహర నాథాంకితమైన విరాటపర్వము వరకు పూరింపవలసిన శూన్యము (దివము)నకు ఒప్పునట్లు శరత్కాలము అందరు సంతోషించునట్లుగా విలసిల్లెను. మునిసంఘముచే ఉపాసింపబడిన నలదమయంతికథయందు నలమహారాజుచే విడువబడినహంస చేసిన రాయభారమువిధముగా ప్రసన్నమైనసరస్వతీకము (నన్నయవాణి, తిక్కనవాణి ప్రసన్నము (సరస్వతి ప్రార్థన) కలది) పూరణవలన జనులకు బ్రహ్మశోభితమగుచు హంసతోసమానమై ప్రకాశించెను.

పై పద్యమునకు ఆధారమైన వ్యాసశ్లోకములు ఇవి

క్రౌంచహంస సమాకీర్ణా శరత్ప్రముదితా భవత్, రూఢకక్ష వనప్రస్థా ప్రసన్నజలనిమ్నగా
విమలాకాశ నక్షత్రా శరస్తేషాం శివాభవత్

పై శ్లోకమునకు భావమిది: నదిలోని జలము తేరి ప్రసన్నముగా ప్రవహించుచుండ తీరమున క్రౌంచ, హంస పక్షులు చరించుచుండగా డొంకలు, వనములు, కొండల చరియలు గడ్డి మొలచి శరదృతువు ఆవిర్భవించినది. విమలమైన ఆకాశము, బాగుగా ప్రకాశించు నక్షత్రములు, పక్షులు శరత్కాలమున కూడి ఉన్నవి.

వాల్మీకిరామాయణములోని ఈక్రింది శ్లోకమును కూడ పైపద్యము గుర్తుచేయును.

చపలస్య తు కృత్యేషు ప్రసమీక్ష్యాధికం బలమ్
క్షిప్ర మన్యే ప్రపద్యంతే క్రౌంచస్య ఖమివ ద్విజాః యుద్ధ 12-33

దీని భావమిది- చపలత్వముతో పనులుచేసే బలవంతుని లోపాన్ని కనిపెట్టి శత్రువులు భేదింపరాని క్రౌంచపర్వతమును కుమారస్వామి శక్తిచే భేదింపబడిన రంధ్రమును ఉపయోగించుకొని హంసలు క్రౌంచపర్వతమును దాటినట్లు బలవంతుని లోపాన్ని వినియోగించుకొంటారు.

ఇది తిక్కన ప్రారంభశ్లోకమగుటచే ఎఱ్ఱన, నన్నయ, తిక్కనల కీర్తిని కాంక్షించితినని యిట్లు రచించినట్లు భావింపవచ్చును.

★ఎఱ్ఱనరచన భారతకావ్యశయ్య కాదు★

వ॥ కతిపయాక్షరపరిగ్రహజనితంబైన నైసర్గికచాపలంబు కతంబున

ఉ॥ మించినవేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁగూయఁగడంగు భంగి బ్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్య, గీ
లించిన కీర్తిసంగసుఖలీలకు నేనును కాంక్షఁజేసితిన్.

కొందరు ఈ పద్యమును కాళిదాసు రఘువంశమున రచించిన 'మందఃకవియశఃప్రార్థీ' అను శ్లోకముతో అన్వయించుకొని, ఎఱ్ఱనవినయము పై పద్యము సూచించునని చెప్పెదరు. కాని అది సరికాదు. కారణము, కాళిదాసు పై శ్లోకమును రఘువంశ అవతారికయందు రచించి, రఘువంశరామచరిత్రమైన రామాయణమును రచించిన ఆదికవి రచనము ముందు, తను నగుబాటు నొందుదునని 'ఎత్తుగానున్నవానిచేత (పైకి చేతులు ఎత్తు అవకాశము కలిగిన - గ్రాహ్యము) పొందదగిన పండు పొందవలెనను ఆశతో పైకి ఎత్తిన చేతులుగల పొట్టివానివలె నను ఉపమానమూలమున తన వినయమును భూత, వర్తమాన క్రియకు భవిష్యద్వచనముగ విన్నవించుకొనినాడు. కాని ఎఱ్ఱన నన్నయ,తిక్కనలు రచింపని నృసింహపురాణ అవతారికయందు పై పద్యమును రచించి, తను అంతకుపూర్వము పూరించిన అరణ్యపర్వశేషమును 'భాసుర భరతార్థముల భంగులు' పద్యమును, పై పద్యమున ప్రయోగించిన 'ఆద్యుల' పదముచే సూచించి రాజరాజకీర్తిపద్యములని గ్రాహ్యము - ధ్వనించుచు, అందలి 'వ్యాసముని ప్రణీత పరమార్థ' సంగమునకు కాక 'కీర్తి సంగసుఖలీలకు' - కీర్తిసంగ విశ్రాంతికి అని గ్రాహ్యము - కాంక్షిచితినని భూతకాల రచనకు భవిష్యత్కాల క్రియగ చెప్పుకొనెను. అంతేకాక కాంక్షించితి నను పదప్రయోగము వలనను, ఆపద్యరచనకు హేతువుగా చెప్పిన 'కొన్ని అక్షరములు (నన్నయ రూపవర్ణన చేసిన రాజరాజ కీర్తి అక్షరములలో కొన్ని) పరిగ్రహించిన చాపల్య కారణమున' అను పూర్వ వచనరచన వలనను కూడ ధ్వనించినాడు.

కాలప్రవాహములో కవి తన పేరునుపోలిన మరొక కవినుండి గుర్తింపుకు తనతండ్రి, తాత, ముత్తాత మూడు తరములవారి పేర్లను తన మొదటి కావ్యమున పరిచయ గుర్తింపుగా చెప్పుకొనుట సంప్రదాయము. ఎఱ్ఱన ఈ సంప్రదాయము తన నృసింహపురాణమున మాత్రమే పాటించుటచేతను, ఈ పద్యరచన చేతను, తన మొదటి కావ్యము నృసింహపురాణమని చెప్పుకొనినాడు. ఇట్లు అంతకుముందరి అరణ్యపర్వశేష పూరణమున చెప్పుకొనకపోవుట వలన అరణ్యపర్వశేషకావ్యకథ రచింపలేదని అతి చిన్న విషయమైన రాజరాజవర్ణనను ధ్వనించినాడు.

పైపద్యరచనమునకు కారణము 'కతిపయాక్షర (కొన్ని అక్షరములు) పరిగ్రహించుటవలన పుట్టిన స్వభావసిద్ధమైన చాపల్యకారణమున' అని పై వచనమునందు చెప్పినాడు. కతిపయాక్షరములు రాజరాజప్రశస్తి రచనయందు అని ఎఱ్ఱన భావము. పై పద్యమందు నన్నయ,తిక్కనల పేర్లు స్మరింపలేదు. కాని నృసింహపురాణ కవిస్తుతియందు నన్నయ, తిక్కనలను ఒకే పద్యమున స్మరించినాడు. వాల్మీకి, వ్యాస భగవానులను వేరువేరు పద్యములలో సంస్కృతకవులలో స్మరించినాడు. పై పద్యములో కావ్య శయ్య ఒకేపద్యమున స్మరించిన నన్నయ తిక్కనలవి. దానికి ఆవల కీలించిన అనగా తర్వాత తగిలించిన అర్థయుక్తులు అనగా రాజరాజప్రశస్తి తను రచించినట్లు చెప్పుకొనినాడు. ఇది సప్తమాశ్వాసాంతమున తనఅవతారికతర్వాత రచించిన రాజరాజప్రశస్తే చతుర్థాశ్వాసాంతమునుండి తిక్కన రచింపక వదలినవి తను (కృతేశ్వర ప్రశస్తి)రచించినట్లు చెప్పుకొనినాడు.

ఎఱ్ఱన పద్యములోని కీర్తిసంగము ప్రశస్తి కూడలియైన ఆశ్వాసాంత ఆశ్వాసారంభ రాజరాజప్రశస్తి రచన - సుఖలీలకు అనగా విశ్రాంతి తేలికగా రచించుటకు నేను కాంక్షచేసితినని తను రచించిన మరుసటి కావ్యము నృసింహపురాణమున చెప్పుట వలన, ఎఱ్ఱన రచించినది రాజరాజప్రశస్తే అని తెలుపుచున్నది. ఈ వచన, పద్యరచనా హేతువు సూక్ష్మములో నన్నయ, తిక్కనల కీర్తిని కాంక్షించితినని ఆకాలములోని విమర్శకులకు తెలుపుకొనుట.

తిక్కన అరణ్యపర్వ కావ్యశయ్య అస్థిమాలగా నన్నయ తిక్కనలరీతి, అరణ్యపర్వశేష రాజరాజప్రశస్తి ఎఱ్ఱన, నన్నయరీతి రచించియుండుటచేతనే హరివంశమునందు తిక్కనను ఎఱ్ఱన కవిబ్రహ్మ అని పొగడియున్నాడు చూడుడు.

★తిక్కనరచన అరణ్యపర్వశేషకావ్యశయ్య★

మ॥ తనకావించిన సృష్టి తక్కొరులచేతం గాదునా, నేముఖం
బున దాఁబల్కినపల్కు లాగమములై పొల్పొందు నా వాణిన
త్తను నీతం డొకరుండనాఁ జను, మహత్త్వాప్తిన్ గవిబ్రహ్మనా
వినుతింతున్ గవి తిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితన్

పై పద్యములోని 'ఆగమములై' అను పదము తిక్కన 'ప్రాంశుపయోద' అను భీష్మపర్వపద్యములోని 'ఆగమపుంజపదార్థతత్త్వనిశ్శంశయకారు' అను రచనను

గుర్తుచేయుటకా' ఎఱ్ఱన ప్రయోగించె ననిపించి, 'ఆగామి' కర్మకు సన్నిహితమైన నన్నయ వర్షఋతువర్ణనను తిక్కన శరదృతువర్ణన చేసినట్లు ధ్వనించుచున్నది. అందుచేతనే ఆదికవిపద వాచ్యుడైన నన్నయరచనను పూర్తిచేసిన తిక్కనను, 'కవిబ్రహ్మ" అని ప్రశంసించినాడు. పైపద్య అర్థతాత్పర్యాదులను పరిశీలింతము.

అఖిల+ఉర్వీదేవత+అభి+అర్చితున్ = బ్రాహ్మణులందరు పూజించు, కవి తిక్కయజ్వ = యజ్ఞముచేసిన తిక్కనకవి, తాన్ = తాను, ఏముఖంబున = ఏ నోటితో, పల్కిన పల్కులు = రచించిన మాటలు, ఆగమములై = నన్నయవర్షఋతువు శరదృతువుగా ఆగమకర్మయైనదై అదే నడక కలిగినదై, పొల్పొందు = ఒప్పారుచున్నది, ఆ వాణిన్, అత్తను = ఆ వాక్కును, ఆవాక్కు ధరించిన శరీరమును, ఈతండు ఒక్కండునాన్ = ఇతడు (తిక్కన) ఒక్కడేనా అనునట్లు, చను = వెడలినది; తన= తనంతట(మొదలుపెట్టి శిల్పముచేత), కావించుసృష్టి = సృష్టింపబడిన రచన, తక్క+ఒరులచేతం కాదు = తిక్కన తప్ప ఇతరుల చేతకాదు., నాన్ = అనునట్లు, మహత్త్వ+ఆప్తిన్ = గొప్పమహాత్యముగా రూపొందిన కవిబ్రహ్మనా = కవులను సృష్టించు బ్రహ్మనా అనునట్లు, వినుతింతున్ = ప్రస్తుతించెదను.

తాత్పర్యము: యజ్ఞము చేసిన మహాకవిగా బ్రాహ్మణులందరు పూజించు తిక్కన, తాను ఏనోటితో పలికిన పలుకులు నన్నయ వర్షఋతువే సహజ మార్పుతో శరదృతువుగా రాగలిగినదై ఒప్పారుచున్నదో, ఆవాక్కు, ఆవాక్కును ధరించినశరీరమును ఈ తిక్కన ఒక్కడేనా అనునట్లు వెడలినది. తిక్కన తనంతట మొదలుపెట్టిన శిల్పముచేత (కళచేత) సృష్టించబడిన రచన తిక్కన తప్ప ఇతరులు ఎవ్వరు రచింప వీలుకాదు అనునట్లు గొప్ప మహత్వముతో రూపొందిన కవిబ్రహ్మ అనునట్లు కవి తిక్కనను ప్రస్తుతించెను. ఎఱ్ఱన తిక్కనను ఏ కారణముచేత 'కవిబ్రహ్మ' అనెనో అదే కారణమున కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు 'అరణ్య పర్వశేషము' ఎఱ్ఱన రచించెనని తలంచి ఎఱ్ఱనను 'సర్వమార్గేచ్ఛా విధాత్రుండు' అనెను.

తిక్కన రచింపక వదలిననేకాని ఎఱ్ఱన అరణ్యపర్వశేషమును వ్రాయలేడు. కనుక తిక్కన ఏమి రచించితినని చెప్పుకొనెనో తిక్కన అవతారికనుండి మనము గ్రహించెదముగాక.

తిక్కన తను రచింపదలచిన (భారతమునకు) ప్రబంధమండలికి అధినాధునిగా ఏ పురుషుని పేర్కొనవలెనని ఆలోచింపుచుండ యించుక నిద్రవచ్చెను. ఆ నిద్రలో తన తండ్రి కొమ్మన కలలో కనవచ్చెను. వచ్చి యిట్లు అనతి యిచ్చెనని సంశోధిత ప్రతియందు పాఠాంతరములతో కలదు.

11..వ॥ "కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా, పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్ కిం [1]కాలకూటః కిమువా యశోదాస్తన్యం తవ స్వాదు వద ప్రభో మే"[2]యని నీవు తొల్లి రచియించిన పద్యంబు[3]గాఢాదరంబు నవధరించి భక్తవత్సలుండగు హరిహరనాథుండు [4]నీదెస దయాళుండై యునికింజేసి నిన్నుం గృతార్థునిఁ జేయం గార్యార్థియయి నాకలోక [5]నివాసి యయిన నాకుఁదన దివ్యచిత్తంబునం గల యక్కారుణ్యంబుతెఱం గెఱుంగు నట్టి శక్తిం బ్రసాదించి నన్ను నాకర్షించి [6]కొలిపించుకొని వీడె విజయం [7]చేయుచున్నవాఁడనుచుం జూపుట[8]యు సవిశేష సంభ్రమ [9]సంభరిత హృదయుండనయి [10]యవ్వేలనుఁ గలయంగనుంగొనునప్పుడు.

పై వచనమున 'గాఢాందరంబు' అను పదమునకు 'గూఢార్థంబు' అని పాఠాంతరము సంశోధితప్రతియందు నిచ్చియున్నారు. అది సరియైన కవిపాఠమని గోచరించును. కారణము ఆశ్లోకమునకు మరియొక కావ్యగతమైన అర్థము పాఠకులకు సూచించుట కవి ఉద్దేశ్యమని తలంపవచ్చును.

ఆగూఢార్థమును పైశ్లోకములోని అస్థిమాల, కౌస్తుభము, కాలకూటము, యశోదాస్తన్యములలో నిక్షిప్తము. అస్థిమాలలోని మాల పద్యకుసుమములమాలను సూచించును. అస్థిపదము, ఎముకలు, అనగా మరణించినవారి స్మరణచిహ్నము. కనుక మరణించిన నన్నయ పేరు, (మాల) పద్యకుసుమమాలను బోలిన ఆశ్వాసము కడపటి గద్యమునందు రచించుట. అస్థిమాల అనగా విదురుడు ధర్మరాజు తనువుచొచ్చినపుడు ధర్మరాజు తనువున కాంతియు, బలము అధికమైనదని ఆశ్రమవాస ద్వితీయాశ్వాస 60,61 పద్యములలో చెప్పినరీతిగ నన్నయ రచననుండి బలము వృద్ధి పొందిన తిక్కన తేజస్సు. అది నన్నయ పద్యములలోని వచనములలోని పదములనో, పదసముదాయమునో

---

11. 1. కాలకూటమ్- డ,త,ద,ల 2. అని- కొన్ని ప్రతులు 3. సాదరంబున- ఎ,ద; గూఢార్థంబు- వ,స 4.నీపై, నేవేళ-అని పాఠములు 5. వాసినయిన నాకు- కొన్ని ప్రతులు 6. కొలిపించుకొని- డ,త,ద; కానిపించుకొని- వ 7. చేసియున్నాడనుచుం- వ, 8. యునేను- ల,వ 9. పరీతచిత్తుండనై- వ, సంభారితాంత చిత్తుండనై- ల 10. యవ్వేలనుం గనుగొను నప్పుడు- కొన్నిప్రతులు.

నన్నయను స్మృతిపథమున నిలుపునట్లు అరణ్యపర్వశేషమున తిక్కన ప్రయోగించిన కళ. ఉదాహరణములతో పరికింతము.

చతురంభోధిపరీత భూవలయమున (1-3-93) మునకు 'చతురంభోధిపరీతక్షితతః (3-4-160)' అనునది అస్థిమాల. 'సుగంధబంధురసమీరణున్ సఖుడూచుచుండగా (3-4-10 పదమునకు 'శారదరాత్రుల'పద్యము అస్థిమాల. కారణము ఆపద్యమునందు 'గంధబంధురోదార' పదసమూహములో 'గంధబంధుర' కలదు. ఇట్లే 'నారలుగట్టి కూరలశనంబుగ నుగ్రవనంబులో' అని ప్రథమ, తృతీయ పాదములందు కలిగిన పద్యమునుండి గ్రహించిన 'నారలుగట్టి కూరలశనంబుగ నుగ్రవనంబులో విపద్భారమునొంది' (3-5-349) అస్థిమాలపద్యము. నన్నయ ఎత్తుగడపదముతో రచించిన పద్యములుకూడ అస్థిమాలపద్యములు. తిక్కన నన్నయపేర రచించిన అరణ్యపర్వశేషరచన ఆశ్వాసాంతగద్యము నన్నయపేర కలిగినది అస్థిమాలగా చెప్పబడినది. అతి సూక్ష్మముగా చెప్పవలసినచో, నన్నయ పరకాయప్రవేశముతో తిక్కన రచించిన నన్నయ రచనమని చెప్పవచ్చును.

'కౌస్తుభ'మనగా షష్ఠ్యంతములను, అంతస్సన్నిధి కలిగించుకొని రచించిన విరాటపర్వాది భాగము, భగవంతునికి చిత్తమున ఆవధరింపమని చెప్పిన భాగము. 'శ్రీ' పదముతో రచన ప్రారంభించుటచే, కావ్యమునకు వక్షోభాగమున ఉండుటచే, కౌస్తుభము. ఇవి తిక్కన క్రొత్తగా సాహిత్యమున ప్రవేశపెట్టిన అంశములు. కాలకూటమనగా విషము. విషసమానమైన వృత్తాంతము, అజగరోపాఖ్యానము వంటిది. నన్నయ కడపటి పద్యమునుండి దానిని హరిహరనాథునకు అంకితముగా చతుర్థాశ్వాసమును ఆస్వాదించు (కొనసాగించు) హరిహరనాథుని యత్నము. లోకరక్షణమునకు హరుడు విషము గ్రహించినట్లు హరిహరనాథునికి కూడ అది ఆమోదయోగ్యము అని తిక్కన స్వప్నమున భగవంతుని అంగీకారము సూచించెను.

'యశోదాస్తన్యము' అనగా హరి దేవకీదేవిస్తన్యముకాక యశోదాస్తన్యమును దేవకీదేవి స్తన్యమువలె సేవించినట్లు సేవించుట. దీనికి ఉదాహరణము తిక్కన అంతస్సన్నిధిగా(మనస్సునందు హరిహరనాథుని రూపము నిలుపుకొని) ఆశ్వాసప్రారంభమున హరిహరనాథుని సంబోధింపక విరాటపర్వమునకాని, స్వర్గారోహణపర్వమునకాని సంబోధించి రచించినపుడు హరిహరనాథుడు అరణ్యపర్వరచనను దివ్యచిత్తమున ఆస్వాదించినవిధము. దీనివి ఉత్తరోత్తర ఉదాహరణములతో తెలుపబడును.

గ్రంథకర్త: గోపీనాథ శ్రీనివాసమూర్తి (గోపీనాథ వేంకటకవి మనుమని మనుమడు)

ఆశ్లోకమును మెచ్చుకొని దర్శనమిచ్చిన భగవంతునిరూపమును తిక్కన క్రిందివిధముగా వర్ణించినాడు.

సీ॥ కరుణారసము వొంగి తొరగెడు చాడ్పున [1]శశిరేఖ నమృతంబు జాలువాఱ
హరినీలపాత్రిక సురభిచందనమున,గతి నాభిదవళపంకజము మెఱయ
గుఱియైన చెలువున [2]నెఱసిన లోక,రక్షణ [3]మనంగ గళంబుచాయఁదోప
బ్రథమాద్రిఁ[4]దోతెంచు భానుబింబంబునా ను,రమ్మునఁగౌస్తుభరత్న మొప్ప

గీ॥ సురనదియును గాళిందియు బెరసి[5]నట్టి కాంతి[6]పూరంబు [7]శోభిల్లు శాంతమూర్తి
నామనంబు నానందమగ్నముగఁజేయ, నెలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు

పై పద్యమునందు కనబడిన భగవంతుని పేరు సర్వేశ్వరుడని తిక్కన చెప్పెనే కాని హరిహరనాథుడని చెప్పలేదు. ప్రథమ, తృతీయ పాదములందు హరుని, ద్వితీయ, చతుర్థపాదములందు హరిని వర్ణించియున్నాడు. పద్యములో 'హరి' మాత్రమే కలదు. 'హర' పదములేదు. పద్యము ఎత్తుగడ కరుణారసము అని (అరణ్యపర్వ) కావ్యరసమా అనునట్లు ప్రారంభమగుట, చివరిగీతపద్యమునందు గంగా, యమునానదులను (రసరూపమును) వర్ణించుట, ప్రతిపాదమును అరణ్యపర్వశేష స్మృతి తెచ్చునట్లు వర్ణింపబడుట, తిక్కన, పాఠకునికి తను అరణ్యపర్వశేషమును రచించుటను ధ్వనిచేయుచున్నాడా? అనిపించును.

తిక్కన తన తండ్రిచేతనే 'హరిహరనాథుడు వచ్చుచున్నా'డని చెప్పించెనేకాని పీఠికయందంతటను 'సర్వేశ్వరుడు, అద్దేవుడు, అప్పరమేశ్వరుడు, అవ్విభునకు, అఖిలాండపతి, అజ్జగన్నాథుండు, పరమేశ్వరునిం, పూజ్యమూర్తి, అవ్విభుం, నూత్నరత్నమునకుం దేవదేవునకు' అని పేర్కొనెను. భారత రచనను అమృతమథనముతోను, హరిహరనాథరూపముగను ధ్వనించెను.

కిమస్థిమాలాం శ్లోకములో క్షీరసాగరమథనములోని 'కాలకూట, కౌస్తుభము' లను ప్రయోగించి పై సీసపద్యమున 'కౌస్తుభ' కాలకూట 'చాయ గళమున' సూచించుట చేత అరణ్యపర్వము కాలకూటమని సూచించెను. దానిని పూరించుటకు, విరాటపర్వ రచనతో ప్రారంభించుటలో క్షీరసాగరమథనములోని 'కౌస్తుభము'(విరాటపర్వము) ఉత్పన్నమైనదని సూచించినాడు. అరణ్యపర్వశేషమును గళచాయగా సూచించెను.

ప్రథమ, తృతీయ పాదములందు అమృతము, గళఛాయ హారవర్ణనయందు కలవు. కరుణారసము వొంగి తొరఁగెడు చాడ్పున శశిరేఖ 'ఎంతోకాలమునుండి అంధకారముగా నిలిచిన సాహిత్యప్రపంచమును వెలిగించు వెలుగురేఖ' వలె ధ్వనించును.శశిరేఖ కాంతి ఆకాశమునందును,అందుండిజాలువారి భూప్రసారితమైనట్లు పొంగిపొరలెడిది కనుక 'సుధాంశువికీర్యమాణకర్పూరపాండురుచిపూరము'ను 'భూసతికిం, దివంబునకు పొల్పెసగంగ శరత్సమాగమం బాసకలప్రమోదకరమై'ను తలపింపచేయును.

'హరినీలపాత్రిక సురభిచందనమునగతి నాభిదవళపంకజము మెఱయ' అన్న పాదము 'విలసన్నవకైరవగంధబంధురోదారసమీరసౌరభము'ను 'అబ్జాసన శోభితంబగుచు అబ్జజాయానముతో సమానమై' పాదభాగములను తలపింపచేయును.

గుఱియైన చెలువున వెఱసిన లోకరక్షణమన మనంగగళంబు చాయదోప' అను సమాసము భారతామృతమథనమున అజగరునికాటు తప్పి భీముడు బయటపడినను, మరణించిన నన్నయవలన కథ ఆగిపోయినది. లోకహితార్థము హరుడు విషము మ్రింగినట్లు హరిహరనాథాంకితముగా తిక్కన అరణ్యపర్వశేషకథ రచించినట్లు చాయ కనబడుచున్నదని 'గుఱియైన' పదముద్వారా గుర్తుచేసినాడు. ప్రథమపాదములోని అమృతము,తృతీయపాదములోని గరళముకంటే ప్రాముఖ్యము వహించినది. ప్రథమాద్రితోతెంచు భానుబింబంబునా సురమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప' అను పాదము తోచు+తెంచు = తోతెంచు కనుక 'స్ఫురదరుణాంశు'పద్యమును గుర్తుచేయును. ప్రథమాద్రియగు విరాటపర్వమున కౌస్తుభము కలదనికూడ గుర్తుచేయును.

తేటగీతిలోని సురనది అమరభాషనుండి తెలుగునేలకు భారతమును అవర్ణళగంగా ప్రవాహమువలె సంస్కృత సమాసధారతో కవిత్వమును దింపిన నన్నయ రచనను. కాళింది అలతి అలతి తెలుగుపదములతో రచించిన తిక్కన రచనాధారను గుర్తుచేసి రెండు సమపాళ్ళలో కలిపి అరణ్యపర్వశేషరచనలో బెరసి క్రమముగా తెలుగు, సంస్కృతపదముల సమపాళ్ళలో కలిసిపోయిన రీతిని సరస్వతీకముగా ప్రవహించినదని నన్నయ,తిక్కనల కవితాసమాగమమును 'బెరసినట్టి కాంతిపూరంబు' ప్రయోగముతో వర్ణించినాడు. ఈ సరస్వతీనది తీర్థమున తార్క్ష్యుడు అనుముని ఆరాధనతో ప్రత్యక్షమైన సరస్వతీదేవి వలన ముని తన సందేహములను నివృత్తి చేసుకొని కృతజ్ఞతగా భారతీదేవిని మూలమున శ్లోకము లేకున్నను స్తుతించెను. ఇందు 'భారతీ'పదము భారతమున

ప్రవహించు సరస్వతిగా భావింపవచ్చును. శ్రీయన, గౌరినాబరగు అని లక్ష్మీ పార్వతులను ఒక చెలువగా వర్ణించిన విధమున అంబ(పార్వతి) నవాంబుజోజ్జ్వల కరాంబుజ (పద్మహస్తయైన లక్ష్మి) శారద (సరస్వతి)ని కావ్యరసవర్ణనగా రచించుట గమనింపదగినది. తిక్కనరచనమని గుర్తుచేయునదని ముందు తెలుసుకొంటిమి.

**★అస్థిమాల కౌస్తుభము, యశోదాస్తన్యము, గరళము, పదప్రయోగ కారణము★**

నన్నయ ఆది, సభాపర్వములు పూర్తి రచించిన తర్వాత 400, 356, 399 వచన పద్యములతో అరణ్యపర్వమునందు ప్రథమ, ద్వితీయ, తృతీయ ఆశ్వాసములను రచించాడు. కాని ఆశ్వాసాంత గద్యసాంత గద్యము రచింపలేదు. చతుర్థాశ్వాసమును రాజరాజ సంబోధనతో ప్రారంభించి అజగరవృత్తాంతమువరకు రచించి వర్షఋతువర్ణన పూర్తిచేసి ఆంధ్రసాహిత్యవర్షమును కురిపించి ఆంధ్రులను సంతోషపరచినారు. దైవబలము లేమి ఏ గుండెపోటు ప్రాణముతీసెనో తెలియదు కాని సాహిత్యరచన నిలిచిపోయినది. తర్వాత రెండువందల సంవత్సరములపైన తిక్కన ఉదయించినాడు. కొనసాగింపతలచినాడు. తిక్కనకు అట్లు రచించుట కుదయించిన ప్రశ్నలు కొన్ని కలవు వాటిని పర్యాలోకింతము.

(1) నన్నయ రచించిన దాదాపు 140 పద్యములతో చతుర్థాశ్వాసము ముగించినచో రాజరాజప్రశస్తితో ఆశ్వాసాంతపద్యములు నన్నయవలె రెండురచించి పూర్తి చేయవలెను. చూడనిమనిషిని, అందును రచించుకవిని పోషించురాజు అర్థింపక, నన్నయరచనను చూచి అందు రెండుపద్యములు అనగా తృతీయాశ్వాసాంత రెండుపద్యములను తిరిగి చతుర్థాశ్వాసమున పూరించి చతుర్థాశ్వాసము నన్నయగద్యతో పూర్తిచేయుట సాహిత్యదృష్టితో బాగుండదు. 140 పద్య వచనములను పఠించి మంచి సన్నివేశనమున ఉన్న పాఠకుని దృష్టి మళ్ళించినట్లై రసభంగమగును. ఇట్టి (సగము ఒకరాజునకంకితమిచ్చి మరణించిన) పరిస్థితిలో ఎట్లు రచన కొనసాగించవలెనో ఛందోశాస్త్రము నిర్ణయింపలేదు.

(2) నన్నయపై గౌరవభావముతో చతుర్థాశ్వాసము 400పద్యములవరకు రచించినచో తనపేరున, ఎక్కడినుండి రచించినది చెప్పుకొనుటకూడ పాఠకునకు రసభంగమగును. కావున నన్నయపేరుననే అరణ్యపర్వరచనము కొనసాగించి ఊర్జితకథోపేతమనిన రసభంగమునకు చోటివ్వదు.

(3) నన్నయపేరున అరణ్యపర్వశేషము తనురచించినపుడు తన రచనమును ఎవరికంకితమివ్వవలెను? నన్నయ రచించిన భాగమున ఆశ్వాసారంభ, ఆశ్వాసారంభ, ఆశ్వాసాంత రాజరాజప్రశస్తి ఉండుటచే, అంకితములేక సంస్కృతకావ్యములవలె భారతమును పూర్తిచేయుట కూడ పాఠకునిదృష్టి పరిపరివిధములభావనకు లోదీయును.

(4) ఆలోచింపగా తిక్కనకు ఒకభావము తట్టియుండును. పరిస్థితులు అనుకూలింపనపుడు, విషయమును విషముగ పరిగణింపమని పెద్దలమతము. నన్నయపేరున రచించిన తన కవిత్వమునకు నన్నయ రచింపని గద్యము నన్నయపేర గద్యము చేర్చి 'అస్థిమాల' అనిపేరుపెట్టవచ్చును. అప్పుడు హరునకు అంకితము చేయుటకు అభ్యంతరము ఉండదు. (తనపేరున గద్యముప్రాసిన ఆశ్వాసము అస్థిమాలఅనుటకు వీలుపడదు.)

(5) నన్నయకావ్యమునే కొనసాగించు నపుడు వాగ్రూపముననే తను రచించునపుడు సరస్వతీదేవిని అరణ్యపర్వశేషముననే ప్రార్థించి దానిని హరునకు అంకితముచేసి విరాటపర్వమునుండి తనపేరున రచించిన భారతభాగమును హరికి అంకితము చేయవచ్చును.

భోగలాలసులైన రాజులకు వేటాడుటయందు వేడుకకాని అరణ్యముననందే 12 సంవత్సరములు ఒకరిమాటకు కట్టుబడి నివాసము చేయుట విషప్రాయముగ నుండును. శక్త్యాత్ములైన పాండవులను దుర్యోధనుడు కపటద్యూతమున రాజ్యపదభ్రంశము చేసి అరణ్యవాసమునకు ద్రౌపదివస్త్రాపహరణమువంటి అవమానముచేసి పంపినను ధర్మభీతి తత్సమయసంక్షుభితులు కాక అరణ్యమున 12 సంవత్సరములు విషమును దిగమ్రింగినట్లు నివసించుటను రచించిన కథ హరునకు అంకితముగ రచించినను శ్రీకృష్ణసారథ్యము వహించిన తర్వాతికథ హరికి అంకితముచేయుట సమంజసము.

(6) ఇట్లు హరికి కొంత అంకితము, హరునకు కొంత అంకితము కంటే రెండును కలిపి హరిహరనాథాంకితము చేసిన బాగుండును.

(7) అప్పుడు అరణ్యపర్వశేషకథరచనము, విరాటపర్వరచనను హరిహరనాథునికి వినునట్లు చెప్పుటలో భేదము ఉండవలెను కదా. ఎట్లు వ్రాయవలెను?

గ్రంథకర్త: గోపీనాథ శ్రీనివాసమూర్తి (గోపీనాథ వేంకటకవి మనుమని మనుమడు)

నన్నయపేరున అరణ్యపర్వశేషము 'అష్టిమాల'గా వ్రాయుచున్నందున హరుడు పాలసముద్రమథనమున పుట్టిన విషమును కంఠములో నిలిపినట్లు 'హరిహరనాథుని' మనస్సున నిలుపుకొని (అంతస్సన్నిధిచేసుకొని) కథనుమాత్రము సంస్కృతకావ్యములో వలె రచించి ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ కృతిభర్తసంబోధన, ప్రశస్తులను రచింపక వదలిపెట్టి, హరిహరనాథప్రశస్తి లేని కథమాత్రము హరిహరనాథునకు యశోదాస్తన్యముగ విన్నవింప వచ్చును. విరాటపర్వమునుండి హరిహరనాథసంబోధన హరి పాలసముద్ర మథనమున పుట్టిన కౌస్తుభమును హృదయబాహ్యమున ధరించినట్లు ఆశ్వాసారంభమునందును, హరిహరనాథప్రశస్తి ఆశ్వాసాంతమునందును రచించి భేదము చూపవచ్చును. ఇట్లు చేయుటవలన 'భారతభారతీ సముద్రము దఱియంగనీఁదను విధాతృనకైనను నేరబోలునే' అని భారతావతారికయందు చెప్పవచ్చును.

8) విరాటపర్వమున అవతారిక రచించి కృతిభర్తకు అంకితమిచ్చునట్లు షష్ఠ్యంతములు విరాటపర్వమున కౌస్తుభముగా రచింపవచ్చును. అరణ్యపర్వశేషమును కూడ ప్రారంభించినచోట షష్ఠీవిభక్తిప్రత్యయములను మాత్రమే వాడవచ్చును. విరాటపర్వమున అవతారిక రచించినందున స్వర్గారోహణపర్వము వరకు రచించి, అరణ్యపర్వశేషకథరచించినచో నన్నయ ఆదిపర్వ ప్రారంభరచనకంటే అరణ్యపర్వకథ రసవంతముగా ఉన్నట్లు ఉండును. తన 15 పర్వముల రచనచే రచన ఫలవంతమై, నన్నయవలె సంస్కృతపదరచన అక్కడక్కడచేసి అంత్యమున అనగా స్వర్గారోహణపర్వమధ్యలో హరిహరనాథసంబోధన 'శ్రీ' పద ప్రారంభముతో రచించి అరణ్యపర్వ చతుర్థాశ్వాస కథతో నన్నయ రచనను కొనసాగించినచో రచన నన్నయరచనకు దీటగునట్లు రచింపవచ్చును. పంచమ, షష్ఠమ, సప్తమ ఆశ్వాసములకు నిర్దేశించిన హరిహరనాథసంబోధనాపద్యములను విరాటపర్వమున 'అంతస్సన్నిధి' కలిగించుకొని ఆస్వాదింపమని మొదటిపద్యమును 'శ్రీ' లేక ప్రారంభించి 'హరిహరనాథా' సంబోధనమూడవ పద్యమున మాత్రము రచించి వరుసగా మూడుపద్యములు రచించినచో, దేవదేవి స్తన్యము(అదేఆశ్వాసకథ)కాక యశోదాదేవి స్తన్యమును(మరొక ఆశ్వాసకథను) ఆస్వాదించిన హరి పోలికకు వచ్చును.

పై విధముగ ఆలోచించి పై భావములను పాఠకుల మనస్సున ముద్రించులాగున నఅవతారికయందు యిట్లుప్రతిధ్వనించియున్నాడు. తాను ఎక్కడనుండి ప్రారంభించినది,

నన్నయ ఎంతవరకు రచించినది, తిక్కన ఈక్రిందిపద్యములలో చెప్పుకొనినట్లు భారతసంశోధితప్రతిలోని పాఠాంతరములతో యిట్లు చూడగలము.

6.ఉ॥ [1]ఆదరణీయసార [2]వివిధార్థ [3]గతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ [4]సంభృతమై పెనుపొందియుండ నం
దాది దొడంగి మూడు [5]కృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్

7.మ॥ హృదయాహ్లాది చతుర్థ మూర్జిత[1]కథోపేతంబు నానారసా
భ్యుద[2]యోల్లాసి విరాటపర్వ[3]మట యుద్యో[4]గాదులుం గూడగా
బదియేనింటఁ దెనుంగుబాస జన[5]సంప్రార్థ్యంబులై పెంపునం
దుది[6]ముట్టన్ రచియించుటొప్పు బుధసంతోషంబు నిండారగన్

పైపద్యములోని ప్రాణవంతమైనపదములను లేఖకులు మార్చుట దురదృష్టకరము. కవిపాఠములతో పద్య మీక్రిందిరీతిని యుండవచ్చునని పై పాఠాంతరములనుండి గ్రహింపవచ్చును.

ఉ॥ ఆదరణీయసారవిదితార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ సంవృతమై పెనుపొందియుండ నం
దాది దొడంగి మూఁడుకృతు లంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్

మ॥ హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాస విరాటపర్వ మది యుద్యోగాదులం గూడగా
బదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టన్ రచియించుటొప్పు బుధసంతోషంబు నిండారగన్

---

6. 1. భారతము హరివంశము లేకుండ లక్షగ్రంథమనియు, హరివంశముతో సపాదలక్ష గ్రంథమనియు భా.కూ. వివరణము 2.కవితార్థ-వ; విదితార్థ-వ 3.గతస్ఫురణంబు-వ 4.సంవృతమై-డ, సంభవమై-వ 5.కృతులంధ్రకవిత్వ-ఊ,ఎ,దల.

7. 1.కథాప్రీతంబు-వ 2.యోల్లాస-ఓ,ల 3.మదియుద్యో-అ,ఈ,ఊ 4.గాదులం-ల,వ,పెక్కుప్రతులు 5.సంప్రార్థ్యంబునన్-ప; సంప్రార్థ్యంబులై(బునై)- అని పాఠములు 6.ముట్టంగ రచించుటొప్పు జనసంతోషంబు-స 7.నిండారుటన్-ల కొన్ని ప్రతులు.

ఆదరణీయమైన సారభూతమైన విదితమైన అర్థగతి స్ఫురణము కలదని. అష్టాదశపర్వనిర్వహణ కప్ప(చుట్టుకొన)బడినట్లు పెంపొందింపబడినదని, ఆదినుండి (విరాటపర్వమునకు పూర్వపర్వమైన అరణ్యపర్వమున) మూడు కృతులు (ఆశ్వాసములు) నన్నయ దక్షతతో రచించినాడని పైపద్యమున ఆద్యంతములు చెప్పబడినవి. ఆనన్నయ తెలుగు కవిత్వ విశారదుడని, వాగనుశాసనుడు (బ్రహ్మ) అని గొప్ప ఆత్మవంతుడని విశేషణములు పైపద్యమున కలవు.

రెండవపద్యమున (నిలిచిపోయిన నన్నయరచన వృద్ధిపొందినట్లు ప్రారంభించుటచే) హృదయాహ్లాదమైన నాలుగవది (నాలుగవఆశ్వాసము) వృద్ధిపొందినకథ (నన్నయ రచింపక, తిక్కన నన్నయపేర వృద్ధిగా రచించినకథ)కలిగినదని, అనేకరసములయొక్క, అభ్యుదయముతో విలసిల్లినది విరాటపర్వమని, దానికి ఉద్యోగపర్వము మొదలగు తర్వాతపర్వములు కూడగా పదునైదుపర్వములు జనులచే ప్రార్థింపబడినవై పూర్తిభారతము పూర్తియగునట్లు తెలుగుభాషలో పండితులు సంపూర్ణానందము పొందునట్లు రచియింపనొప్పు ననెను.

కప్పబడి(చుట్టుకొని)నట్లు పెంపొందింపబడుట అనగా ప్రారంభించిన చోటు చేరునట్లు పూర్తి రచించుట. విరాటపర్వమున ప్రారంభమైన రచన, 15పర్వములు పూర్తిచేసి స్వర్గారోహణ పర్వరచన తర్వాత అరణ్యపర్వచతుర్థాశ్వాసమున నన్నయరచనాంతము(ఆది దొడంగి మూడుకృతుల తర్వాత)ను చేరి భారతావతారిక పూరించి విరాటపర్వమును చేరుట.

విదితమైన అర్థగతి స్ఫురణము కలిగినదని తిక్కన పైపద్యమున చెప్పి, హరిహరనాథునితో నన్నయ ప్రీతికరముగా రచించిన ఆటవెలది పద్యమున, అర్థయుక్తి పద్యములను రచించుటలేదు అనెను. చూడుడు.

ఆ॥ కథ జగత్ప్రసిద్ధిగావునఁ బూర్వప,ర్వార్థయుక్తి చేయునట్టి యెడల
యత్నమించుకంత యయినను వలవదు, వలసినట్లు చెప్పవచ్చియుండు

అర్థయుక్తిలేకుండ చతుర్థాశ్వాసకథ, పంచమాశ్వాసకథతో జగత్ప్రసిద్ధముగా కలిసిపోవునని మనము ముందు చూచియున్నాము. దీనినే తిక్కన చతుర్థమూర్జిత కథోపేతమని చెప్పెను.

ఇక్కడ 'నాలుగవ' శబ్దమునకు నాలుగవపర్వమా? నాలుగవ ఆశ్వాసమా? అనుప్రశ్నముదయించును. మూడు ఆశ్వాసములు నన్నయ రచించి నాలుగవ ఆశ్వాసము

నన్నయ ప్రారంభించి రచించియుండుటచే, వృద్ధిపొందిన నాలుగవఆశ్వాసమునుండే తిక్కనరచన. అట్లు రచించుట సాహిత్యపిపాసకులకు హృదయాహ్లాదము కలిగించుననుటలో సందేహములేదు కదా. నాలుగవపర్వము పూర్తిగా రచించినట్లు పద్యమున చెప్పబడియున్నది. అది వృద్ధిపొందిన నాలుగవది కాదు. ప్రారంభింపబడిన నాలుగవది. 'కృతి'కి పర్వభావము స్వీకరించినచో, అది దొడంగి మూడు పర్వములు నన్నయ రచించినట్లగును. కాని విరాటపర్వము వృద్ధిపొందినదికాదు. తిక్కన ప్రారంభ రచన-రెండు శతాబ్దములు తెలుగుజాతిని సాహిత్యాంధకారముతో నిలిచిపోయిన నన్నయ కవిత్వము వలన ముంచిన చతుర్థాశ్వాసము మరువరానిది. దాని హృదయాహ్లాద కొనసాగింపే చరిత్ర స్మృతి. ఊర్జితకథోపేతము అనుపదము ఈవిధముగా 'కిమస్థిమాలాం' శ్లోకమున్న వచనమునందు చెప్పబడిన గూఢార్థమును వివరించునదిగా కనబడుచున్నది.

'ఊర్జిత' పదమును ఈ(వృద్ధిపొందిన) భావముతో నన్నయ, తిక్కనలు ప్రయోగించియున్నారు. చూడుడు.

ఉ॥ ఈసున నీశుఁదొట్టి సురలెల్ల నభీష్టవరంబు లిచ్చుటం
జేసి కృతార్థుడైన కురుసింహము నూర్జితశౌర్యు నర్జునున్
భాసురతేజు విశ్వపరిపాలకుడైన మహేంద్రుతోడ నే
కాసన మెక్కియున్న మహిమాస్పదు నింద్రసమాను జూచితిన్. (3-2-293)

క॥ ఊర్జితశాత్రవసేనా, దుర్జయుఁడగు నర్జునుండు దోర్బలలీలా
స్ఫూర్జితుడై యొక్కదెసన్, గర్జారౌద్రముగఁదోలెఁ గౌరవబలమున్ (6-2-115)

సీ॥ దానమూర్జితఫలదం బర్థసాధ్యమై పరఁగు గరము దుష్కరము నదియు,
నది ప్రాణంబుకంటెను రూపింప నర్థంపు తీపువినమె...... (3-6-111)

ఇట్లు అరణ్యపర్వశేషమును రచించినట్లు చెప్పకొని తిక్కన విరాటపర్వమున షష్ఠ్యంతములను కౌస్తుభము మొట్టమొదటిసారిగ తెలుగుకావ్యరచనలో ప్రవేశపెట్టెను. చతుర్థాశ్వాసమున నన్నయ రచనను కొనసాగించుటకు 'తత్సమయానంతరంబున' అను ఒక వచనమును నన్నయ, తిక్కన కవితలను వేర్పరచుటకు వ్రాసి 'భూసతికిం, పెంబునకు' అని, నిర్వచనోత్తరరామాయణమున 'అరిజయవేశ్యాభుజంగుడైన మనుమజన విభునకు, క॥ అమ్మనునృపతి కభ్యుదయమ్మగ నే చెప్పబూనినట్టి కథకు నా; ద్యమ్మయి యయోధ్యయను నా,మమ్మున నెగడిన పురోత్తమము వర్ణింతున్' (1-44,45) నందు ప్రయోగించిన షష్ఠీవిభక్తి ప్రత్యయముతో ప్రారంభించెను.

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

షష్ఠ్యంతరచన తర్వాత కావ్య(ప్రబంధ)రచన ప్రారంభించుట పరిపాటి. కనుక ఇది విరాటపర్వరచన ప్రారంభించి స్వర్గారోహణ పర్వరచన వరకు పూర్తి రచించిన సంకేతము.

ఇట్లు రచించిన తర్వాత విరాటపర్వ అవతారికలో తిక్కన 'కథాప్రారంభము' అని విభాగము చేసినాడు. కాని కథను అందు ప్రారంభింపలేదు. కాని వచనమున ఏను (నానారసాభ్యుదయోల్లాస విరాట పర్వమది యుద్యోగాదులం గూడగా బదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై అని) విన్నపంబు సేయు తెఱంగుగా అంతస్సన్నిధి కలిగించుకొని - అంతరంగమందు హరిహరనాథుని భావించుకొని - (హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు పెంపునం - హృదయాహ్లాదమైన నాలుగవది వృద్ధిపొందిన కథ కలిగినదానిని పెంపుగా - యమ్మహాకావ్యంబు - (అనర్థముగా నిలిచిపోయిన) నన్నయభట్టు రచించిన ఆమహాకావ్యమును - అర్థంబు సంగతంబు - అర్థము చేరికగా అనగా అర్థవంతముగా- సేసెద (తుదిముట్టన్ రచియించుటొప్పు బుధ సంతోషంబు నిండారగన్)

నిండారగన్ అని 'నిండు' పదమునకు 'ఆరు' శబ్దము చేర్చుట చేత, అమ్మహాకావ్యమును చేరిక చేసెదననుట చేత, తిక్కన అరణ్యపర్వశేషముగల భారతమును సంపూర్ణముగ రచించినట్లు స్ఫురింపచేయును. అరణ్యపర్వమును వదలిన బుధజనులు సంతోషింతురా?

పై వచనము తర్వాత తిక్కన ఈక్రింది మూడు హరిహరనాథ సంబోధనా పద్యములను అరణ్యపర్వ పంచమ, షష్ఠమ, సప్తమాశ్వాసములు రచించిన సంకేతముగా రచించెను. ఈ మూడు 'శ్రీ' పదముతో ప్రారంభము కాలేదు. కారణము చతుర్థాశ్వాస మధ్యలో ప్రారంభించినపుడు, ఈఆశ్వాసము ప్రారంభాలు మధ్యలో వచ్చియుండుట, మూకుమ్మడిగానున్న మూడవపద్యమున మాత్రమే సంబోధన ఆశ్వాసములను సూచించుట.

కll శరణాగత సంశ్రితభయ, హరణ సురనిఖర శేఖరానర్ఘమణి
స్ఫురణాపరిచిత రంజిత, చరణా వనమాలికా భుజంగాభరణా 38

కll అజగవశార్ఙాలంకృత, భుజగర్వనిరస్త దైత్యభూమస్తుత్యా
త్రిజగద్ధారణ నిత్యా, భుజగ సమాచరితశయన భూషణకృత్యా 39

క॥ జలనిధి హిమవద్భూధర, కలిత జనన కేళీ కౌతుక వ్యక్తావ్య
క్త లలిత సౌందర్య స్ఫుర, దలఘుతను స్త్రీసనాథ హరిహరనాథా 40

చతుర్థాశ్వాసమధ్యలో యిట్టి పద్యము రచించుటకు వీలులేనందున స్వర్గారోహణ పర్వమందు మధ్యలో పర్వకథ ముగియగనే (18-1-76)

క॥ శ్రీనిత్యత్వ ప్రమదా,ధానకుతూహల నిరూఢతాస్త వ్యాపాం
గా నిర్భర వేదవ్యా,సానేకవచోనుషంగ హరిహరనాథా

పై పద్యమును రచించి చతుర్థాశ్వాస నన్నయ రచనను ముట్టి అరణ్యపర్వ శేషకథ ప్రారంభించి ముగించెను. తర్వాత 5,6,7 ఆశ్వాసములకు నిర్దేశించిన పైమూడు 'హరిహరనాథా' సంబోధనపద్యములు శ్రీపదముతో ప్రారంభము కాకుండుట అవి యశోదాస్తన్యముగా అరణ్యపర్వమధ్య ఆశ్వాసముల రచన సూచనను విరాటపర్వమున కౌస్తుభముగా వ్రాయబడిన సంకేతముగా గ్రహింపవచ్చును.

ఇట్లు వ్రాసినతర్వాత,తిక్కన 'దేవాదివ్యచిత్తంబున నవధరింపుము' (4-1-40) రచించి అరణ్యపర్వశేషకథ మాత్రమే రచించితిని, హరిహరనాథ సంబోధన, ప్రశస్తులను వదలివేసినట్లు హరిహరనాథునకు విన్నవించుకొనెనేకాని పాఠకులకు కాదు. అవధరించునది కృతిభర్త. అది దివ్యదృష్టివలె దివ్యచిత్తమున. కనుక అది సాధారణముగ చిత్తమునకు గోచరము కాదని భావము. అరణ్యపర్వమధ్యమున కుద్దేశించి, పాఠకులకుకూడ అనునది గూఢగ్రాహ్యము. కేవల పాఠకులకే యైనచో 'కావున భారతామృతము' (4-1-30) పద్యమునకు పూర్వము చెప్పియుండెడివాడు.

ఇక అరణ్యపర్వ సప్తమాశ్వాసాంత కడపటి వచనము, అరణ్యపర్వ ఆశ్వాసాంత కడపటి వచనములతో పరిశీలింతము.

ప్రథమాశ్వాసము - వైశంపాయనకథితంబైన పుణ్యకథ యతిరమణీయంబుగాను
ద్వితీయాశ్వాసము - వైశంపాయన కథితంబైన కథాక్రమం బతిరమ్యంబుగాను
తృతీయాశ్వాసము - వైశంపాయన కథితంబైన కథ రమ్యంబుగా
చతుర్థాశ్వాసము - వైశంపాయనుండు జనమేజయునకెఱింగించిన తెఱంగుగా
పంచమాశ్వాసము - వైశంపాయనవర్ణితంబయిన కథావిశేషంబు సవిస్తరంబుగా
షష్ఠమాశ్వాసము - వైశంపాయనోక్తంబైన యాఖ్యానంబు విఖ్యాతమాధుర్య మనోహరంబుగా నుపన్యసించి

సప్తమాశ్వాసము - పాండుతనయుల వనవాసప్రకారంబు సవిస్తరమధురంబుగా నుపన్యసించి

పై వచనములను పరిశీలించిన చతుర్థాశ్వాసమునుండి నన్నయ రచన కాదని తెలియును. పంచమ, సప్తమాశ్వాసములందు 'సవిస్తర' అని ప్రయోగించి విరాటపర్వ ప్రారంభ వచనమున(4-1-43) 'సవిస్తరంబుగా విని' అని ప్రయోగించియుండుటచే తిక్కనరచనయై యుండునని విరాటపర్వకథాప్రారంభవచనమునుండి భావింపవచ్చును. ఈసందర్భమున ఎఱ్ఱన, తిక్కనలు పైవిధమైన వచనము తమ భాగములలో ప్రతిఆశ్వాసాంతమున రచింపలేదని గ్రహింపగలము. ఎఱ్ఱన 'తద్రచనయకా' రచించితి ననెనేకాని నన్నయపేర రచించితి ననలేదు. చతుర్థాశ్వాసమునుండి మార్పుండుట ఎఱ్ఱన రచన కాదని, తిక్కన 'అస్థిమాల' అనుట వలన నన్నయ రచనవలెనే యుండవలెనను నియమము లేదని గ్రహింపగలము. గద్యము నన్నయ పేర రచించినపుడు ఆశ్వాసము 'అస్థిమాల'యగును. అందుకొన్ని విషయములు నన్నయను స్మరణకు తెచ్చిన చాలునని గ్రహింపగలము. మిగత ఆశ్వాసములలో వచనముతో ముగించినను, ప్రతిపర్వాంతమునందును పర్వనామమును పేర్కొనుచు రచించుట నన్నయరచనలో కలదు. ఆకడపటి పద్యమును, దానిరచనలోని భేదమును పరిశీలింతము. ఆపద్యములివి.

క॥ జనమేజయజనపాలున, కనఘ చరితునకుఁ బ్రీతుండయి వైశంపా
యను డాదిపర్వకథ యెల్లను నిమ్మగ జెప్పెనని విలాసమహేంద్రా

క॥ అని యిట్లు సభాపర్వం,బున కథ జనమేజయునకు మొగి వైశంపా
యను జెప్పిన విధమంతయు, మనునిభశుభచరిత నిత్యమహిమాతిశయా

క॥ అనఘుడు గృష్ణద్వైపాయనశిష్యుఁడు బోధనిధి సమంచితమేధా
ఘనునకుఁ జనమేజయునకు, ననవరతానంద సుఖసమగ్రత యొసగెన్.

పై పద్యములలో నన్నయ మరణ చిహ్నముగ అనగా అస్థిమాల చిహ్నముగ 'అరణ్యపర్వము' పేరు లేకుండుట గమనార్హము. అంతేకాక పైపద్యమున 'అరణ్యపర్వము' పేర్కొనక పోవుటవలన నన్నయరచనకాదని ఎఱ్ఱన 'తద్రచనయకా' గా భారతకావ్యశయ్య రచింపలేదని తెలియగలదు. విరాటపర్వమునుండి స్వర్గారోహణ పర్వకథ, అరణ్యపర్వ శేషకథ వినిన జనమేజయునకు విరామము లేకుండ (ఆశ్వాసాంత ఆశ్వాసారంభ పద్యములు లేకుండ) ఆనంద సుఖ సమగ్రత యివ్వబడినది. ఈ

పద్యమునకు, విరాటపర్వ ప్రథమ వచనమునకు, అరణ్యపర్వ కడపటి వచనమునకు, విరాటపర్వ ప్రథమవచనమునకు, అరణ్యపర్వ కడపటిశ్లోక అనువాదమునకు విరాటపర్వ ప్రథమ శ్లోకమునకు అమూలకమైన పద్య భావమునకు గల భావ సమైక్యత ముందు చూచి యున్నాము. ఈ విషయములన్నియు తిక్కననే అరణ్యపర్వ శేషరచన చేసెనని నిరూపించును.

- ఇక తిక్కన కవితా విశేషములు, అరణ్యపర్వశేషమున అస్థిమాలలో నన్నయ స్మరణ ఉండునట్లు ఎట్లు రచించినది పరిశీలింతము. తిక్కన తను నిర్మలము, ఉదాత్తమైన మనీషుడనని, ఉభయకావ్యప్రౌఢి పాటించుశిల్పమున నేర్పరినని తెలుపుకొనెను. ఇచ్చట ఉభయకావ్యమనగా అరణ్యపర్వశేషరచన రచించునపుడు నన్నయరచన కనుగుణముగ నుండుటకు పాటింపవలసిన శిల్పము తెలిసినవాడనని చెప్పెను. నిర్వచనముగ వ్రాయగలనని ఉత్తర రామాయణమును నిర్వచనముగ రచించెను. కొన్ని నియమములు కూడ పెట్టుకొని నిర్వచనోత్తర రామాయణమును రచించెను.

ఎఱ్ఱన తను కళావిదుడననికాని, ఉభయకావ్య శిల్ప నిపుణుడననికాని, కొన్ని నియమములు స్వయముగ చేసుకొని రచింపగలవాడననికాని చెప్పుకొనలేదు.

నన్నయ వనపర్వ 182వ అధ్యాయమును తెలిగించుచు పరమపదించెను. కనుక అందు వర్ణితమైన వర్షశరదృతుశ్లోకరచన, పద్యరచన సరిపోల్చెదము.

నిదాఘాంతకరః కాలః సర్వభూత సుఖావహః
తత్రైవ వసతాం తేషాం ప్రావృట్ సమభిపద్యత (వన 182-1)

(పాండవులు అక్కడనే వసించుచుండగా వేసవికాలము సమాప్తమై సర్వభూత సుఖావహమగు వర్షాకాలము ప్రవేశించెను)

ఛాదయంతో మహాఘోషాః ఖం దిశశ్చ వలాహకాః
ప్రవవర్షు దివారాత్రం అసితా స్సతతం తథా (వన 182-2)

(అప్పు డాకాశమును, అన్ని దిక్కులను మేఘము లావరించి రాత్రి పగలంతయు చిమ్మచీకటి చేసి మహాఘోష చేయుచు పెద్దవర్షము కురియుచుండెను)

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

తపాత్యయనికేతా శ్శతశోథ సహస్రశః
ఆపేతార్క ప్రభాజాలాః సవిద్యుద్విమల ప్రభాః (వన 182-3)

(వర్షాకాలంలో వందలకొలది, వేలకొలది ఇళ్ళు సూర్యకాంతి విహీనమైనను మెరుపుల తెల్లని కాంతులతో కూడి ఉన్నవి)

విరూఢ శష్పా ధరణీ మత్తదంశ సరీసృపా
బభూవ పయసా సిక్తా శాంతా సర్వమనోరమా (వన 182-4)

(బాగుగ మొలచిన లేతగడ్డితోను, మత్తెక్కి ఉన్న అడవిదోమలతోను కూడిన భూమి, వర్షపునీటికి తడిసి ప్రశాంతముగా మనోహరముగా ఉండెను)

నస్మ ప్రజ్ఞాయతే కించి దమ్భసా సమవస్తృతే
సమం వా విషమం వాపి నద్యోవా స్థావరాణి చ (వన 182-5)

(కొంచెము కూడ జనులు తెలుసుకొనలేక పోవుచున్నారు. ఎత్తు, పల్లములు, కొండ, నదులు మొదలగు భేదములు తెలుసుకొనుటకు వీలులేకుండ భూమి అంతయు వర్షపునీటితో నిండెను)

క్షుబ్ధతోయా మహావేగాః శ్వసమానా ఇవాశుగాః
సింధవః శోభయాం చక్రుః కాననాని తపాత్యయే (వన 182-6)

(వర్షాకాలములో బుసకొట్టుచున్న బాణములా (సర్పములా) అన్నట్లు శీఘ్రముగ ప్రవహించుచున్న కలత చెందిన నీరు, కలిగిన నదులు అడవులను అలంకరించినవి)

నదతాం కాననాన్తేషు శ్రూయన్తే వివిధాః స్వనాః
వృష్టిభిశ్చా ద్యమానానాం వరాహమృగ పక్షిణామ్ (వన 182-7)

(వరాహములు, మృగములు, పక్షులు ఈవర్షమునకు బాగా తడిసిపోయి, వివిధములైన అరపులను చేయగా అరణ్యములు ప్రతిధ్వనించుచున్నట్లు ఉండెను)

స్తోకాకాః శిఖ నశ్చైవ పుంస్కోకిల గణైః సహ
మత్తాః పరిపతన్తి స్మ దుర్దురాశ్చైవ దర్పితాః (వన 182-8)

(చాతక పక్షులు, నెమళ్ళు, మగ కోకిలల సమూహములు, కప్పలు, సంతోషముతో మత్తెక్కినట్లు పరిగెత్తుచున్నవి)

తథా బహువిధాకారా ప్రావృణ్మేఘాను నాదితా
అభ్యతీతా శివాతేషాం చరతాం మరుధన్వసు (వన 182-9)

(వారు (పాండవులు) ఎడారి ప్రదేశములలో సంచరించుచుండగా, మేఘధ్వనులతో నింపబడిన మంగళకరమైన అనేక విధములైన ఆకారములుగల వర్షఋతువు గడిచినది)

క్రౌంచ హంస సమాకీర్ణా శరత్ప్రముదితా భవత్
రూఢకక్ష వనప్రస్థా ప్రసన్నజల నిమ్నగాః (వన 182-10)

(నదిలోని జలము తేరి ప్రసన్నముగ ప్రవహించుచుండ తీరమున క్రౌంచ, హంస పక్షులు చరించుచుండగా డొంకలు, వనములు, కొండల చరియలు గడ్డిమొలచి శరదృతువు ఆవిర్భవించినది)

విమలాకాశ నక్షత్రా శరత్ తేషాం శివాభవత్
భృగద్విజ సమాకీర్ణా పాండవానాం మహాత్మనామ్ (వన 182-11)

(విమలమైన ఆకాశము, బాగుగా ప్రకాశించు నక్షత్రములు, మృగములు, పక్షులతో కూడిన శరత్కాలము మహాత్ములైన పాండవులకు శుభము చేకూర్చినది)

దృశ్యంతే శాంత రజసః క్షపాః జలదశీతలాః
గ్రహ నక్షత్ర సంఘైశ్చ సోమేన చ విరాజితాః (వన 182-12)

(పరాగములు అణగిపోగా, మేఘముల చేత చల్లగా ఉన్న రాత్రులు, గ్రహములు, నక్షత్రములు చంద్రునితోను ప్రకాశించుచున్నవి)

కుముదైః పుండరీకైశ్చ శీతవారిధరాః శివాః
నదీః పుష్కరిణీశ్చైవ దదృశుః సమలంకృతాః (వన 182-13)

((ఆ పాండవులు) కలువలచేతను, పద్మములచేతను అలంకరింపబడిన చల్లని జలములతో నిండిన మంగళప్రదములైన నదులను పద్మ సరస్సులను చూచిరి)

ఆకాశ నీకాశతటాం తీరవానీర సంకులామ్
బభూవ చరతాం హర్షః పుణ్యతీర్థై సరస్వతీమ్ (వన 182-14)

(పుణ్యజలములు గల సరస్వతీ నది తటములు ఆకాశమువలె (నీల వర్ణముతో) ఉండెను. ఆ నదీతీరముల మీద ఉన్న నీటి ప్రబ్బలి చెట్లతో వ్యాకులముగా ఉండెను. అట్టి ఆనది సమీపమున సంచరించుచున్న ఆపాండవులకు సంతోషము కలిగెను)

తే. వై ముముదిరే వీరాః ప్రసన్నసలిలాం శివామ్
పశ్యంతో దృఢధన్వానః పరిపూర్ణాం సరస్వతీమ్ (వన 182-15)

(దృఢములైన ధనస్సులుగల ఆపాండవులు, ప్రసన్నమైన నీటితోనున్న మంగళప్రదమైన సరస్వతీనదిని చూచి సంతోషించిరి)

తేషాం పుణ్యతమా రాత్రిః పర్వసంధౌ స్మ శారదీ
తత్రైవ వసతా మాసీత్ కార్తికీ జనమేజయ (వన 182-16)

(జనమేజయా! వారు అక్కడ నివసించుచుంగా కార్తీకమాసమునందు పర్వసంధియందు అతిపుణ్యమైన రాత్రి వచ్చెను)

ఈ అధ్యాయమును నన్నయ మరణమునకు ముందు ఇట్లు రచించి యుండిరి.

కII ఖర కిరణతాపమున నురు,తర దవదాహమున శోషితములైన వనాం
తర తరుతతి కాప్యాయన, కరమై వర్షాగమంబు గడు బెడఁగయ్యెన్ 133

కII నాలుగు కెలఁకుల నవఘన, జాలంబులు వ్రేలి కురిసె ఝుంఝూనిలవే
గాలోలములై బహుల, స్థూలపయోధార లోలిఁ దుములంబులుగాన్ 134

కII ఘనతర నైశతమం బొకొ, యనఁగ ఘనాఘన తమిస్ర మవిరళమై క
ప్పిన జనులకు వస్తువిభా, వన మొక్కొక మాటు గలిగె వైద్యుతరుచులన్135

చII అరుదగు తత్పయోదసమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ బల్వలభూముల భూరిదర్దురో
త్కరరవముల్ మహీరుహశిఖాంతములందు శిఖండితాండవాం
తరమదమంజులస్వనము దారాతరంబగుచున్ వనంబునన్ 136

చII దళిత నవీన కందళకదంబ కదంబక కేతకీ రజో
మిళిత సుగంధ బంధుర సమీరణు డన్సఖు డూచుచుండఁగా
నులియుచు పువ్వుగుత్తులను నుయ్యెలలొప్పగ నెక్కి యూఁగె ను
ల్లల దళినీ కులంబు మృదులధ్వని గీతము విస్తరించుచున్ 137

కII సుర చాపచిత్ర గగన, స్ఫురణం బురణించునట్లు భూవనిత నిరం
తర చిత్రితయై యొప్పెను, సురుచిర నవతృణ శిలీంద్రసుర గోపములన్

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

★'భూనతికిం' పద్యమునుండి తిక్కనరచన★

పై పద్యములతో వర్షఋుతు వర్ణనము ముగిసినది. ఇక తిక్కన శరదృత వర్ణన చేయవలసియున్నది. నన్నయ రచించిన అరణ్యపర్వ భాగములో నలచక్రవ కథ నన్నయ రచించియున్నాడు. అందు యిట్లు రచియించి యున్నాడు.(3-2-11,12,13

"ఒక్కనాడు నలుడు దమయంతీ గుణబద్ధచేతస్కుండై మదనానలంబు సహింపనోపక ప్రమదవనంబున గ్రుమ్మరువాఁ డంతరిక్ష (శ్రీ) కాంతా హారావళియుంబోలె హంసావళి యవనీతలంబున కవతరించిన

ఆ॥ వీరసేనసుతుఁడు వీరుండు హంసల, నడబెడంగు జూచి నగుచు వాని నెగచి యొగచి యందు నెగయకుండఁగ నొక్క, హంస బట్టుకొనియె నతి రయమున

ఆ॥ దాని విడిచి పోవఁగా నోప కఱచుచు, నంతరిక్షమునను హంసలెల్లఁ బిండుగట్టి తిరుగుచుండె వాతోద్ధూత, శారదాభ్ర శకలచయముబోలె

పై పద్యములలో హంసలు తిరుగుచున్న విధమును 'శారదాభ్రశకలచయము 'బోలె' అని ఉదహరించిన రీతిగా శరత్కాలవర్ణరచన నన్నయ చేసెనా యనునట్లు 'శరత్సమాగమము శారదరాత్రులు, శారదవేళ, శరద్భయంబున, శారదాంబుద పరివేష్టనమున, అట్టి శారదాగమనంబున' అని శారద పదమును 'శారదాభ్రశకలములా' అనునట్లు ప్రయోగించి ధ్వనించెను. ఇంతేకాక సప్తపర్ణావళి, ప్రకటక్రీడా కళాగర్వ గర్జిత' 'అతిగంభీరవిభూతి' వంటి మూలమున లేని పదములను ప్రయోగించి అరణ్యపర్వమును ఏడు అశ్వాసములు (సప్త అశ్వాసములుగ) విభజించి తన కళావిశిష్టతను ధ్వనించి, అమలోదాత్త కళావిదుడు తన రచనాముద్ర వేసినాడు. ఇట్లు ప్రతిపద్యమునందును విశేషము ధ్వనించినందున ఓం ప్రథమమైన 'భూ నతికిం' పద్యమునందు షష్ఠీ విభక్తి ప్రయోగమే కాక మరి ఏమైన విషయమును ధ్వనించెనా? అని ఆలోచింపవలసిన అవసరము కలదు. కారణము కవి తన మొదటిపద్యమున దైవప్రార్థనమే కాక, కథను సూచించు సంప్రదాయము కూడ కలదు కదా.

రాజరాజు నన్నయను రాజసభకు పిలిపించి గౌరవించి శ్రీమహాభారతము తమ పూర్వుల చరిత్ర, దానిని చదివినంతనే తన దేహము పులకలతో ఉప్పొంగును. కనుక దానిని తెలుగుచేయమని భారతావతారికన తిక్కన చెప్పుటచేతను, నన్నయ భారతఅశ్వాసారంభ, అశ్వాసాంతములందు రాజరాజ ప్రశస్తి చేర్చుట చేతను, నన్నయ

భారతమునకు రాజరాజు కృతిభర్త. నన్నయ కృతికర్త. కవికృతమైన భారతకథ కృతికన్య. కృతిభర్తచే (భూభర్తచే) పోషించబడిన శ్రీమహాభారత కథను 'భూసతి'గా తలంపవచ్చును. ఇట్లు కృతి భర్తచే క్రొత్తబంధము కలిగిన నన్నయకృత భారతమే 'భూసతి'.

ఈ సందర్భముగా 'భూసతికిం దివంబునకు' అను మొదటి పద్యమునందు 'దివంబునకు' అను పదభావము అరణ్యపర్వమున నన్నయరచననుండి విరాట పర్వ కథారంభము వరకు గల, శూన్యాకాశమని 'అకాశం గగనం శూన్య 'మను ప్రశస్త నానుడి నుండి గ్రహింపవచ్చునని క్రింది విషయములనుండి గ్రహింపవచ్చును.

ఉత్తరుడు బృహన్నలను సారథిగా చేసికొని శమీవృక్షము వైపు వెళ్ళుచుండగా దూరమున కనవచ్చు చతురంగ బలసమేత కురుసైన్యగతిచే లేచిన దూళిని వ్యాసమహర్షి విరాటపర్వమున క్రింది శ్లోకములలో వర్ణించినాడు.

శ్లో॥ సర్పమాణ మివాకాశే వనం బహుల పాదపమ్
దదృశే పార్థివో రేణుం జనితస్తేన సర్పతా
దృష్టి ప్రణాశో భూతానాం దివస్పృక్ కురుసత్తమ
తదానీకం మహత్ దృష్ట్వా (విరాట 38-6,7)

భావము: ఈవిధముగా సాగరమువలెనున్న సైన్యము ముందుకు వచ్చుచుండగా ఎగిరిన సైన్యపుధూళి ఆకాశము నంటుచూ అనేకవృక్షములుగల వనము దివివైపు ఆక్రమించుటకు వెళ్ళుచున్నదా అనునట్లు ప్రాణిలోకపు చూపులను క్రమ్మినది.

అట్లే ఘోషయాత్రకై ద్వైతవనమునకు వచ్చి దుర్యోధనుడు చూచిన గోవులమంద వర్ణనము వ్యాసమహర్షి ఇట్లు చేసెను.

దదర్శ శతధాగావః శతశోథ సహస్రశః
అంకైః లక్షైశ్చ తాః సర్వాః లక్షయా మాస పార్థివః
బాలవత్సాశ్చ యాగావః కాలయా మాసతా అపి
అథస స్మరణం కృత్వా లక్షయిత్వా త్రిహాయనాన్
వృతో గోపాలకైః ప్రీతో వ్యాహరత్ కురునందన (వనపర్వము 240-4 నుండి6)

భావము: దుర్యోధనుడు అనేక వ్యూహములుగా నుండు అవులను వందలకొలది వేల కొలది చూచి గుర్తులచేత, ఆనవాళ్లచేత వాటి నన్నింటిని గుర్తించెను. లేగదూడలను కూడ గుర్తించెను. దగ్గర వచ్చిన వానిని తెలుసుకొనెను. లేగదూడలున్న అవులను

కూడ చూచెను. పిమ్మట జ్ఞప్తికి తెచ్చుకొని మూడు సంవత్సరముల వయస్సు కలవాటిని గుర్తించి గోపాలకులతో కూడినవాడై సంతోషముతో ఇట్లు పలికెను.

విరాట పర్వమునందలి పై శ్లోకమునందు సైన్యపు ధూళి దివిని ఆక్రమించుటకు వెళ్ళుచున్నదా అనునట్లు వర్ణింపబడినదే కాని ధూళి రంగులు చెప్పబడలేదు. అట్లే వనపర్వ శ్లోకములందు దుర్యోధనుడు వందలకొలది వేలకొలది ఆవులను చూచినట్లు వర్ణింపబడినదే కాని ఆమందలోని గోవులరంగులు చెప్పబడలేదు.

భారతము రచించుటకు అనేక వారములు చదివిన కవి తన శిల్ప మర్యాదచేత, కళావైభవముచేత పైరెండు సందర్భములందును యిట్లురచించెను.(4-4-50)(3-5-375)

సీ॥ అభినవజలధర శ్యామంబు లగునెడ, లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబు లగుపట్లు, కిసలయోత్కరములఁగ్రేణిసేయ
రాజమరాళ గౌరము లగుచోటులు, దఱచుఁబూఁబొదల చందంబునొంద
హరిద్రరుచి సమానాకృతులగు తావు, లడరెడు పుప్పొడులట్లు మెఱయ

తే॥ గలయనెగసి ధరాధూళి లలితవనము, దివికి నలిఁగాఁపువోయెడు తెఱగుదాల్ప
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ, నడచు కౌరవసైన్యంబు గనియె.

సీ॥ వావానహస్ర సంఖ్యానంబులై సంత, తానంద విగత భయత్వలీల
వక్కాననమున వేదిక్కు సూచిన నతి, సంకులంబుగఁ గుందశంఖచంద్ర
హారనీహార డిండీర పటీర ము,క్తాహార హీర సంకాశములును
గాదంబకాలేయ కాదంబినీ నీల,జాల తమాలికా సన్నిభములు

తే॥ ప్రౌఢ బంధూక పల్లవ భాసితములు, వికచకాంచన చంపక విస్ఫుటములు
నైన వర్ణంబులొప్ప నేత్రాభిరామ,భంగినలరారు గోకదంబములఁగనియె

విరాటపర్వమునందలి పై పద్యమున నలుపు,ఎఱుపు,తెలుపు,పసుపు రంగుల ధూళి చెప్పి అనేకవృక్షములు గల వనము దివిని ఆక్రమించుటకు వెళ్ళుచున్నట్లు వర్ణింపబడుట, పూరింపబడినఅరణ్యపర్వశేషమున అదేరంగులుగల గోవులు దుర్యోధనుడు ద్వైతవనమునందు ఘోషయాత్రకై వెళ్ళిచూచుట చూడగా రెండింటిని ఒకేకవి రచించినట్లు భావింప వీలగుచుండుటేకాక విరాటపర్వరచన తర్వాత అరణ్యపర్వ చతుర్థాశ్వాసమునుండి విరాటపర్వమువరకుగల శూన్యాకాశమును పూరించినట్లు ధ్వనించుచున్నది.

ఈ సందర్భమున తిక్కన 'ఏ నిన్ను మామయనియెడు దీనికిఁదగనిమ్ము భారతీ కన్యక' అని చెప్పిన విషయము సంస్మరణీయము. ఈ బంధము 'భూసతి' పదమును స్మరింపచేయుటయే కాక 'అంబనవాంబుజోజ్వలకరాంబుజ శారద' పద్యమునందు 'భారతీ' అని భారతమునందున్న సరస్వతిని ప్రార్థింపబడినది. కనుక 'భారతీకన్యక' భారత రచనను తన కంకితమివ్వమని మనుమసిద్ధి కోరినట్లు ధ్వనించుచున్నది. తిక్కన నిర్వచనోత్తర రామాయణము నిర్వచనముగ వ్రాయుట, అరణ్యపర్వశేషమున వలె సంస్కృతాంధ్రములను సమముగా వాడుట, నన్నయ వలె ఆటవెలదులు (100), తేటగీతుల (89) కంటే ఎక్కువగా రచించుట, 70సీసపద్యములలో 46ఆటవెలదులే చేర్చుట, రామాయణమున పూర్వరామాయణము సంక్షిప్తముగ రచించి ఉత్తర రామాయణము అనేక నియమములతో రచించుట, అరణ్యపర్వ శేషమున పూర్వ రామాయణము రచించి ఉత్తరరామాయణము సంక్షిప్తముగచెప్పి రామరావణయుద్ధమున వ్యూహరచన ప్రవేశపెట్టుట,ఇంద్రజిత్తును ఇంద్రజియని అరణ్యపర్వశేష,నిర్వచనోత్తర రామాయణములందు ప్రయోగించుట, స్వర్గారోహణ పర్వము రచించిన తర్వాత తిక్కన నిర్వచనోత్తరరామాయణమును రచించి అరణ్యపర్వశేషరచనకు పూనుకొనెనా యను సందేహము పొడముచున్నది. ఇట్లుచేయుట అది సహజమ్ము కనుక తిక్కన యిట్లే చేసియుండునని తలంపవచ్చును. కారణము నన్నయరచన ఆదిపర్వమున కంటే అరణ్యపర్వమున శోభకెక్కినది. దానితో సమానముగ సంస్కృతాంధ్రపదములకూర్పు పరీక్షించుకొనుటకు అభ్యాసము అవసరము. అట్టి అభ్యాసమునకు భారతమును అంకితము అడిగిన మనుమసిద్ధికి రామాయణము అంకితము యిచ్చియుండును. దీనికి బలము నిచ్చునది రాజరాజు భారత (చంద్ర) వంశీయుడనని చెప్పినట్లు, తిక్కన మనుమసిద్ధిని శ్రీరామచంద్రుని సూర్యవంశమువాడిగా చెప్పుట.

కృతిపతి (రాజరాజు)యైన భూపతికి అంకితమైన భారత అరణ్యపర్వమధ్య వరకు గల నన్నయరచనా(కథ) కృతికన్య 'భూసతియైనట్లును; హరి(విరాటపర్వాది స్వర్గారోహణ పర్వకృతిభర్త హరిహరనాథుని సంబోధన బహిర్గతముగ) హరంబగు (అరణ్యపర్వశేషంబున వదలిపెట్టబడిన హరిహరనాథ సంబోధన అంతర్గతముగ - అంతస్సన్నిధి కలిగించుకొనిన అరణ్యపర్వశేషకృతికన్య) రూపము దాల్చిన భారతకథ 'శ్రీయన' (విరాటాది స్వర్గారోహణపర్వ పర్యంత భారతకథ) గౌరినా (అరణ్యపర్వశేషభారతకథ) బరగు చెల్వగా భావింపవచ్చును. ఈభావన 'భూసతి' నన్నయభారత రచనగను, 'గౌరి' అరణ్యపర్వశేష భారతకథగను, 'శ్రీ' విరాటాది స్వర్గారోహణపర్వంత భారతకథగను

అవతరింపజేయుటయే కాక 'శ్రీయనగౌరినాబరగు' విరాటపర్వ అవతారికపద్యమును, 'భూసతికిం దివంబునకు' అరణ్యపర్వశేష తిక్కన ప్రారంభపద్యమును రచించిన కవి ఒక్కరేనా? అని భావింపజేసి అరణ్యపర్వశేషరచన తిక్కనదని సూచించును.

పార్వతిపతి(శంభు)పదాబ్జధ్యాన పూజామహోత్సవ బుద్ధి సతతము కలిగిన రాజరాజు 'గిరిశపదభక్తి తత్పరభావము కలిమి శంభుదాసుం డనగా' లక్షణాభిధేయమున చెల్లును. తిక్కన 'హర' సంకేతముగ చెప్పిన అరణ్యపర్వశేష కథకు బంధముగ తగిలించిన రాజరాజ(శంభుదాస)వర్ణనను అనగా ప్రబంధపరమేశ్వరవర్ణనను సాధుజనుల కొఱకు ఉద్ధరించిన ఎఱ్ఱన, భక్తులు దాసానుదాసులని ప్రకటించుకొను లోకరీతిగ శంభుదాసుడని లక్షణాభిధేయముగ చెప్పుకొనినట్లు మనము భావింపవచ్చును. అప్పుడు శంభుదాస లక్షణాభిధేయము, ప్రబంధపరమేశ్వర పదము ఎఱ్ఱన రచనా విశేషమును సూచించును. కాని బిరుదులుగా గోచరింపవు. ఎఱ్ఱన మొదటి కావ్యముననే అవి పేర్కొనియుండుట దీనికి బలము నిచ్చుచున్నది.

'దివంబునకు' అనగా (విరాటపర్వమునుండి స్వర్గారోహణపర్వము వరకు హరిహరనాథసంబోధనగా రచించి స్వర్గారోహణపర్వమున 'యశోదాస్తన్యముగ' హరిహరనాథ సంబోధనతో) నన్నయరచనమైన వర్షఋతువునుండి విరాటపర్వము మధ్యనున్న (శూన్యమును)దివమును పూరించుచున్నాడు కనుక ఈ ప్రయోగము.

'పాల్పెనగంగ' పదము నన్నయ సాహిత్యములో ఈరూపున ప్రయోగింపలేదు. తిక్కన 'తారకశోభితాంబర విధంబున బొల్పెనగంగ (ఆశ్రమ2-38) యందు ప్రయోగించి యుండుటేకాక ప్రయోగసందర్భముకూడ తిక్కనకే బలమునిచ్చుచున్నది. 'ఆసకల' పదప్రయోగముకూడ తిక్కన 'అన్నరపతి చేత ననుజ్ఞాతులయి యాసకల యోధులుంబొంగి' (7-3-19) యందు ప్రయోగించుట కూడ దీనిని దృఢపరచుచున్నది. 'శరత్సమాగమము' పదము శరత్కాల ఆగమమే కాక నన్నయ, తిక్కనల కవితా సమాగమమును కూడ సూచించుచున్నది. 'ఆసకలప్రమోదకరమై' అనుపదము ఆంధ్రావళిమోదముం. బొరయ, బుధసంతోషంబు విండారగన్, అని ప్రయోగించిన తిక్కన రచననే సూచించును.

నన్నయ,తిక్కనల కవితా సమాగమమును గోపినాథ వేంకటకవి తను రచించిన 'శ్రీకృష్ణజన్మఖండము'న యిట్లు తెలిపియున్నాడు.

'ఆంధ్రకవిత్వవిద్య మొదల వివిధవిచిత్రశబ్దార్థగుణాలంకారరస బహుళప్రవాహ

రూపంబుగా నన్నపాఖ్య మహాకవి వదన వినిర్గతంబై ప్రబంధపరమేశ్వరుని[1] కుక్షి[2] ప్రదేశంబున విశ్రమించి యచ్చటనుండి తిక్కనయజ్వయందు బ్రవేశించి యచ్చటనుండి బహుప్రకారంబుల బహుకవిముఖంబులందుఁబ్రవర్తిల్లె..'

దాని భావమిది - విశ్రమము అనగా పద్యవిరామము అనగా పద్యమధ్యలో యతిమైత్రిస్థానము(విరామము) వచ్చినను మైత్రివహించి పద్యభాగమై భావయుక్తముగ ప్రవహింపజేయుట. కనుక నన్నయ, తిక్కనల కవితా సమాగమము, కృతీశ్వరుల సమాగము చతుర్థాశ్వాస మధ్యలో పద్యమున యతిస్థానమునందువలె మైత్రివహించి భావయుక్తముగ ప్రవహించెననుట.

నన్నయరచన 'సురచాపచిత్ర' అను వర్షఋతువర్ణన కడపటి పద్యము నన్నయకృతిభర్త(ప్రబంధపరమేశ్వరుడు - రాజరాజు) వినుటతో ఆగిపోయినది. దానితర్వాత వచనము 'తత్సమయానంతరంబున నుండి తిక్కనకృతిభర్త (ప్రబంధపరమేశ్వరుడు హరిహరనాథుడు) శ్రవణము. ఈమధ్య ఆశ్వాసాంత కృతీశ్వరప్రశస్తి (రాజరాజప్రశస్తి) కృతీశ్వర సంబోధన (హరిహరనాథ సంబోధన) లేక (అంతస్సన్నిధి కలిగించుకొనిన) తిక్కన మనస్సులోనుండి హరిహరనాథుడు యశోదాస్తన్యముగ వినుచున్నాడు, ఈవిరామము చతుర్థాశ్వాస మధ్యలోను లేక 3.5 నన్నయ అరణ్యపర్వ ఆశ్వాసకథ, 3.5 తిక్కన అరణ్యపర్వ ఆశ్వాసకథ కలియుచోట ఆశ్వాస మధ్యలో కలదు. చతుర్థాశ్వాసము పూర్తికాని, అరణ్యపర్వము పూర్తికాని పద్యమునందలి యతి విశ్రమమువలె నన్నయ రచననుండి తిక్కన అంతస్సన్నిధి రచనగా, అస్థిమాలగా కొనసాగినది. అక్కడనుండి అనేకకవులు నన్నయ తిక్కనల భారతరచనను వేదమువలె స్వీకరించి అనుసరించిరి.

'రాజహంస' పదము నలదమయంతి వృత్తాంతమున నన్నయ ప్రయోగింపలేదు. 'కలహంస' అని ప్రయోగించియున్నాడు. కనుక ఈ పదప్రయోగముకూడ తిక్కన రచనమని భావింపవచ్చును. ఈ రాజహంస 'నల, దమయంతుల మధ్య రాయభారము చేసిన హంస, నల మహారాజుచే చిక్కి విడువబడిన హంసకనుక రాజహంస. - నలుని కథకు పాండవుల కథకు సామ్యములు హెచ్చు. కనుకనే బృహదశ్వమహాముని ధర్మరాజునకు ఈ కథను అరణ్యపర్వమున చెప్పినాడు. అసామ్యములను గుర్తు తెచ్చుకొందుముగాక.

1. 'కృతీశ్వరుని' అని భావము. 2. 'మధ్య' అని భావము.

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మునిమని మనుమడు)

నలుడు ధర్మరాజువలె ధర్మనిష్టగల రాజు. భీమునివలె వంటలు చేయగలవాడు. అర్జునునివలె వికృత రూపమును పొందినవాడై అర్జునునివలె సారథ్యము చేసినవాడు. నలునివలె అశ్వశిక్షకుడు. సహదేవునివలె అందగాడు. ద్రౌపదిపై గుణములు కలిగిన వారిభార్య. దమయంతి పైగుణములన్నియుకలిగిన నలుని భార్య. దమయంతివలె ద్రౌపది స్వయంవరమున భర్తను ఎన్నుకొనినది. ఇద్దరు పతివ్రతలు. ఇద్దరు సైరంధ్రీవృత్తిని చేసిరి. నలచరిత్రలోవలె జూదమునకు పిలుచుట,దాయాదులతో ఆడుట,కలి (కల్యంశములోని శకునివలె)తోడ్పడుట, స్త్రీయే రెండింటను ద్వేషకారణమగుట, రెండిటను వస్త్రాపహరణముండుట. రెండింటను అరణ్యవాస, అజ్ఞాతవాసములుండుట.

వీనిని దృష్టి యందుంచుకొని తిక్కన 'భూసతికి' పద్యమునందు నలదమయంతులను కూర్చుటకు రాయభారము జరిపిన హంసను తలపింప చేయుచు ప్రథమ పద్యము రచించెనని 'దానాంభః పటలంబునం' పద్యములోని 'శరద్భయంబున' పదమును బట్టి నిర్ణయింపవచ్చునని, ఈపద్య అర్థతాత్పర్యాదులను ముందు మనము తెలిసికొనియున్నాము.

శరత్కాలమొదటిపద్యమునుగురించి కవిసామ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు తెలుగుభాషాసమితి, మద్రాసువారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వము నాలుగవసంపుటము "తెలుగు సంస్కృతి"యందు 'నన్నయభట్టు' అనుశీర్షికను యిట్లువ్రాసియున్నారు.

"శివపురాణములో నొక గాథకలదు. పూర్వయుగములో ఆహుకుడు, ఆహుకి యను నిద్దరు భిల్లదంపతులు పరమశివభక్తులైయుండగా శివు డనుగ్రహించి మీరు భవిష్యత్కాలములో నలదమయంతులై జన్మింతురు. మీకు నేను దౌత్యము చేయుదునని చెప్పెను. ఆగాథ ననుసంధించి నన్నయగారు ఈకథ వ్రాసెను. సంస్కృతములో నైషధము రచించిన శ్రీహర్షునికి దానిని తెలుగునరచించిన శ్రీనాథునికి ఈ శివపురాణాంతర్గత కథ తెలియదు. అందుచేత వారి హంస పంచతంత్రములలో వొచ్చు నొక పక్షి వంటిది. నన్నయగారి హంస శివుడు. పరమయోగీశ్వరులకు హంసలని పేరు. యోగీశ్వరేశ్వరుడైన శివుడు హంసగా వచ్చెను. ఇది నన్నయగారి పరమ విజ్ఞానము. అమలినతారకసముదయంబుల నెన్నను...... విధాతృనకైనను నేరబోలునే?" అను పద్యమును బట్టి నన్నయగారు భారతమును చూచిన చూపు తెలియగలదు. మొదటిది భారతములో నక్షత్రగోళము యొక్క మహావిషయములున్నవి. ఖగోళపరిజ్ఞానములేకుండ భారతము సర్వంకషముగా తెలియదు. రెండవది సర్వవేదశాస్త్రముల రహస్యము

తెలియవలెను. ప్రసన్న కథా కలితార్థయుక్తిలో నన్నయగారు చొప్పించిన బహ్వార్థయుక్తులు భారతరచన చేయు కవికి తప్పకుండ కావలయును. నన్నయగా రీ జ్ఞానమంతయుకలవారు.

వేదములో ద్యావాపృథువుల దాంపత్యము రూఢియైనది. మహర్షిమండలమనగా సప్తర్షి మండలము. ఈ సప్తర్షి మండలమునకు క్రింది భాగమున కొన్ని నక్షత్రములు హంసాకృతిగా నుండును. అచ్చటనే సరస్వతీ నక్షత్రము. బ్రహ్మ నక్షత్రము కూడ యుండును. ఈసంగతులన్నియు ఋగ్వేదప్రతిష్ఠితములు. ఖగోళవిజ్ఞాన మహావిషయములు నన్నయగారికి కరతలామలకము''.

శరత్కాల మొదటి పద్యమును గురించిపై శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు తమ 'సారమతినన్నయ' యందు యిట్లువ్రాసియున్నారు.

''శరత్సందర్భములో తొలుత మూలమున మూడు పంక్తులున్నవి.

క్రౌంచహంస సమాకీర్ణా శరత్ప్రముదితా భవత్
రూఢకక్ష వనప్రస్థా ప్రసన్నజల నిమ్నగా
విమలాకాశ నక్షత్రా, శరత్తేషాం శివాభవత్ వన (182-10)

ఇందలి 'శరత్ప్రముదితా' 'ప్రసన్నజలనిమ్నగా' అనుమాటలతో ఉన్న బదరీ-బాదరాయణ సంబంధముతప్ప తక్కినపంక్తులతో పైపద్యమునకు ఎట్టి సంబంధమును లేదు. అందలి కల్పనమంతయు నన్నయగారి స్వీయప్రతిభయే. పై సంస్కృత పంక్తులలో తొలి రెండును భూమికి చెందినవి. తక్కినది అంతరిక్షమునకు చెందినది.

శరదృతువు భూమికి ఒకసారియును, ఆకాశమునకు వేరొకసారియును రాలేదు. రెండింటను ఒకేసారి విరిసినది. కనుక ఒకేపద్యమున ఒకేవాక్యమున శ్లేషాలంకార చమత్కారముగ చెప్పుట ఔచిత్య శోభితమగును. కనుక రెండింటిని శబ్దార్థశక్తుల వలన ఒకేవాక్యముననే అమోఘముగ సాధించినారు.

శరత్సమాగమము భూమియందెట్లు విలసిల్లినచో చూతము.

ఆసకల ప్రమోదకరము = పూర్తిగా అందరినీ సంతోషపెట్టునదియును, మహర్షిమండలోపాసిత రాజహంసగతి భాసి = (సరస్వతీ తీరమున) మునుల చెంతనున్న రాయంచలగమనములచే ఒప్పుచున్నయదియును,ప్రసన్నసరస్వతీకము=(బురదవిరిగిన) స్వచ్ఛమైన నదులు గలదియు (లేక సరస్వతీనది గలదియు), అబ్జాసన శోభితంబగుచున్=

తామరపూల ఉనికిచే ప్రకాశించునదియగుచును, అబ్జజు యానముతో సమానమై= (బ్రహ్మదేవునివాహనమైన) హంసతో పోలిక కలదగుచు, శరత్సమాగమంబు = భూదేవికి, పొల్పు+ఎసగన్ = ఒప్పిదము ప్రకాశింపగా, విలసిలెన్ = అందగించెను.

ఆకాశమున విలసిల్లినవిధము-చంద్రునిపర్యంతము సంతోషము కూర్చునట్టిదియును, సప్తర్షిమండలమునకు చెంతనున్న రాజహంసనడకలచే ఒప్పునట్టిదియును(వర్షములు వెనుకపట్టగనే హంసలు మానససరస్సునుండి ఉత్తర దిక్కుగా పయనమై పుడమికివచ్చును)అనుగ్రహించు సరస్వతీదేవి కలదియును (శరన్నవమినాడు సరస్వతినిద్రలేచి ననుగ్రహించునని పురాణోక్తి)

చంద్రుని ఉనికిచే ఒప్పుచున్నదియు, బ్రహ్మదేవుని గమనముతో సరితూగునదియునై (బ్రహ్మ హంసలరథముతో సంచరించును; శరత్తు హంసలతో సంచరించును) శరత్తు దివమునకు పొల్పెసగగా విలసిల్లినది; అబ్జజుయానముతో సమానమై అను ఉపమానమును గూడ శరత్సమాగమమునకు సమన్వయింపవచ్చును.

పండితులకు పరిపూర్ణమైన ఆనందము కల్గించునట్టిదియును మునీంద్రులచే సేవింపబడుచు రాజహంస నడలచే (వాహనమునందుండుట వలన) శోభించునట్టిదియు దయచూపు సరస్వతితో కూడినదియు (బ్రహ్మచెంత సరస్వతియుండెననుట) బ్రహ్మదేవునితో ఒప్పునట్టిదియునగు బ్రహ్మసంచారమువంటిదై శరత్తురాక విలసిల్లెను.

ఈపద్యమునందలి 'భూసతి' 'దివము' అను శబ్దములస్వారస్యముచే ఇద్దరు ప్రేయసీ ప్రియులు భిన్న భావములేక శరదాగమములో ఏకానుభవమునంది విలసిల్లుచున్నారను వ్యంగ్యమును భావింపవచ్చును. ఇట్లీపద్యము భట్టారకునిరచనములో ప్రౌఢ సుందరమైనది."

ఇక శరత్కాలరెండవపద్యమును దాని మూలశ్లోకములను పరిశీలింతము.

ఉ॥ శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవకైరవ గంధబంధురో
దారసమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరము లంబరిపూరితంబులై (3-4-141)

శ్లో॥ దృశ్యంతే శాంతరజసః క్షపాః జలదశీతలాః
గ్రహనక్షత్ర సంఘైశ్చ సోమేన చ విరాజితః

క్షపాః 'శారదరాత్రులు'గను 'గ్రహనక్షత్ర' 'తారక హారపంక్తులు' గను 'సోమేన విరాజితా' సుధాంశువికీర్యమాణకర్పూరపరాగపాండురుచిపూరములు'గను అనువదింప బడినవని శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు తమ 'సారమతి నన్నయ'లో పైపద్యశ్లోకముల నుదహరించి చెప్పి యింకను యిట్లు వ్రాసి యున్నారు.

"వ్యాసమునీంద్రుని శారద రాత్రులుఅమాయిక కోమలములు. అవి ధూళులడగిన మీదట తొలిమబ్బులతో చల్లగా నున్నవి. ఆకాశము నందలి గ్రహనక్షత్ర సంఘములతో చంద్రునితో విరాజిల్లుచున్నవి. అంతే-

నన్నయగారి చేతిలో ఆ శారదరాత్రులకు ప్రాణము వచ్చినది. వారు ఏప్రియుని కొరకో యెదురుచూచు వాసకసజ్జికలో, ప్రియాభిసరణము సేయు జ్యోత్స్నాభిసారికలో అయినారు. ధగధగవెలుగు తారకతారహారములను మెడలో కైసేసికొన్నారు. తెల్లగలువల సుగంధమంతయు ఒడలికి పూసికొన్నారు. కర్పూర పరాగ సుభగములైన - చంద్రుని కాంతుల కెనవచ్చు - వలిపములను ధరించినారు. ఓహో ఏమి దర్శనము!"

ఈ పద్యమునకు కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ 'సాహిత్య సురభి' యందు యిట్లు వ్రాసియున్నారు.

"ఇది నన్నయగారి రచనలోని చివరిపద్యము. ఆయన చివరి పద్యమగుటచేతనో యేమో! ఆయన శైలిలోని సరసత్వము; చారుత్వము; మాధుర్యము సౌకుమార్యము సర్వము నిందున్నవి.

సుధాంశు = చంద్రునిచేత; వికీర్యమాణ = వెదజల్లబడిన; కర్పూర పరాగపాండు= కప్పురపు పొడివలె తెల్లనైన వానిచేత; రుచిపూరములు = కాంతి ప్రవాహములు; పరిపూరితంబులై = నిండింపబడినవై. పరిపూరితములు బదులు "బరిపూరితము" లను పాఠము కూడ నున్నది. రుచిపూరములు = కాంతి ప్రవాహములు. అంబరపూరితంబులై=ఆకాశమునందు నిండినవై యని యర్థము. ఇట్లుండగా రుచి పూరంబులన్ = రుచిపూరములచేత; పరిపూరితంబులై = ఇతరుల చేత పూరింపబడినవై యనునర్థము వచ్చి తరువాత భాగమంతయు, పర = ఇతరుడైన యెఱ్ఱాప్రగడ చేత పూరింపబడునన్న యర్థము దానియంత కలుగుచున్నది. అంబర శబ్దములోనున్న 'అం' వెనుకటి యక్షరమైన 'లం'లో చేరిపోగా పరశబ్దము మిగిలిపోవును.

దైవమట్లు వ్రాసియున్నాడు గనుక నన్నయగారి నోటివెంట నట్లు వచ్చినదని కొందరు చెప్పుదురు. కవిత్వములో నశ్లీలము రాకూడదనుటకు సాక్ష్యము కావచ్చును.

డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు తమ 'ఎఱ్ఱన అరణ్యపర్వ శేషము" అను గ్రంథమునందు "స్ఫురదరుణాంశు" పద్యమునకు పూర్వరంగముగా యిట్లు వ్రాసియున్నారు.

"రాత్రికి 'త్రియామ' అనుపేరు గలదు. అనగా మూడు జాములు కలది యనియర్థము. వందసంవత్సరముల కొక జాముచొప్పున మూడుజాముల సుదీర్ఘరాత్రి తెలుగు సాహిత్య ప్రపంచమున చీకటులుచిమ్మినది. 'రాత్రి గ్గమిష్యతి భవిష్యతి సుప్రభాతమ్" అను వాసతో తెలుగువారి యెదలు అరుణోదయమునకై యెదురుతెన్నులు చూచుచు తహతహలాడినవి - చూడగాచూడగా నొకానొక వేళావిశేషమున శారద ప్రసన్నమైనది."

ఈపూర్వఅంధకారముతో నిండినఆకాశమును పూరించుతిక్కన హరిహరనా థాంకితముగా 'తత్సమయానంతరంబున' అని నన్నయతిక్కనల సరిహద్దు రేఖనురచించి అంతకుముందు అంకితమైన భూసతికి విరాటపర్వమువరకు ఉన్న ఆకాశమును అక్షరకాంతితో గద్యపద్యములతో నింపుటకు శరత్సమాగమమైనదని రచించెనని ముందు తెలుసుకొంటిమి.

తిక్కన 'అంబ నవాంబుజోజ్వలకరాంబుజ శారద' పద్యమునందు శారద ప్రయోగించి యున్నాడు. నన్నయను స్తుతించిన 'ఆదరణీయ' పద్యమునందు '... లంధ్రకవిత్వవిశారదుండు' విద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్' అని 'విశారద' పదమును వాడియున్నాడు. ఇప్పుడు 'శారద' పదముచే పద్యమెత్తుకొని తర్వాత పద్యమున 'శారద వేళ చూడగన్' అని ప్రయోగించుచున్నాడు.

ఈ పద్యమున కావ్యపరమైన ఈ క్రింది భావమును కూడ వ్యక్తపరచియున్నాడు.

శారదరాత్రులు=నన్నయ కడపటిపద్యము'సురచాపచిత్రనుండి అక్షరకాంతిలేని అంధకారము విరాటపర్వమువరకు ఆవరించియుండిన ఆకాశము(దివము- శూన్యము).

ఉజ్జ్వల=ఉజ్జ్వలమైన; లసత్=ప్రకాశించు; తర=(అక్షరకాంతి) వరుస; తారకహార పంక్తులన్=నక్షత్రములవంటి (అక్షరపద) దండల (పద్యముల, వచనముల) సమూహముచే; చారుతరంబులయ్యె=సమూహముచే కాంతిసౌందర్యము పొందించిన వయ్యెను; వికసత్=వికసించిన; నవకైరవ=క్రొత్త తెల్లకలువ పుష్పముల (భూసతికిం, శారదరాత్రులు

ఉత్పలమాల పద్యములగుటచే నూతన కాంతి వెదజల్లు ఉత్పలమాలలని భావము); గంధబందర+ఉదార సమీర సౌరభము= సుగంధము కలిగిన (వాయు) భావ వాసనలు, తాల్చి=ధరించి; సుధాంశు=చంద్రకిరణములు (చంద్రవంశపురాజు రాజరాజకీర్తికిరణములు); వికీర్యమాణ=వెదజల్లబడిన; కర్పూరపరాగపాండురుచిపూరములు=కర్పూరపుపొడివలె తెల్లనైనవానిచేత(అక్షర)కాంతిపూరములు; అంబరపూరితంబులై= శూన్యముచేపూరింపబడినవై.

నన్నయ కడపటి పద్యము 'సురచాప చిత్ర.....' నుండి అక్షరకాంతి లేని ఆకాశము అంధకారముతో ఆవరింపబడియుండగా విరాటపర్వము నుండి స్వర్గారోహణ పర్వము వరకు తిక్కన ముందు రచించినాడు. 'సురచాపచిత్ర...' నన్నయ పద్యము రాజరాజాంకితము. అక్కడనుండి రచింపబడిన 'తత్సమయానంతరంబున' నుండి హరిహరనాథాంకితము. 'తత్సమయానంతరంబు'నకు ముందు రాజరాజప్రశస్తితో పూర్తిచేయవలసి యున్నది. వాని 'పూర్వపర్వార్థయుక్తి సేయునట్టి యడల యత్నమించుకంత యయినను వలవదు. కూర్చుట నూత్నరత్నమునకుం (హరిహరనాథునకు) కనకంబునకుం (భారతకథకు) తగున్ అని తిక్కన విరాటపర్వమున రచించినాడు. దీని కనుగుణముగ ఈపద్యమును తిక్కన రచించినాడు.

తాత్పర్యము: 'సురచాపచిత్ర' పద్యమునుండి విరాటపర్వము వరకు అక్షరకాంతి పూరింపవలసియుండగా యీఆకాశమును (దివమును)'భూసతికిం'పద్యము పూరించినది. ఇట్లు ప్రకాశమానమైన అక్షర కాంతి వరుస గద్య పద్య సమూహముచే వికసించిన తెల్లకలువల (భూసతికిం, శారదరాత్రులు ఉత్పలమాల కుసుమముల) సుగంధబంధురసమీరసౌరభము (అర్థగౌరవము) తాల్చినవి. చంద్రకిరణములచే వెదజల్లబడిన కర్పూరపు పొడి తెల్లని కాంతి (రాజరాజప్రశస్తి) పూరింపవలసిన విషయము శూన్యముచే పూరింపబడినది అనగా వదలివేయబడినది.

డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు 'శ్రీ ఆంధ్ర మహాభారతము' అరణ్యపర్వ భాగమునకు పీఠిక వ్రాయుచు 'నన్నయ వర్ణించిన శరద్రాకాచంద్రికలలో మైమఱచి నిద్రించుచుండిన యాంధ్రజాతికి 'స్ఫురదరుణాంశు రాగరుచి' చూపి యెట్టిన మెలకువ తెప్పించెను' అని వ్రాసిరి. ఆపద్యమిది.

స్ఫురదరుణాంశు రాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవజృంభణ ముల్లసిల్ల ను

ద్ధురతర హంససారస మధువ్రత నిస్వనముల్ సెలంగగా
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళ చూడగన్

ఈపద్యమునందలి పొంపిరివోయి అరణ్యపర్వముననే 5-223, 7-433 యందు ప్రయోగింపబడి యున్నది. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున (3-65) (5-95) (6-97) (7-62) యందు ప్రయోగింపబడియున్నది. తిక్కనభాగమున భారతములో (4-2-86, 122; 4-142) (5-1-94, 2-214) (7-1-280, 3-268) (8-2-151; 3-282, 384) (9-1-5; 2-5, 267) (12-2-446, 6-337) (13-5-212) (14-2-120) యందు ప్రయోగింపబడియున్నది. నన్నయ,ఎఱ్ఱన రచనలలో ఈపదప్రయోగము చేసియుండలేదు. కనుక ఈపద్యముకూడ తిక్కన రచించినట్లు భావింపవచ్చును.

విరాటపర్వములోని క్రిందిపద్యములను చూడుడు.

క॥ హరిహరనాథునకు మరు, త్పరిదాకల్పిత మనోజ్ఞ చరణ శిరస్సుం
దరమూర్తికి భావనత, త్పరచేతో యుక్త భక్త పరతంత్రునకున్

క॥ జలనిధిహిమవద్భూధర, కలిత జననకేళీకౌతుక వ్యక్తావ్య
క్తలలిత సౌందర్య స్ఫుర, దలఘుతను స్త్రీ సనాథ హరిహరనాథా

పై పద్యములలో ప్రథమముగా నున్న హరిహరనాథ పదము క్రింది పద్యములో కడపటి పదముగా మారిన విధముగనే 'శారదరాత్రుల' లోని శారదపదము 'స్ఫురదరుణాంశు' పద్యమున కడపటి మూడు పదములను బ్రహ్మ, విష్ణు, శివస్థానములుగ భావించి 'శారద' పదమును బ్రహ్మాంశస్థానములో ప్రయోగించుట కళావిదుడైన తిక్కన కౌశలము కాని ఎఱ్ఱనదనుట సమంజసముకాదు. ఎఱ్ఱననే తిక్కనను 'కవిబ్రహ్మ' అని ప్రశంసించుట దీనిని గుర్తించియే యని భావింపవచ్చును.

సంశోధిత ప్రతిలో 'భూసతికిం' పద్యము నుండి ఎఱ్ఱన కవిత్వ మారంభమని, 'స్ఫురదరుణాంశు' పద్యమునుండి ప్రారంభమని యున్నది. ఈరెండింటిలో ఒకటే నమ్మదగినది. ఎఱ్ఱన తనకుగా ఏమియు చెప్పలేదు. కాని 'క్రౌంచహంససమాకీర్ణా' అను శరత్కాల ప్రారంభశ్లోకమును సూచించు పద్యమును 'మించిన వేడ్క' పద్యమందు సూచించి 'ప్రాథాంచిత శబ్దసారులు, మహాకవులు కావ్యశయ్యకు తగిలించిన కీర్తి సంగసుఖలీలను కాంక్షించితినని చెప్పుటవలన 'భూసతికిం' పద్యమే ప్రథమపద్యమని సూచించును. 'దానాంభః పటలంబునం' లోని 'శరద్భయంబున' కూడ 'భూసతికి

పద్యమే ప్రథమపద్యమని అంతస్సాక్ష్య మిచ్చును. పొల్పెసగంగ, ఆసకల, పొంపిరివోవ పదప్రయోగములు తిక్కననే పద్యరచనాకర్తగా సూచించును. సప్తమాశ్వాసాంతమున ఎఱ్ఱన అవతారిక యున్నందున 'ఎఱ్ఱన'పేరు స్ఫురదరుణాంశులోని 'అరుణ'శబ్ద సామ్యముచే లేఖకులు 'భూసతికిం'నుండి 'స్ఫురదరుణాంశు'నకు 'తిక్కన' పేరును 'ఎఱ్ఱన'గా మార్చినట్లు భావింపవచ్చును. కాని 'ఉభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమునం పారగుడనని తిక్కన చెప్పుకొనెనే కాని, ఎఱ్ఱన, తిక్కనను 'కవిబ్రహ్మ' అని ప్రస్తుతించి తన కవితాగుణములేవియు చెప్పుకొనలేదు.

నన్నయ భీముడు సౌగంధికపుష్పమును తెచ్చుటకు పోవు సందర్భమున గజమునకును,ఘనబృందములకుగల సామ్యమును ఇట్లు వర్ణించియున్నాడు.(3-3-355)

సీ॥ వారిధారల ననివారిత నిర్గళ, ద్దానధారలఁదటిద్ధామములను
దశనధామంబుల నశనిఘోషంబుల, ఘోర బృంహితబృహద్ఘోషణముల
నివి ఘనబృందంబు లివి గజయూథంబు, లని విచారింపంగ నక్కజంబు
లై లలితోత్తుంగ శైలకుంజంబులఁ, ద్రిమ్మరు జలధర ద్విరదతతుల

ఆ॥ విస్మయంబుతోడ వీక్షించుచుం జని, రజతగిరి సమీప రమ్యభూమి
నక్కుబేరువనమునందు సౌగంధిక, కమలవనముఁగనియె ఘనభుజుండు

పై నన్నయగారి పద్యమును మూలముగ గ్రహించి పైపద్యమునకు 'అస్థిమాల'గ క్రిందిపద్యమును రచించినాడు.

మ॥ దానాంబఃపటలంబునం బృథుపయోదారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గెనా
గా నొప్పారె మదోత్కట ద్విరదసంఘంబుల్ వనాంతంబునన్

వ్యాసమూలమున పైపద్యమునకు ఆధారములేదు. 'నన్నయ కావించిన వర్ణనమున కిది యవస్థాభేదము ననుసరించి చేయబడిన రూపాంతర కల్పనము. అచ్చటి భ్రాంతి యిచ్చట ఉత్ప్రేక్షమైనది. స్వర్గమునుండి నన్నయ దిగివచ్చి యెఱ్ఱయ రూపమున గూఢముగా నరణ్యపర్వమున విహరించుచుండెనా యన్న మృదువైన ధ్వనియు నీ పద్యమున భావుకహృదయములను స్పృశించుచున్నది' "అని డాక్టర్

పాటిబండ మాధవశర్మగారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమివారు ప్రచురించిన శ్రీ ఆంధ్రమహాభారత అరణ్యపర్వభాగమునకు వ్రాసిన పీఠికయందు వ్రాసియున్నారు.

నన్నయనే అజగర వృత్తాంతము తర్వాత వర్షాకాలమును వర్ణింపుచు

క॥ నాలుగు కెలఁకుల నవఘన జాలంబులు వ్రేలి కురిసె ఝంఝానిలవే
గాలోలములై బహుల, స్థూల పయోధార లోలిఁ దుములంబు గాన్

నాలుగుదిక్కుల పెద్దపెద్ద నీటిధారలతో (స్థూలపయోధారలు) కప్పబడగా గాలివేగమునకు వచ్చు మ్రోతతో క్రొత్తమేఘముల సమూహము నిట్టనిలువుగ వర్షము కురిపించుచు తుముల యుద్ధము చేయుచున్నట్లున్నదని వర్షఋతువును నన్నయ వర్ణిస్తే శరత్కాలము వచ్చుచున్నదను భయముతో ఆకాశమున వర్షాకాలమున ఉన్న మేఘములు ఆకాశమునుండి భూమిపైకి నల్లని ఏనుగులుగా దిగివచ్చి మేఘ గర్జన బృంహిత ధ్వనిగా వర్షధారలే దానాంభః పటలముగా వర్ణిస్తూ అడవిలో సంచరించుచున్నవా అనునట్లున్నవని పైపద్యమున తిక్కన వర్ణించినాడు.

పై పద్యము యొక్క రచన నన్నయ యొక్క భావమును గ్రహించి కల్పించిన రూపకల్పన. కనుక నన్నయ 'అస్థిమాల' కాని 'తద్రచనయకా' వలె లేదు. ఈ సందర్భమున కవి సామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'సాహిత్యసురభి' అను తమ గ్రంథమున పైపద్యమునకు వ్యాఖ్య వ్రాయుచు పేర్కొనిన క్రిందివాక్యములు గమనార్హము.

'ఒకానొక కవి ననుసరింపవలయు ననగా నతని శబ్దములు, నతని సమాసగ్రథనము తూచినట్లు పట్టుకొనవలయును, మఱియు, నన్నయగారి రచన యందలి ప్రసన్నత సంపూర్ణముగా నెఱ్ఱనయం దున్నదనుటకు వీలులేదు."

ఈపద్యములోని 'ప్రావృట్ పయోదానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గెనాఁగా నొప్పారె మదోత్కట ద్విరద సంఘంబుల్ వనాంతంబునన్' ను తలపించునట్లు ఎఱ్ఱన హరివంశమున 'ఉన్నత గోత్ర సంభవము' రచించెననియు, ఎఱ్ఱన తనపేరు అరణ్యపర్వమున చెప్పినపుడు గూఢత లేదనియు, తిక్కననే రచించెనని ఎఱ్ఱన సూచించినట్లు మనము ముందు చూచితిమి.

పై పద్యమందు శరద్భయంబున అని ప్రయోగించియుండుటచే శరత్కాల మొదటి పద్యము 'భూసతిం' పద్యమునుండి తిక్కన రచనమని పై పద్యము గూఢముగ చెప్పుచున్నదను అంతస్సాక్ష్యమును కూడ ముందు చూచితిమి.

'అరుదగు తత్పయోద సమయంబున' అని నన్నయ వర్ణించిన వర్షవర్ణనకు 'అస్థిమాల'గా రచించిన పద్యమే యిది.

క॥ కలనీల కంఠకోలా, హల లీలలు సెందె రాజహంసకులంబున్
విలసించె సప్తపర్ణా, వలి విగళితకుసుమకుటజవాటికలడరెన్

డాక్టర్ పాటిబండి మాధవశర్మగారు పై పద్యములందు వర్షమును శరత్తుగా నవతరింప జేయుటలో నన్నయ ఎఱ్ఱయగా నవతరించినట్లున్నది అని అరణ్యపర్వ పీఠికయందు వ్రాసియున్నాడు.

వ్యాసమూలమున పైపద్యమునకు మూలశ్లోకము లేదు.

నన్నయ వర్షవర్ణనలో ఆకాశమున మేఘధ్వని, పల్లపు భూములయందు వాననీళ్ళ బురదలో కప్పల బెకబెకధ్వని వినబడుచుండగా వృక్షముల కొమ్మలపై నెమళ్ళు నాట్య రవళులతో కనబడు మనోహర ప్రకృతిని వర్ణింపగా, తిక్కన కప్పల విషయమును తర్వాత పద్యమున వర్ణించి పై పద్యమున శరత్కాలమున నెమళ్ళ లీలలు హంసలకు చేరినట్లును క్రౌంచ హంస సమాకీర్ణా' అను శరత్కాల ప్రథమశ్లోకములోని హంసను మాత్రము 'భూసతికిం పద్యమునందు 'రాజహంస'గా తెలుగున తెచ్చి (తిక్కన రచించిన ధ్వని) ఏడాకుల అరటి వికసించి కొండమల్లెపూల వికాశము పోయినట్లును నన్నయ భావననుండి శరత్కాల వర్ణన కనువుగ మార్చినాడు. ఏడాకుల అరటి' (సప్తపర్ణావలి) ఏడు ఆశ్వాసములు కలిగిన అరణ్యపర్వమునుగా విభాగించిన ధ్వని యిందు కలదని భావింపవచ్చును. ఏడు సంఖ్య తెలుగుజాతి నిరసించు సంఖ్య. కారణము ఏడు శబ్దమే ఏడుపు తెచ్చునేమో నను భయము. ఇట్లు ప్రయోగించుట ద్వార నన్నయ మరణ ధ్వని. 'అస్థిమాల' రచన సూచన. 'రాజహంస కులంబు' ప్రయోగముచే అరణ్యపర్వశేషకులమును చేరినట్లు ధ్వనించినాడు.

ఇట్టికళ తిక్కన సొత్తు. కనుక తిక్కన రచనమని తిక్కన చెప్పిన ఉభయకావ్య ప్రౌఢిపాటించు శిల్పమునం పారగుడ, కళావిదుడ' నుండి గ్రహింపవచ్చును.

నన్నయ వర్ణించిన కప్పలవిషయము పైపద్యమున రచింపక,తర్వాతి పద్యమునకు దాచెనని చెప్పితిమి. దానిని యిట్లు తిక్కన 'అస్థిమాల' పద్యముగా రచించెను.

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

మ॥ అతి గాంభీర్య విభూతి నేకచులుకాహంకార నిశ్శేష శో
షిత పాథోధిపయస్కుడైన ముని తోచెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీధి బ్రకటక్రీడాకళాగర్వగ
ర్జిత మండూక కళంకితాంబు శుచితాసిద్ధిప్రదాచార్యుడై

వ్యాసభారతములో దీనికి మూలశ్లోకము లేదు. కవిసామ్రాట్ విశ్వనా సత్యనారాయణగారు ఈపద్యమునకు వ్యాఖ్యానము 'సాహిత్యసురభి' యందు యిట చెప్పియున్నారు.

"చులుకము=పుడిసిలి; ఒక్కపుడిసిలి యొక్క గర్వము చేత బొట్టు మిగులకుం నెండబెట్టిన సముద్రపు నీరు గలిగినముని. అనగా నగస్త్యమహర్షి.

శరత్కాలమునందు దక్షిణదిక్కున నగస్త్య నక్షత్రముదయించును. యామ్యదిక్= దక్షిణదిక్కు; యమునికిసంబంధించినది యామ్యము. దక్షిణదిక్కున కధిపతి యముడు

ప్రకట..... ఆచార్యుడై=ప్రకటమైన కేళీగర్వముతో గర్జించుచున్న కప్పలచేత మలినమైననీళ్ళకు శుచిత్వముయొక్క సిద్ధినిచ్చుటయం దాచార్యుడై -

అదివరకు వానకాలమున నీళ్ళు బావురుకప్పల కూతల చేత మలినమైపోయినవని ఆనీళ్ళ నగస్త్యుడు తేర్చిపెట్టినాడని.

వర్షాకాలములో నీ రొండుతో కలిసియుండును. శరత్కాలములో నీరు తేరుకొనును. అగస్త్యుడు శరత్కాలమున నుదయించును. ఈకార్యమున కాయక కారణమని చెప్పుట. నీటియొక్క మాలిన్యమునకు కప్పలు హేతువు కావు. కాని వానియందు హేతుకల్పన చేయుట. సమాస గ్రథనము పద్యరచనకు శోభగూర్చును. అగస్త్యుడను పేరు చెప్పకుండ 'చులుకాహంకార' మొదలైన యగస్త్యుని లక్షణము చెప్పి వదలిపెట్టుట మనస్సునకు కొంతస్ఫురణచేత నుత్తేజము కలుగుట."

డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు 'ఎఱ్ఱన అరణ్యపర్వశేషము' అను తమ సిద్ధాంత గ్రంథమున యిట్లు చెప్పియున్నారు.

"అద్భుతరసమునకు నిదానమైన పద్యమిది. ఏకచుకాహంకార నిశ్శేష శోషిత పాదోధిపయస్పుడు" అంబు శుచితాసిద్ధి ప్రదాచార్యుడు అన్నవి తొలి, మలి విశేషణములు - ఎత్తుగడలోనే తొలి విశేషణముతో నొక్కుమ్మడిగా నావహించిన యద్భుతము, మధ్యలో

చక్రభ్రమణము చేసినట్లు చేసి, మలి విశేషణముతో ప్రశాంత పరిణామమును పొందుట గొప్ప శిల్పము. అతి గాంభీర్య విభూతియట! శుచితా సిద్ధియట! ఇట్టిదీ ఎఱ్ఱనగారి శబ్దప్రయోగ శిల్పము.

మూలమున సూక్ష్మముగనున్న అగస్త్యోదయ ప్రసక్తి నిట్లు పెంచి వ్రాయుటలో గల కవియాంతర్య మిది కావచ్చును.

తిక్కయ్యజ్వ ఒక్కదెబ్బలో పదిహేను పర్వముల భారతమును జుఱ్ఱినాడనియు, అతడు దక్షిణదిగ్భాగమున నుదయించి యల్లరి కప్పల దూకుడుచేత కలుషితమైన నదీజలమును ప్రసన్నము చేసినట్లు ఈతడుకూడ దక్షిణదిశలో నుద్భవించిన వైదిక ధర్మవిరుద్ధవర్తనమునకును, తదనుకూలమగు నాంధ్రమార్గకవితాస్రవంతికి శుచితాసిద్ధి ప్రదాచార్యుడైనా డనియు, ధ్వనింపజేయుటకు! అప్పు డీపద్యమున ఎఱ్ఱన తిక్కనను స్మరించినాడని స్ఫురింపగలదు."

పై పద్యమునందు పేరు చెప్పక అగస్త్యుని ధ్వనించుట, దానాంభః పద్యముః 'నిగూఢకారతన్' అని చెప్పుకొనిన తిక్కనను స్ఫురింపచేయుటకని, తిక్కననే అరణ్యపర్వ శేషకథ మాత్రము రచించెనని ధ్వనిద్వారా తెలియజేయు పద్యమిది.

ఏ విషయ ప్రస్తావనమునందు కాని ముందు విషయఉపక్రమము కడపట ఉపసంహారముఉండునట్లు తిక్కన తన రచనాప్రారంభమును 'భూసతికిం' పద్యమునందు చెప్పి తన అవతరణమును ధ్వనించు పీఠికను క్రింది పద్యమునందు పూర్తి చేయుచున్నాడా అనునట్లు 'భూసతికిం' పద్యమునకు ఉపసంహారక ముగ నిట్లు శరత్కాలాంతపద్యమును రచించినాడు.

తే॥ విశద శారదాంబుద పరివేష్టనమున, బొలుచు గగనంబు ప్రతిబింబమో యనంగ
వికచకాశవనీ పరివేష్టనమున, నతిశయిల్లె నిర్మల కమలాకరములు.

డాక్టర్ పాటిబండి మాధవశర్మగారు శ్రీమహాభారతము అరణ్యపర్వ భాగము నందలి పీఠికయందు "ఈ పద్యమందలి యుత్ప్రేక్షకు జన్మస్థానము "భూ సతికిం, దివంబునకు' అన్న పద్యమందలి నన్నయ భావనయే. నన్నయ బింబము. ఎఱ్ఱయ ప్రతిబింబము" అని వ్రాసియున్నారు. డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు తమ 'ఎఱ్ఱన అరణ్యపర్వ శేషము' అను సిద్ధాంత గ్రంథమునందు ఈసందర్భమున యిట్లు వ్రాసియున్నారు. "ఇందలి అలంకారము ఉత్ప్రేక్ష, గగనమునకును, కమలాకరములకును

గల బింబప్రతిబింబభావము కన్నులకు కట్టునట్లు నార్వెండింటికిని విశేషణములుగ చెప్పబడిన 'వికచకాశవనీ పరివేష్టనమున' అన్న వాక్యద్వయమునందు కూడ బింబ ప్రతిబింబభావన ముట్టిపడునట్లున్న కట్టుబడి మహాకవి యొక్క రచనాశిల్పమునకు నిరూపకముగ నున్నది!

నన్నయభట్టారకుడు 'శారదరాత్రులు' అన్నపద్యమును ఏస్థాయిలో విడిచిపెట్టెనో, ఆస్థాయిని, ఆధారను చెక్కుచెదరనీయక వన్నె తరుగనీయక అట్లే యందిపుచ్చుకొని యీయైదుపద్యములను పోతపోసినా డెఱ్ఱన. ఆపద్యములం దీతడు పలికించిన నాదముగానీ మెఱపించిన యలంకారసౌందర్యముగాని వర్ణనాతీతములు! నన్నయకథాకథనశైలికి ప్రవర్తకులని విమర్శకులు నిర్ణయించి పెట్టిరి. ఎఱ్ఱన తన వర్ణనావైభవవిన్యాసములను ఈతొలిఘట్టమునందే అద్భుతముగ ప్రదర్శించినాడు.

ప్రసన్న సరస్వతీకత్వము:- నన్నయ 'శారద రాత్రులు' అను పద్యమున శరదృతువునకు పర్యాయముగ ప్రయోగించిన 'శారద' శబ్దమును ఎఱ్ఱన పలుమాఱులు ప్రయోగించుట గమనార్హము. 'శారదవేళ' 'విశద శారదాంబుద పరివేష్టనమున' 'ఇట్టి శారదాగమనంబున' ఇత్యాది ఇచ్చట వర్ణించునది శరదృతువునే యన్నట్లు కాన్పించినను 'శారద' శబ్దస్ఫూర్తిచేత 'శారదాదేవి' రూపమును కూడ రేఖామాత్రముగ గోచరింప జేయుట విశేషము! అనగా శారదవేళ వర్ణన యొకవైపున, శారద రూపస్ఫూర్తి మరియొకవైపున- ఇట్లీ రెండు భావధారలు సమాంతరరేఖలపై నడచివచ్చుచునే యుండును. అట్లు వచ్చివచ్చి యీయైదు పద్యములతర్వాతి వచనమునందు వర్ణింపబడిన సరస్వతీమహానదీ ధారలో పర్యవసించును. ఇది యెఱ్ఱనగారి తొలివచనము. ఈవచనరచనా సౌందర్య లహరితో మిళితమై ప్రవహించు సరస్వతీనది సౌందర్యమును తిలకింపుడు.

'అట్టి శారదాగమనంబున నుత్ఫుల్లకమల కల్హార కేసర కరాళకలిత కల్లోల మాలినియు, ననేకమునిలోక సతత సంసేవ్యమాన విపులపులినోత్సంగయు, నిరంతర తీరవానీర వనమండలీ విలసితయు, నాకాశసంకాశ విశదసలిలయు నైన సరస్వతీమహానది నుదిన స్నానపానాది విశేషంబులం బరితోషంబు నొందుచు ( బాండునందను లమ్మరు భూమిం గొన్నిదినంబులు వసియించి, తదనంతరంబ ధౌమ్యాది భూసురవరులు నింద్రసేనాది మూలభృత్యులు ( దోడ నరుగు(దేర(గామ్యకవనంబునకు వచ్చి యచ్చటి మునులచేత నభినందితులై యందు సముచితవర్తనంబుల నుండునంత నొక్కనాడు'.

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

అట్లు పర్యవసించి యంతతో నాగదు సరిగదా 'సరస్వతీగీత' కడకు పోవుసరికి మున్ను నదీరూపమున గోచరించిన సరస్వతి, యక్కడి 'అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ' అన్న పద్యములో దేవీరూపమున సాక్షాత్కరించును! ఆరూపము "శారదచంద్ర చంద్రికాడంబరమూర్తియై" శారద, శరదృతువుల సమన్వయాకృతిని దాల్చును! ఇది నన్నయనుండి యెత్తిన పొందిన సరస్వతీకత్వము! సరససారస్వతాంశప్రశస్తి! అదిగో "సరస్వతీగీతలోని సరస్వతి. అంబ నవాంబుజోజ్వల కరాంబుజ! శారద! చంద్రచంద్రి కాడంబర చారుమూర్తి! ప్రకటస్ఫుట భూషణరత్నరోచిరా చుంబిత దిగ్విభాగ! శ్రుతిసూక్త వివిక్తనిజప్రభావ! భావాంబరవీథి విశ్రుతవిహార ననుం గృపజూడు భారతీ! (3-4-215)."

పై సరస్వతీకమున అంతర్వాహినిగా ప్రవహించిన రూపమునే నన్నయ తిక్కనల కవితారూపము కలిసిన తిక్కన 'అస్థిమాల'గా (అంతర్వాహినిగా) ప్రవహించిన తిక్కన సరస్వతి అని మనము ముందు చూచితిమి. కనుకనే తిక్కన విరాటపర్వమున శ్రీయన గౌరినా, బరగు చెల్వకు అని లక్ష్మీపార్వతులు కలసిన ఒక చెల్వను పేర్కొని, నిర్వచనోత్తర రామాయణము వలె' హరిహర పద్మగర్భులను ముగ్గిరిని కొల్చినట్లు చెప్పి, ఈ అరణ్యపర్వ శేషమున అంబ (పార్వతి) నవాంబుజోజ్వల కరాంబుజ (లక్ష్మి) శారద (సరస్వతి) ముగ్గురు కలిసిన రూపమును భారతమున ప్రవహించిన సరస్వతిగా వర్ణించియున్నాడనియు, అందుననే ప్రకటస్ఫుటభూషణరత్నరోచిరాచుంబిత దిగ్విభాగ అని రాజరాజు ప్రశస్తిని తాకు దిగ్విభాగము అనగా 'భూసతికిం' పద్యపు ముందరి 'సురచాప చిత్ర' కడపటి వర్షఋతువర్ణనపద్యమును తాకు 'తత్సమయానంతరము'ను సూచించెనని ముందు చూచితిమి. 'శ్రుతి సూక్త వివిక్త నిజప్రభావ' వేదసూక్తులందు విస్పష్టముగనున్న నిజమైన ప్రభావము కలిగిన (విరాటాది స్వర్గారోహణ పర్యంత)భారతమును, 'భావాంబర విశ్రుత విహార' (భావాంబరమున అరణ్యపర్వ శేషమును వివరించిన హరిహరనాథుని)అని తిక్కన భావాంబరమున (భారత భావమును) విశ్రుతముగా విహరింపచేసిన భారతమున ప్రవహించిన సరస్వతినే భారతీ అని తిక్కన ప్రార్థించినట్లు మనము ముందు చూచితిమి.

తిక్కన విరాటపర్వ పీఠికలోని హరిహరనాథుని వర్ణించు 'కరుణారసమువొంగి' పద్యమును అరణ్యపర్వశేషభాగమును ధ్వనించు సరస్వతితో వర్ణించి, కడపడి గీత పద్యమున సురనది(నన్నయకవితాధార)ని, కాళింది(తిక్కనకవితాధార)నందు అంతర్వాహినిగా త్రివేణీ సంగమమున ప్రవహించు సరస్వతీనదిగా నన్నయధార కలిసిన తిక్కన కవితాధార కలిగిన అరణ్యపర్వశేషమును రచించినట్లు ముందు చెప్పకొంటిమి.

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు 'సాహిత్య సురభియందు తిక్కన' ప్రాంశుపయోద అనువ్యాసస్తుతి, అంబ నవాంబుజోజ్వలపై సరస్వతీ స్తుతి భాగవతమున ప్రార్థనపద్యములలో చేర్చి చదువుదురని మనము ముందు చూచితిమి. ఇప్పుడు 'ప్రాంశు' పద్యమును పరిశీలింతము.

ప్రాంశుబయోద నీలతనుభాసితు నుజ్వల దండధారుఁబిం
గాంశు జటచ్ఛటాభరణు నాగమపుంజ పదార్థతత్త్వ ని
స్సంశయకారుఁ గృష్ణమృగచర్మ కృతాంబర కృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయు గొల్చెదన్.

పై పద్యములోని 'కృతాంబరకృత్యు', 'భారతీవంశవివర్ధను', 'నాగమపుంజ పదార్థ తత్త్వ నిస్సంశయకారు' ప్రయోగములు అంబర, భారతీ, శ్రుతిసూక్త వివిక్త నిజప్రభావ భావాంబరవీధివిశ్రుతవిహార'ను తలపించును.

పై పద్యమునకు 'సాహిత్యసురభి'లోని కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి వ్యాఖ్య ఇది.

"ఈ పద్యము వ్యాసముని ప్రార్థన. సామాన్యముగా భాగవతము మొదట ప్రార్థనా పద్యములలో నుండును. పోతన్నగారు వ్రాసిన పద్యమనుకొందురు. ఎందుచేత ననగా నీ పద్యముయొక్క శైలి పోతన్నగారి శైలిని పోలియున్నది. తిక్కనగారిలో నిట్టి పద్యములు కొన్ని కలవు గాని వెదకవలయును. తిక్కన గారి పద్యములవంటి పద్యములు నన్నయగారిలో కూడ చాలగలవు. వానిని విడిగా దీసి చదివినచో నవి తిక్కనగారి పద్యములను కొందురు. అట్లే యీ పద్యమును విడిగా చూచినచో పోతన్నగారిపద్య మనుకొందురు. కాని యీ పద్యమును తిక్కనయే వ్రాయగలడు. ఎందుచేత ననగా 'అగమ పుంజపదార్థ తత్త్వ నిస్సంశయకారుడు' అని వ్యాసునకు విశేషణము వేసినాడు. తక్కిన కవులు వేదములను విభాగించినాడని చెప్పుదురుగాని యీ మాటను చెప్పలేరు. ఇది చెప్పుటకు ప్రస్థానత్రయమనగా బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతయు. ప్రధానముగా బ్రహ్మసూత్ర భాష్యవేత్తయై యుండవలయును. అప్పుడుగాని 'అగమపుంజ పదార్థతత్త్వ నిస్సంశయకారుడని వ్యాసునిగూర్చి యనలేడు. వేదపుంజమునందలి పదముల యొక్క అర్థమునందలి తత్త్వమునందు సంశయము లేకుండ చేసినవాడు. అది యెట్లు చేయబడినదో శంకరభగవత్పాదులవారి భాష్యమువలన విస్పష్టమగును.

తిక్కన మహాపండితుడు. వేదాంతశాస్త్రమును సర్వంకషముగ చదివినవాడు. ప్రాంశుపయోదనీలతనుభాసితు - అని యొక పాఠము, ప్రాంశుబయోదనీలతను భాసితు- అని మరియొకపాఠము.

ప్రాంశువనగా ఎత్తైన పురుషుడు. వ్యాసుడు ప్రాంశుపయోదనీలతను భాసితుడు అని చెప్పవలయును లేదా ప్రాంశు ఎత్తైనమేఘమువలె నల్లనిశరీరముచేత ప్రకాశించువాడు అని చెప్పవలె. ఎత్తైనమేఘమనగా నేమి? ఆకాశములో మిక్కిలి ఎత్తుగా నున్న మేఘమో! పెద్ద నల్లగా ఉండదేమా! మేఘ మడ్డముగా వ్యాపించునుగాని నిలువుగా వ్యాపించునా? దాని నిలువు మనకు తెలియదు. కనుక "ప్రాంశుఃబయోదనీల" యన్న పాఠమే సమంజసముగా నున్నదేమో! కృష్ణమృగ చర్మకృతాంబర కృత్యు-కృష్ణ మృగము - అది ఒక జాతి లేడి - నల్లగానుండును. దాని చర్మముచేత చేయబడిన వస్త్రకృత్యము కలవాడు. వస్త్రకృత్యమనగా శరీరమును కప్పుకొనుట. అదిచేసినవాడు అనగా కృష్ణమృగ చర్మమునే ధరించును. వేఱు నూలుబట్టలుగాని పట్టుబట్టలుగాని కట్టడు. భారతీవంశ వివర్ధనుడు - యీ మాటను వ్రాసినవాడు తిక్కనగా రొక్కడే! ఇది యొక యాశ్చర్యమైన మాట. భారతీయనగా సరస్వతి - ఆమెయొక్క వంశమును వృద్ధిపొందిన వాడట! భారతి బ్రహ్మదేవుని భార్య, వారి సంతానము వసిష్టమహర్షి. సరస్వతీదేవియొక్క సర్వతేజస్సు. విద్యారూపమున వసిష్ఠునికి సంక్రమించినది. ఆయన కుమారుడు శక్తి. శక్తి కుమారుడు పరాశరుడు. పరాశరుని కుమారుడు వ్యాసుడు. ఆశారదాదేవియొక్క విజ్ఞానమంతయు యంతయు వ్యాసునకు పరంపరయా సంక్రమించినది. ఆవిద్యను వ్యాసమహర్షి వృద్ధిపొందించినాడు. ఎట్లు? బ్రహ్మ సూత్రములు వ్రాయుటచేత. భగవద్గీత వ్రాయుటచేత ఇది భారతీవంశము. తద్విద్యా సర్వస్వము గ్రథనము చేసి వ్యాసమహర్షి దానిని వివర్ధనము చేసినాడు.

ఇట్లుండగా వ్యాసునికుమారుడైన శుకమహర్షియందు నీవిద్య పండినది. శంకరాచార్యునియందు భాష్యరూపము పొందినది. విద్యావివర్ధనుడు మాత్రము వ్యాసమహర్షి. భారతి - వసిష్ఠుడు - శక్తి - పరాశరుడు - వ్యాసుడు - శుకుడు - గౌడపాదాచార్యులు - గోవింద భగవత్పాదాచార్యులవారు - శంకరభగవత్పాదాచార్యులవారు - ఇది భారతీవంశము.

సంజయుడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధము చెప్పబోవుచు సంజయుడు వ్యాసమహర్షిని గూర్చి చేసిన స్తోత్ర మీపద్యము."

| *గ్రంథకర్త:* గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు) |
|---|

'ప్రాంశుదయోదనీల' లోని 'భారతీవంశవివర్ధను' 'అంబనవాంబు' పద్యములోని 'భారతీ' పదప్రయోగములు నన్నయగారి 'అమలినతారకా' పద్యమునందలి 'భారత భారతీ' ప్రయోగమును 'భారతభారతీశుభగభస్తి చయంబుల' అను వ్యాసముని వర్ణనమునకు 'అస్థిమాల' పదములు 'ఆవనజాననం' (2-2-216) ఎత్తుగడ కలిగిన నన్నయ పద్యములోని 'రాజసూయావభృదంబునందు' అను పదమును తిక్కన ఉద్యోగ పర్వములోని నీవు సుభద్ర కంటె (5-3-10) పద్యమునందు అదేవిధముగ ప్రయోగించి యున్నాడు. చూడుడు.

ఉ॥ ఆవనజాననం గురుకులాపశదుండు గడంగి రాజసూ
యావబృదంబునందు వసుధామర మంత్ర పవిత్రవారిధా
రావళిఁజేసి పావనములైన శిరోజములం దెమల్చి పా
పావహుఁడీడ్చి తెచ్చె సభ కందఱు సంభ్రమమంది చూడగన్ (2-2-216)

ఉ॥ నీవుసుభద్రకంటెఁగడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టినను 'బంకజనాభ యొకండు రాజసూ
యావభృదంబునందు శుచియై పెనుపొందినవేణి వట్టి యీ
యేవురుఁజూడగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే

'ఆ'వనజాననంయందు 'ఆ'పదముతో ఎత్తుగడ కలిగినందున ఈక్రింది తిక్కన పద్యముకూడ 'అస్థిమాల'యే.

ఉ॥ ఆ సభఁకేకవస్త్ర యగు నట్టి ననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసనుఁజూచుచుం బతుల సంభ్రములై తగుచేష్టలేక నా
యాసలు మాని చిత్రములయాకృతి నున్నయెడం ముకుంద వి
శ్వాసముతోడ నిం గొలువవచ్చె మనం బదియుం దలంపవే (5-3-111)

ఇట్లే 'భవదాజ్ఞ'ప్రయోగ ఎత్తుబడిపదముతో గల నన్నయపద్యమునకు విరాట పర్వములోని 'అస్థిమాల'నుచూడుడు. (3-1-211)

క॥ భవదాజ్ఞానిగళంబునఁ, దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర నీ
యవరజు లిడుములఁబడి కడుఁ,జివికిరి చెఱబడిన సింహశిశువులభంగిన్.

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

మ॥ భవదాజ్ఞా దృఢబంధసంయమిత శుంభద్వేగమై కాక నాఁ
డవలీలన్ మన యర్జునద్విపము క్రోధావేశదుర్దాంత ద
ర్పవిలాసోద్భటభంగి నే పదరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్క వ్రేల్మిడిన నీకున్ వేడ్క సంధిల్లగన్ (4-1-56)

'భాగ్యము గాదె' తిక్కన విరాటపర్వ ఎత్తుగడతో అరణ్యపర్వ శేషమున ఉన్న క్రింది పద్యము 'తిక్కన రచనను స్పష్టపరచును.

ఉ॥ భాగ్యముగాదె నీచరణపద్మము లెప్పుడుఁజేరి కొల్వగా
యోగ్యత గల్గెనేని నను నొక్కనినొల్లవొ కామసౌఖ్యవై
రాగ్యము నీమనంబునఁ దిరంబొ నిజం బెఱుగంగ జెప్పు సౌ
భాగ్యముగుందునే మగలపై నొకయించుక చూడ్కినిల్పినన్ (4-2-252)

ఉ॥ భాగ్యముగాదె కౌరవనృపాల భవన్మఖ మిష్ట సత్క్రియా
యోగ్యత నిర్వికల్పముగ నొందె సమాప్తి; నశేషధాత్రియున్
భోగ్యమ నీకు నింక రణభూమి బృథాసుతులన్ జయించి స
మ్యగ్యశశాలివై భువనమాన్య యొనర్పుము రాజసూయమున్ (3-6-92)

## ★అరణ్యపర్వశేష ఎత్తుగడలు తిక్కనవే★

'కావున' అను ఎత్తుగడ (1-1-101, 137, 2-149, 3-148, 169, 1-4-67; 1-5-10, 112, 6-120, 148, 153, 259; 7-147; 8-28, 124, 160, 311) (2-1-132; 2-274) (3-1-24; 2-76; 3-261) లందు వచనముఎత్తుగడగను, (1-3-105; 4-97, 238) (3-4-32) లందు కందపద్యముగను నన్నయ రెండువిధములుగనే రచించెను. కాని అరణ్య పర్వశేషమునందు(3-4-165, 385)లందు ఏకపదవచనములుగను, 3-4-224; 5-46, 143; 6-18, 35, 7-234, 247, 331, 422) లందు 'కావున' వచనము ఎత్తుగడతోను (3-5-298,316ఫ 7-238)ల యందు కందపద్యముగను; (3-6-54;7-299)ల యందు ఉత్పలమాల పద్యముగను నాలుగువిధములుగ కనబడును.

తిక్కన విరాటపర్వమునందే (4-1-239; 2-255, 3-65, 4-42; 5-146)ల యందు 'కావున' ఏకపదవచనములుగను (4-1-120, 326; 2-68, 182, 203;

3-105; 4-108)లయందు ఎత్తుగడవచనములుగను (4-1-113; 2-287)లయందు కందపద్యముగను (4-1-30, 166; 2-228; 3-233) లయందు ఉత్పలమాలపద్యముగను నాలుగువిధములుగ రచించియున్నాడు.

'కావున' ఏకపదవచనముల రచన, ఉత్పలమాల ఎత్తుగడలు అరణ్యపర్వశేషమున నన్నయవి కావని, తిక్కన రచనవని గ్రహింపవచ్చును.

ఈసందర్భమున 'కావున' ఉత్పలమాల ఎత్తుగడలు ఎఱ్ఱన రచనలో కలవు కాని. 'కావున' ఏకపద వచనములు ఎఱ్ఱన నృసింహపురాణమున కాని, హరివంశమున కాని ఒక్కసారియైనను ప్రయోగింపలేదు.

'తదనంతరంబ' అను ఎత్తుగడవచనములలో మాత్రమే నన్నయ (1-6-164) (2-1-103) యందు ప్రయోగించియున్నాడు.

అరణ్య పర్వశేషమునందు (3-4-226, 244; 5-268; 6-349; 7-77)ల యందు ఏకపదవచనములుగను, (3-4-255, 5-378; 6-368; 7-56, 155, 214, 402)ల యందు ఎత్తుగడ వచనములుగను కలవు.

విరాటపర్వముననే (4-1-26; 2-317, 3-26, 195; 5-396)ల యందు 'తదనంతరంబ' ఏకపదవచనములును (4-1-147, 171; 4-170)ల యందు 'తదనంతరంబ' ఎత్తుగడ వచనములుగను కలవు. (4-1-289, 3-155)ల వచనములు చివరి పదముగ 'తదనంతరంబ' కలదు. 'తదనంతరంబ' (15-2-62) (16-1-148, 152)ల యందు కందపద్యములుగను (16-1-75) సీసపద్యముగను ఎత్తుగడగ నున్నది.

తిరిగి తిరిగి ప్రయోగింపబడిన ఈ క్రింది అరణ్యపర్వశేషమునందు క్రొత్తగా కనబడు ఎత్తుగడలు, తిక్కన రచనయందు ప్రయోగింపబడియుండుట చూడగలము- చూడుడు.

| ఎత్తుగడ | అరణ్యపర్వశేషమున కనబడుచోటు | తిక్కన రచనలో కనబడుచోటు |
|---|---|---|
| అకట | క॥ 3-5-408 | 12-4-439 |
| అకట | సీ॥ 3-6-408 | (13-5-353)(14-3-87) |

| | | |
|---|---|---|
| అకట | | చ॥ (6-1-186)(7-1-109)(9-2-363) |
| అకట | | తే॥ (12-3-246) (4-4-18) |
| అకట | | ఆ॥ (4-1-151,2-177;4-18,177)(6-3-287) |
| అకటకట | క॥ 3-6-20 | (11-2-85) |
| అగుగాక | క॥ 3-5-248,338;6-69 | (8-1-217)(14-3-37) |
| అధిప | సీ॥ 3-4-391 | (7-1-62;3-29)(12-1-246;6-82) 13-2-405 |
| అధిప | తే॥ 3-5-164 | (6-1-17,142,230)(7-3-205) |
| | | (8-3-363)(12-1-135;2-228;5-391) |
| అధిప | ఆ॥ (3-6-367,7-207) | (6-1-30,67;2-350)(12-1-27)(13-2-396) |
| అనవిని | క॥ 3-6-293 | (4-4-178)(5-2-53,3-128,315;4-276) |
| అనవిని | | చ॥ (4-5-349) (5-3-68,158,207, 344) |
| అనవిని | | సీ॥ (16-1-217,223) |
| అనుటయు | చ॥ (3-4-193,348) | (4-1-287;3-125;4-35;5-235) |
| అనుటయు | వ॥ (3-4-197,3-5-32,7-196,240,385) | (4-4-140) |
| అనుటయు | క॥ (3-7-392) | (4-1-221,315;4-264;5-115) |
| ఏకపదవచనము 'అనుటయు' | | (8-3-398)(9-2-67) |
| అనుడు | సీ॥ 3-4-362 | (13-2-36;3-245) |
| అనుడు | చ॥ 3-7-5 | (5-1-154,2-97,3-409)(6-1-7,220) |
| అనుడు | | క॥ (4-1-99)(5-3-218,401) |
| అనుడు | | ఆ॥ (4-1-266)(7-4-280)(9-2-45) |
| అనుడు | | తే॥ (4-2-56) (5-2-4;3-386) |
| ఆలోనన | వ॥ (3-6-8) | 7-4-195 |
| ఆలోనన | | క॥ (7-4-29,230,5-51)(8-1-184)(9-1-321) |
| ఇవ్విధంబున | తే॥ 3-4-306 | 4-2-59,3-113,5-184,(5-4-159) |
| | | (7-3-100)(8-2-158)(10-1-140) |
| ఇవ్విధంబున | వ॥ 3-5-205,285,392;6-120 | (4-1-115,248,307; 2-18,20,107,294, |
| | | 3-30,72,183,201;4-168,244 |
| ఏకపదవచనము 'ఇవ్విధంబున' | 3-6-379 | (6-2-189,254,)(7-3-150,5-186)(8-2-233) |
| | | (9-1-144,165,269,301)(10-2-100) |
| | | (13-1-248, 2-438) |

గ్రంథకర్త: గోపీనాథ శ్రీనివాసమూర్తి (గోపీనాథ వేంకటకవి మనుమని మనుమడు)

| | |
|---|---|
| ఇవ్విధంబు | ఆ॥ 12-1-177 |
| ఇవ్విధమున | 44-2-349 |
| నాచిని క॥ (3-5-358) | 13-5-135 |
| నాచిని | ఉ॥ 5-1-328 |
| నావుడు క॥ (3-7-226, 432) | (5-2-227, 243; 4-78) |
| | ఉ॥ (5-3-324, 3-61) |

పైవాటిని సూక్ష్మముగా పరిశీలించిన 'అకట', 'అకటకట' స్త్రీ పర్వమునందును దాని తర్వాతనే ప్రయోగింపబడి యున్నవి. అట్లే 'అనుడు' సీసపద్యమున కూడ అనుశాసిక పర్వముననే ప్రయోగింపబడియున్నది. కనుక విరాటపర్వమును ప్రారంభించిన తిక్కన కొన్ని కొన్ని పర్వములలో కొన్నికొన్నిప్రత్యేక ఎత్తుగడలు ప్రయోగించుచు అరణ్యపర్వశేషమున వానినన్నిటిని ప్రయోగించియున్నాడని భావింపవచ్చును.

ఇది దగునే దశానన(3-7-140) అను అరణ్యపర్వ సంబోధనవంటి సంబోధన 'ఇటు దగునే' సుయోధన(9-9-257) అని శల్యపర్వమందును 'ఏమేమి', 'చూచితె లక్ష్మణ' 'అమ్మలార' 'ఓ అయ్యలార' 'ఎఱుగవుగాక', 'తగునే' వంటి ఎత్తుగడ ప్రయోగములు అరణ్యపర్వశేషమందును, తిక్కనరచనయందును కనవచ్చును. 'వింతలేక చూచి దరహాసము దళుక్రొత్తంగన్' అను(4-1-14) విరాటపర్వ 'వింత' శబ్దమును 'అల్లని నవ్వున తనవదనము వింతచెన్ను దలకొనగా(3-4-260) అని అరణ్యపర్వశేషమున చూడవచ్చును.

**★అరణ్యపర్వశేషకథ తిక్కనదే★**

నన్నయ అరణ్యపర్వమున నలచరిత్రమును వ్రాయుచు మొదటి, మూడవ పాదములు పద్యమునందు ఒకేపదజాలముగ నుండునట్లు రచించినాడు చూడుడు

ఉ॥ వారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారమునం గృశుండయిన బ్రాహ్మణు, డీలతాంగిఁబెండ్లియై
వారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారము దాల్చియుండుమని పంపక మిన్నకయుండనేర్చునే? (3-2-327)

అపై పద్యపు 'అస్థిమాల' పద్యముగా తలంచునట్లు తిక్కన మొదటి పాదమున మాత్రమే ఆపదజాలమును ఉంచి మిగత మూడుపాదములు తను కర్ణుడు ఘోషయాత్రకై ప్రోత్సహించు సందర్భమున రచించినాడు. చూడుడు

ఉ॥ నారలుగట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులో విప
ద్భారము నొంది వందురిన ఫల్గున నుజ్జ్వల రాజ్యవైభవో
దారులమై కనుంగొను ముదంబునఁబొందగఁ గాంచుకంటె నిం
పారగ నొండుగల్గునె కృతార్థత యెందును గౌరవేశ్వరా (3-5-349)

నన్నయగారు పద్యపు మొదటి రెండు పాదములు మరొక పద్యమున కూడ అట్లే ఉండునట్లు(1-5-239,245) ఏకలవ్యవృత్తాంతమున రచించియున్నాడు. అది చూచి తిక్కన నన్నయగారి పద్యమునొకదానిలోని రెండు పాదలను గ్రహించి మరిరెండుపాదములను తను రచించినచో అరణ్యపర్వము సగమునన్నయ,సగముతిక్కన రచించినట్లు ధ్వనించునను ఉద్దేశ్యముతో కాబోలు శిశుపాలవధవృత్తాంతమునందు నన్నయ సైన్యమును నదితో పోల్చిన విషయములను సముద్రమున కన్వయించుచు ఆపద్యమును 'అస్థిమాల'గ ధ్వనించునట్లు రచించినాడు.

చ॥ రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్చటుల సైనికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణి భోజకుకురాంధక వాహినియుం గలంగె ని
ర్దయతర రోషమారుతనితాంతసమీరితమై క్షణంబునన్ (2-2-33)

చ॥ రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్చటుల సైనిక మత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబునఁ దద్దయుబొంగె బ్రస్ఫుర
ద్భయద మనోహర ప్రకటభంగులఁ దద్భటవార్థి యుద్ధతిన్ (3-6-58)

'రయవిచలత్తురంగ' పద్యము సభా, అరణ్యపర్వశేషమున రచించిన సంకేతమా అనునట్లు వరుసగా ఉన్న విరాట, ఉద్యోగపర్వములలో (4-4-234) మఱియు (5-3-85)యందు 'వచ్చినవాడు ఫల్గును 'పద్యమును రచించి తనదిగా కళారూపమున ధ్వనించినాడు.

నన్నయ'అస్థిమాల'గా రచించిన పైరెండవపద్యము నన్నయరచనము కాదని, తనదని ధ్వనించుటకు అరణ్యపర్వశేషముననే ఇంద్రుడు కేశి అను రాక్షసుని పారద్రోలు సందర్భమున తను రచించిన 'ఓరిదురాత్మ' అను పద్యములోని మొదటి రెండు

పాదములను రావణుడు సీతాదేవిని దొంగిలించుకొని పోవునపుడు జటాయువు ఎదుర్కొను సందర్భమున తిరిగి రచించి పైపద్యములను 'అస్థిమాల' పద్యములుగ తన కళచే ధ్వనించినాడు. చూడుడు (3-5-179)(3-6-346).

ఉ॥ 'ఓరి దురాత్మ! యీయబల నోడక యేటికిఁబట్టినాడ? వం
భోరుహనేత్ర విడ్వు! మెటవోయినఁబ్రాణము గొందు, నింక బ్ర
స్ఫారమహీధర ప్రకరభంగవిహార ధురీణ ముగ్రదై
త్యారుణరంజితోగ్రకులిశాస్త్రము సుమ్మిదె' యంచు తాకినన్ (3-5-179)

ఉ॥ 'ఓరి దురాత్మ! యీయబల నోడక యేటికిఁబట్టినాడ? వం
భోరుహనేత్ర విడ్వు, మెటవోయినఁబ్రాణము గొందునింకను
గ్రారి విభేదివిక్రము జటాయునెఱుంగవె' యంచు దర్పదు
ర్వారుఁడు వీఁకదాకె సురవర్గ విఘాతకు నద్దశాననున్.

'చతురంబోధి పరీత భూవలయమున్' (1-3-93) అను నన్నయ పదజాలమున కొంతమార్చి 'చతురంబోధిపరీతక్షితితల' అని 'అస్థిమాల'గ (3-4-160) అరణ్యపర్వశేషమున ప్రయోగించినాడు. ఇట్లే 'శరధి పరివేష్టిత క్షితి' (అశ్వ 1-22)(శల్య2-362) అని భారతమున ప్రయోగించియున్నాడు. 'నీయింద్రియజయము గీర్తనీయము తండ్రీ' (3-1-366) అను నన్నయపదజాలమును 'అస్థిమాల'గ 'నీపుణ్యచరిత్ర గీర్తనీయము తల్లీ" (3-7-274) అని అరణ్యపర్వశేషమున ప్రయోగించినాడు.

పుడమియు రాజ్యంబుగోల్పడి (3-1-76) అన్న నన్నయ కందపద్యమునకు 'అస్థిమాల'గరచించిన పద్యమే 'ఆలిని రాజ్యము గోల్పడి' (3-6-377) అనుఅరణ్యపర్వశేష కందపద్యము. అరణ్యపర్వశేష పదప్రయోగము కూడ తిక్కన రచనను సూచించును.

**★అరణ్యపర్వశేషపదప్రయోగము తిక్కనదే★**

ఉవ్వెత్తు: క॥ అఱువది కోటులు గపివరు లుఱక జగత్త్రయము నొకటనువ్వెత్తు గొనం భా(3-7-36) ఆ॥ కవలవారు గొడుకుగమియు బాంచాలవర్గంబు వృష్టివరులుఁ గడగిరేని; నొక్కమాత్రలోన నువ్వెత్తుగొనరె భా(5-1-29)

తేకువ : క॥ కడుమృదువు లనుచుఁదేఁకువసెడి యెపుడుఁ జరింప(3-5-305) ఉ॥ అల్లనయింతి యిట్లనియె నారసి వాసవుకల్మిలేమియుం, దెల్లముగా నెఱింగికొని తేఁకువ లేకిట వచ్చుటొప్పు (భా 5-1-165)

నడికిరేయి : సీ॥ అతడును దద్భావ మరయంగ మదిఁగోరి రూపించి యొకమరి రేపవత్తు నని పోయి నడికిరే యర్థితోఁజనుదెంచు (భా 3-7-322) ఆ॥ నడికిరేయి వచ్చి నను నొవ్వ బలికిన గలుగునయ్య జయము (భా 6-3-182)

చేయలంతి : మ॥ పఱచున్ దవ్వుగఁ జేయలంతి నిలుచుం భా (3-6-327) క॥ చేయలఁతిం గని సమరము సేయుము భా (7-4-243) క॥ అడి బీర ముడిగి రాక్షస! చెడక మరలిపొమ్ము; నీకు జేయలతిఁయె యీ యెడ (నిర్వ. రా 4-84)

పరపు : ఉ॥ తేనెలు గ్రోలిక్రోలి కడుఁదియ్యని కమ్మని పండు లింపు సొంపూనఁగ నాని యాని పరపొందిన నీడలు మెచ్చి మెచ్చి (3-7-11) క॥ సురనది తీరంబునఁ గడుఁ బరపగు తనదండు విడియఁ బనుచుచు (నిర్వ రా. 9-101)

పొనుగు పడు : క॥ విను నా కీర్తి జగంబులఁ బొనుగుపడియె (భా 3-5-152) తే॥ అమరపతి నందనుఁడు పాడవడగి చనిన, నసురమాయ నుడివోయె: నట్లకాదె; యడరి దరికొని మండు తీవ్రానలంబు, పుడుక లెడ గల్గవైచినఁ బొనుఁగువడదె (ని.రా 6-110)

ఎరియు : తే॥ అతుల సౌభాగ్యభోగ సమగ్ర మహిమ, నొప్పుచున్న నీదేవుల యొప్పుసూచి, ధృతి దఱిఁగి తన్నుఁదాన, నిందించుకోనుచు, హృదయమున, బాండవంగన యెరియవలదె (భా 3-5-350). క॥ సుకుమారుఁడతఁడు గోపా,లకవృత్తి వహించి యడవులం గ్రుమ్మరు చు,, న్కికి నాక కాదు పగవా,రికి నైన నకట మన మెరియదే వగలన్ భా (4-2-210)

రిత్త : ఆ॥ మహితకమలమధురమధుర రసాస్వాగన, పరవశాత్మయైన బ్రమరకాంత; రిత్తబుద్ధి నకట రేగుబువ్వులరసం బానునెట్లు (3-6-341) క॥ రిత్త యుపచారముల నేనుత్తముఁడగు ధర్మతనయు నుడికించితి (5-2-82)

తురుష్క : వివిధ వ్యాఘ్రమృగోరగాకుములై విస్తీర్ణశూన్యాటవీ నివహాభీలములై యరాజకములై నిర్మూలధర్మంబులైద్రవిడాభీరతురుష్క బర్బర పుళిందవ్యాప్తి దుష్టంబులై భువిలో నెల్లెడఁ బాడుగున్ జనపదంబుల్ దద్యుగాంతంబునన్ (3-4-289)

పై తురుష్క పదము నన్నయగారి ప్రయోగమునుండి గ్రహించినది, కనుక యిది 'అస్థిమాల'ప్రయోగము. నన్నయ రచించినదే అని పాఠకులకు నమ్మకముగ రచించిన ప్రయోగము నన్నయవచనములు (2-1-235 మఱియు 2-2-113)

| *గ్రంథకర్త:* గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు) |
|---|

వ॥ మఱియు నయ్యుధిష్ఠిరున... మఱియు మేరుమందర మధ్యకీచక వనవాసులయిన
- కుళిందపారదబర్బర తురుష్కటెంకణ కోంకణాధిపతులును (2-2-113)

★రచనాసూక్తులు తిక్కనవే★

ఈ క్రింద ఉదహరించిన పద్యముల తీరు తిక్కన రచనను స్ఫురింపచేయును.

1. ఇంద్రుడు కవచకుండలములు దానమును పొందుటకై విప్రవేషమున వచ్చుచున్నాడని, దాని నర్జుననకిచ్చి నిన్ను చంప చూచుచున్నారని సూర్యుడు కర్ణునితో చెప్పగా కర్ణుడు 'సడికంటే చావు మే'లను సూక్తిని చెప్పనట్లు అరణ్యపర్వశేషమున యిట్లున్నది.

ఆ॥ కీర్తి విడువజాల గీర్తితో మెలగంగ, జావు వచ్చెనేని చత్తుగాని
జగములలోనవెల్ల సడికంటె చావు మేలనగ బరఁగుమాట యనఘవినమె(3-7-293)

పైసూక్తి లోకాపవాదమునకై రాముడు సీతను విడనాడు సందర్భమున యిట్లు నిర్వచనోత్తర రామాయణమున తిక్కన రచించియున్నాడు (ని.రా 8-119).

క॥ జడమతులయిన జనంబుల,వెడమాటలు మాన్ప నిదియ వెరవెబ్బంగిన్
సడికంటెఁ జావు మే లని, యెడి పలుకు దలంపవలదె యిల బురుషులకున్

2. సావిత్రి సత్యవంతుల వృత్తాంతమున మద్రేశుడైన అశ్వపతి సత్యవంతుని తండ్రితో చెప్పిన క్రింది పద్యము పరస్పరము అనురూపవంతులని యిట్లు చెప్పను.

తే॥ నీ కొడుకు సత్యవంతున,కీ కన్నియ దగునరేంద్ర యీకన్నియకున్
నీకొడుకు దగు ననన్యగు,ణాకరు లియ్యిరువురును సమంచితమూర్తుల్(భా 3-7-190)

రావణుడు దేవతలు మునులను బాధించుట వినిన కుబేరుడు, దూతను పంపి రావణునికి బుద్ధి చెప్పింపగా; రావణుడు కుబేరునకును, దూతకును పరస్పరము తగునని చెప్పు సందర్భమున తిక్కన యిట్లు రచించెను (ని.రా.4-32).

క॥ ఆతడు నీకుం దగు నీ వాతనికిం దగుదు మీర లక్కట! దొరయుం
దూతయునట! వచ్చుటయు భ, యాతురతం గఱపి ప్రోవనట! యిది పోలున్

3. ద్రౌపదిం చూచి మోహించిన సైంధవుడు ద్రౌపదితో పలికిన నిష్ఠురోక్తులను విని ద్రౌపది నీవు పాండవశ్రేష్ఠు నెదుర్కొనుట కోపపు మదపుటేనుగు దగ్గరకు వెళ్ళి

సిళ్ళు చూపుటవంటిదని చెప్పు సందర్భములోని పద్యమిది (భా 3-6-175).

మ॥ హిమవత్పాదవనాంతకేలిరతిమై నేపారి కోపారుణ
క్రమ నేత్రాంచలమై ప్రభూతమదరేఖంబైన గంధద్విపేం
ద్రము డాయంజని సిళ్లసూపుట సుమీ ధర్మాత్మునత్యుగ్రవి
క్రముఁ గౌంతేయవరిష్ఠు నీవు దొడరంగాఁజూచు టూహింపగన్

అర్జునుడు ఉత్తరుని సారధిగా చేసికొని చిత్రాంగద ప్రభృతి కురుకుమారులను నిర్జించు సందర్భమున కర్ణుడు అర్జును నెదర్కొను సందర్భములో 'యేనుంగునకు సిళ్ళు సూపినట్లు' తిక్కన ప్రయోగించియున్నాడు (4-5-81)

తే॥ అపుడు రాధేయుఁడిమ్మొయి ననుజుపాటుఁ జూచి యేనుంగునకు సిళ్ళు సూపినట్లు
నవిసి హయముల మత్స్యభూకాంతుతనయు, నేసి పండ్రెండు శరములనేసె నరుని

4. 'ఎఱిగి యెఱిగి' అను ఎత్తుగడతో నన్నయ ఒక తేటగీతి (1-4-267) పద్యమును రెండు ఆటవెలది (3-2-36) మఱియు (3-2-328) పద్యములను రచించెను. దానిని గమనించిన తిక్కన 'అస్థిమాల'గ అరణ్యపర్వశేషమునఁ 'ఎఱిగి యెఱింగి" అను ఎత్తుగడతో (3-6-315) ఒక సీసపద్యమునకు నన్నయవలె ఆటవెలదిని చేర్చి' ఎఱిగి యెఱింగి' అను ఎత్తుగడలతో రెండుచంపకమాలలను ఒకటి విరాటపర్వమునను (4-2-169)రెండవది ఉద్యోగపర్వమునందును (5-2-294) రచించితన ఉభయకావ్యప్రౌఢిని ధ్వనించెను. శూర్పణకు రామవృత్తాంతము రావణునికి చెప్పగా రావణుడిట్లనునట్లు అరణ్యపర్వశేషమున కలదు (3-6-315).

సీ॥ ఎఱిగియెఱింగి నే డెవ్వడు నిశాత, విస్ఫారశూలాగ్రంబు పయికి నుఱికె
దలయంపియం దగ్గి దరికొల్పి యెవ్వండు, నేడు నెమ్మది శయనింపజూచె
నుగ్రవిషానలం బుమియుచున్న యహీంద్రుఁ, గడగి నే డెవ్వండు గాలఁదన్నె
హుంకారఘోరమై యొదరు బెబ్బులి మీస, లుఱక యెవ్వాడు నేడూచికొనియె

ఆ॥ నిన్ను నెవ్వ డకట నేఁడిట్లు గడుభంగ,పఱిచెఁజెపుమ నాకు బద్మనయన
యాయువును సిరియును నవశంబులయ్యె నేఁ, డెవ్వనికొ తలంప నిజ్జగమున

పై సీసపద్యమునకు వ్యాసమూలమిది

కేనాస్యేవం కృతాభద్రే మామచిం త్యావమత్యచ
కశ్శూలం తీక్ష్ణ మాసాద్య సర్వగాత్రేషు సేవతే
కశ్శిరస్యగ్ని మాధాయ విస్రబ్ధ స్స్వపతే సుఖమ్
అశీవిషం ఘోరతరం పాదేన స్పృశతీ హకః సింహం
కేసరిణం క్రుద్ధం స్పృష్ట్యా దంష్ట్రా సుతిష్ఠతి (279అధ్యా-48,49,50)

(శ్లోక భావము) ఓ మంగళప్రదులారా! నన్ను లెక్కచేయక అవమానించి ఎవని చేత నీవిట్లు చేయబడితివి? తీక్ష్ణమైన శూలమును తన అన్ని అవయవముల మీద ఎవరు గ్రుచ్చుకొనుచున్నాడు? తన నెత్తిమీద అగ్నిని ఉంచుకొని నిర్భయముగా సుఖముగా ఎవడు నిద్రపోవుచున్నాడు? భయంకరమైన సర్పమును ఎవడు పాదముతో తాకుచున్నాడు? కోపించిన సింహపు కోరలను ఎవడు తాకుచున్నాడు?

'సింహకేసరిణం క్రుద్ధం స్పృష్టాదంష్ట్రాసుతిష్ఠతి' అను పాదమునకు 'హుంకారఘోరమై యొదరు బెబ్బులి మీస లుఱక యెవ్వాడు నేఁడూచికొనియె' అని తెలుగు నుడికారముతో తెలుగుచేసి నిర్వచనోత్తరరామాయణములోని క్రిందిపద్యము (6-11) నందు 'పులి మీసల నుయ్యల లూగి' అని ప్రయోగించుట గమనింపదగినది.

కll రాసొబగున నున్మత్తుం, డై సెంకంపక కడంగి యాతం డింతల్
సేసె గదె! చెడితి రిప్పులి, మీసల నుయ్యేల లూగి మెయిమెయిబోయెన్

5. 'మదభరాభిరామ' అను పదసముదాయము శల్యపర్వసీసపద్యములోనిది. చూడుడు సీll 'చంచరీకావళి..(తేll జారు భీషణరేఖలు భూరిమదభరాభిరామ యానంబులు.... గ్రక్కదలనడచె (9-1-102) పై సమాసము ఎత్తుగడతో ఆటవెలది పద్యము అరణ్యపర్వశేషమున (3-4-320) యందుయిట్లున్నది.

ఆll మదభరాభిరామ మృదులయానంబొప్ప, నల్లబొలయుచును లతాంతరములఁ
గరములీలఁగ్రమ్మ విరులు గోయుచునున్న, పువ్వుబోడినొక్కపొలితిగనియె

6. అరణ్యపర్వమున నన్నయభాగములోని (3-1-185) 'మll అవనీనాథా .......అస్మత్కరాకృష్ట శార్ఙ్గ వినిర్ముక్త నిశాత సాయక శతాగ్రచ్ఛిన్నమై' లోని సమాసము ననుసరించి 'అస్థిమాల'గ తిక్కన రచించిన (3-4-354) పద్యములోని సమాసమును గమనింపుడు. 'మll వినుడీ ..... అస్మదీయకమహాచాపోగ్రనిర్ముక్త బాణ నిపాతచ్ఛిదురాంగ రక్తజల శోణక్షోణి సంసుప్త.

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

## ★అరణ్యపర్వశేషశిల్పము తిక్కనదే★

ఈ క్రింది పద్యములు రచించిన కవి ఒకరేనా? అనిపించు క్రింది పద్యరచనలలోని సామ్యములను పరిశీలింపుడు.

1 చ॥ ఒడలు వశంబుగాదు భ్రమనొందినయట్లు మనంబు దూలెడిం
గడగి శిరంబు శూలవిశిఖ ప్రకరంబున నొంచినట్టి ద
య్యెడు నిలువంగ నోర్వ నొకయించుక సేపు శ్రమంబుదీఱ నీ
యెడ శయనింతు నావుడు సితేక్షణ మెత్తని సంభ్రమంబుతోన్ ( భా 3-7-215)

ఉ॥ డప్పిజనించె వ్రేళులపుటంబులు పొక్కదొడంగె గోళ్ళలోఁ
జిప్పిలఁజొచ్చె నెత్తురులు చిత్తము నాకు వశంబుగా
దప్పర మిచ్చటచ్చటను నాసలవచ్చితి నెంతదవ్వొకో
యిప్పటి భంగి నొక్కడుగా నేగెడు దానికి నోర్వ నెమ్మెయిన్ (భా 4-1-148)

2. క॥ గాండీవము విల్లటె యా, ఖండతనందనుఁడు విల్లుగలవాఁడట్టె
త్కాండాంబులు దివ్యములటె,యొండేటికి నతనిధనము యుర్వియుసిరియున్
(3-5-343)

ఉ॥ రాజటె రాగహీనుడటె రాజితసుందరమూర్తియట్టె వి
భ్రాజితసంపదున్నతివిభాసితవర్తనుఁడట్టె కామినీ
రాజిమనోజ్ఞభంగి చతురత్వధనుం డటె బ్రహ్మచర్యదీ
క్షాజితమన్మథుండు నటె జన్మము లిట్టివి యెండుగల్గనే (భా 12-2-103)

3. వైశంపాయనుడు తన గుఁరువుగారి వాక్యములుగా జనమేజయునకు చెప్పి యిట్లనును (12-6-476)

శా॥ విద్వన్మోదవిధాయి నిర్మలవచోవిస్ఫూర్తి విఖ్యాతు గృఁ
ష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభున్ నారాయణుంగా విప
శ్చిద్వంద్యంబగు భారతాధ్యాయనముం జేయంగ శక్తుండు ధ
ర్మాద్వైతుండు సరోజలోచనుఁడకా కన్యుండు తద్వాచ్యుడే

తిక్కన కృత్యాది వ్యాసస్తుతిగా యిట్లు రచించెను

శా॥ విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రవరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్

పైపద్యములలోని 'ద్వ'ప్రాస నన్నయ రచనను స్ఫురింపచేయుటకే చూడుడు (1-2-225).

శా॥ విద్వన్ముఖ్యుడు వేదమూర్తి త్రిజగద్విఖ్యాత తేజుండు కృ
ష్ణద్వైపాయనుఁ డేగుదెంచి సుతశిష్యబ్రహ్మసంఘంబుతో
సద్వంద్యుండు సదస్యుఁడయ్యె ననినన్ శక్యంబె వర్ణింప సా
క్షాద్విష్ణుండవ నీవు భూపతులలోఁ గౌరవ్యవంశోత్తమా

పై పద్యములందు తిక్కన ప్రదర్శించిన కళనే అరణ్యపర్వశేషరచన తనదియైనట్లు విరాటపర్వమున రచించిన 'గ్య' ప్రాసను అరణ్యపర్వశేషమున ప్రదర్శించినాడు చూడుడు. (భా 3-6-92) (భా 4-2-252).

ఉ॥ భాగ్యముగాదె కౌరవనృపాల భవన్మఖ మిష్ట సత్క్రియా
యోగ్యత నిర్వికల్పముగ నొందె సమాప్తి నశేష ధాత్రియున్
భోగ్యమ నీకు నింక రణభూమి బృథాసుతులన్ జయించి స
మ్యగ్యశశాలివై భువనమాన్య యొనర్పుము రాజసూయమున్

ఉ॥ భాగ్యముగాదె నీచరణపద్మము లెప్పుడుఁజేరి కొల్వఁగా
యోగ్యత గల్గెనేని నను నొక్కనినొల్లవొ కామసౌఖ్యవై
రాగ్యము నీ మనంబునఁదిరంబొ నిజం బెఱుగంగ జెప్పు సౌ
భాగ్యము గుందునే మగలపై నొకయించుక చూడ్కి నిల్పినన్

ఇట్టికళయందు తిక్కన నిష్ణాతు డనుటకు నన్నయగారి క్రింది పద్యములోని 'వ' ప్రాసను ప్రయోగించిన సభాపర్వమును స్ఫురణము చేయు ఉద్యోగ పర్వములోని తిక్కన పద్యము చూడుడు.

ఉ॥ ఆపఙజానవం గురుపలాపశదుండు కడంగి రాజసూ
యావబృథంబునందు వసుధామరమంత్ర పవిత్ర వారిధా

రావళిఁజేసి పావనములైన శిరోజములం దెమల్చి పా
పావహుఁ డీడ్చి తెచ్చె సభకందఱు సంభ్రమమంది చూడగన్ (2-2-216)

ఉ॥ నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టి ననుఁ బంకజనాభా యొకండు రాజసూ
యావబృథంబునందు శుచియై పెనుపొందిన వేణి బట్టి యీ
యేవురుఁ జూడగా సభకు నీడ్చె కులాంగన నిట్లొనర్తురే? (5-3-110)

4. అరణ్యపర్వమాయామృగవర్ణనము (3-6-327) పోలిన పద్యమును నిర్వచనోత్తర రామాయణము (8-29) సీతారాముల ఉద్యానవనవిహారమున వర్ణించెను. పదముల విరుపులను గమనింపుడు.

మ॥ పఱచున్ దవ్వుగఁ, జేయలంతి నిలచుం, బట్టీక యాసా సలం
బిఱువోవుం, బొదలందు డిందు, బొడమున్ బిట్టుల్కి, వేదాటు గ్ర
మ్మఱి చూచుం, జెవిదార్చి నిల్చు, మలయున్ మట్టాడుఁ గ్రోడాడు నే
మఱినట్లుండు, దృణంబు మేయు నలయున్ మాయామృగంబిమ్ములన్

చ॥ అలరులఁగోయుచున్, మధుకరావళిఁజోపుచు, ఁగీరపోతకం
బుల పలువాఱు, మాటలకుఁబొంగుచు, ఁనంచల బట్ట ఁదారుచున్,
లలితమయూరనర్తనవిలాసముఁజూచుచు, బోటిపిండుతో
గలియుచు ఁబాయుచు బహుల కౌతుకవృత్తి రమించి రెల్లడన్

5.గరుత్మంతుని చరిత్రము అనుశాసనపర్వమున వ్రాయుచు తిక్కన సముద్రతీరమున విహరించు వినతకద్రువలను యిట్లు వర్ణించియున్నాడు.

సీ॥ చంచులఁజిగురాకుఁ జించి చెండాడెడు నలి, నెలుగించు గండుగోయిలల సొంపు
నలరుఁదేనియ గ్రోలి యన్నుసోలంబుల, మరియుఁతేటుల నునుమ్రోతయింపు
దని పండ్లరస మాని తమలోనఁజెలగుచుఁ, బలికెడు రాచిల్క పదువురంగు
గొలకుల కెలఁకులఁగూడి క్రీడించుచుం,డెడి నంచతండంబు నడబెడంగుఁ

తే॥ దరఁగఁదేలుచుఁబూదీవఁ దగులబడుచు, వచ్చు చిఱుగాలి సోకును మెచ్చిమెచ్చి
తగిలి కొనియాడుచును వినతయును గద్రువయును మున్నీటి చేరువనమునందు
(13-1-181)

(గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

అరణ్యపర్వమున సావిత్రీ సత్యవంతుల వనగమన విహారము యిట్లు వర్ణింపబడియున్నది. (3-7-212)

సీ॥ కమనీయ కమలినీ కల్లోలవీథులఁ,గదలు రాయంచల గతులయొప్పు
బహుపుష్పపల్లవ ప్రకరచిత్రితములై, తనరారు తరులతా తతులసొంపు
మకరందరసపాన మదవిలోలంబులై, క్రాలెడి యెలదేఁటి గముల యులివు
బరిపక్వమంజుల ఫలరసోద్ధతములై, పలుకు రాచిలుకల పటురవంబు

ఆ॥ బ్రియుఁడు వేఱువేఱ ప్రీతిమైఁజూపుచు; జెప్పుచును జనంగఁజిగురుబోఁడి
గనుచు వినుచు నిర్వికారసల్లాపంబు, లార నతని తెఱగు నరయుచుండె

వనపర్వమున పై పద్యమునకు మూల మిట్లున్నది
పావనాని విచిత్రాణి రమణీయాని సర్వశః
మయూరగణజుష్టాని దదర్శ విపులేక్షణా
నదీః పుణ్యవహాశ్చైవ పుష్పితాంశ్చ నగోత్తమాన్
సత్యవానాహ పశ్యేతి సావిత్రీం మధురం వచః
నిరీక్షమాణా భర్తారం సర్వావస్థ మనిందితా
మృతమేవహి భర్తారం కాలే మునివచఃస్మరన్
అనువ్రజన్తీ భర్తారం జగామ మృదుగామినీ
ద్విధేవ హృదయం కృత్వాతంచ కాలమవైక్షతీ (వన-30 నుండి 33 శ్లోకములు)

సీసపద్యపాదములు అనుశాసనపర్వపద్యభావమే తెలుపబడినట్లు స్పష్టము, అమూలకము. ఇట్లు వర్ణించుటనే తిక్కన ఉభయకావ్యప్రౌఢి పాటించు శిల్పమని,దానియందు తాను పారగుడనని తెలిపినట్లు భావింపవచ్చును. ఇదికూడ విరాటపర్వమునుండి స్వర్గారోహణపర్వమువరకు రచించిన తర్వాత అరణ్యపర్వరచన చేసినట్లు స్ఫురింపచేయుచున్నది.

6. విరాటపర్వ ప్రారంభమున పాండవుల ఆయుధములనుపెట్టి 'శమీవృక్ష' వర్ణనను సర్వవిధముల పోలినదే లయకాలమునందు సముద్ర ముప్పొంగువర్ణన కలిగిన అరణ్యపర్వశేషసముద్రవర్ణన (4-1-162) - (3-4-227).

సీ॥ వెగసిన కొనలేచి నింగి యంతంతకు, నవుల ద్రోవంగ దనరారుదాని
జాగినశాఖ లాశాచక్రముల కొలం,దులు బారవెట్టంగఁబొలుచుదాని

గవట లొండొంటితో గదియుచు నెడములు, మ్రింగి ప్రబ్బగ సొంపుమిగులుదాని
లోని జొంపము పవలును బెనుజీకటి, నొదివించి పొదవంగ నొప్పుదాని

తే॥ గనియె బవమాన వివిధ నర్తనకళాను,వర్తిఁ గాకఘూర్ణికారవ స్ఫూర్తిజాత
భీతి పరిసరవర్తి నాభీలభుజగ,చండమూర్తి శమీరుతరుచక్రవర్తి (4-1-162)

సీ॥ గరుసులు గడవంగఁగదలి యల్లల్లన, యొత్తుచు నెడముల నుత్తరించి
వేడుకఁజేతులు విచ్చి యాడెడునట్లు, లోలోర్మి పంక్తుల గ్రాలిక్రాలి
ప్రచురహాసస్ఫూర్తి పచరించు విధమున, నురుఫేనరుచులఁదెరలు గవిసి
యురువడి వర్ధిల్లుచున్న జలంబులచే, బొంగారి దెసలెల్ల మ్రింగికొనుచు

ఆ॥ ప్రబల విలయకాలపటురయబహుళ సమీరణౌఘ దుర్నివారమగుచు
నుగ్రభంగిగాఁ బయోనిధు లొక్కటఁబెల్లురేగి జగము వెల్లివాడిచె (3-4-227)

పై రెండు సీసపద్యములు ఒకే కవికృతములా అనునట్లు ఒక పర్వ పద్యమునందు తేటగీతి ఎత్తుగడ మరియొక పర్వమున ఆటవెలది యెత్తుగడలతో 'అరణ్యపర్వశేషము రచించుట నాభాగ్యము కదా!, విరాటపర్వరచన అరణ్యపర్వరచన చేసిన కవిదే అని తెల్లముచేయుటలేదా?'అని పాఠకులను ప్రశ్నించునట్లు కథానుగుణముగ రచించిన క్రింది సీసములను చూడుడు. ఇందు ధర్మరాజు, అడవులలో తమ వెంటనున్న భూసురోత్తములకు, శ్రీకృష్ణుడు ధర్మరాజుతో చెప్పినట్లు రచించిన పద్యములు (4-1-47) - (3-4-153).

సీ॥ తెల్లంబుగాదె మీకెల్ల సుయోధను, చేసిన కుటిల విచేష్టితంబు
లకట మాతో మీరు నడవుల నిడుమల, బొందితి రొకభంగిబోయె గాల
మిది పదుమూఁడగు నేడు మా కజ్ఞాత,వాసంబు సలుపంగవలయు నిందు
ధార్తరాష్ట్రులు సూతతనయ సౌబలును, జెఱుపన వేతురు చిన్నసన్న

ఆ॥ యెఱిగిరేనిఁ జాలనెగ్గు వాటిల్లు న,ట్లగుట మమ్ము నింక నతిరహస్య
వృత్తిమై నిరస్తవిఘ్నులరై చరి,యింపుఁడని యనుగ్రహింపవలయు

సీ॥ భాగ్యంబుగాదె యీ పార్థుండు హరుడాది,యైన నిర్జరసమూహంబు వలన
నెలమిఁ గృతాస్త్రుఁడై యేతెంచు టరయంగ, ధన్యుండ వైతీవు ధర్మతనయ

నీ ధర్మనిష్ఠయు నీ తపంబును జూవె, యింతకుఁగారణం బిద్ధ చరిత
రాజ్యంబు కంటెను రాజేంద్ర ధర్మంబ, యిష్టమై పరగు నీ కెల్లనాడు

తే॥ వేదవేదాంగవిదుడవు వివిధయజ్ఞ,కర్తవైతి ధనుర్వేదకర్మకుడవు
ధరణి యెల్ల నేలెడి రాజధర్మ మమర, సులభమయ్యె నీ కిహ పరశోభనములు

పై రెండు పద్యములందు భావసామ్యము లేకున్నను, రెండును విరాటపర్వ, అరణ్యపర్వశేష ప్రథమములలో నుండుటవలన మొదటిఎత్తుగడ మాత్రమే పై భావస్ఫురణకు దోహద మిచ్చుచున్నది. పై 'భాగ్యంబుగాదె' పద్యమునందు కేవలవళి నియమము పాటింపబడినది. ఇది నన్నయ 'అస్థిమాల'గ గుర్తుచేయును. అరణ్యపర్వశేషమున 'అస్థిమాల'గ రచింపబడిన ఒకేఒక మధ్యాక్కర అరణ్యపర్వ శేషమున కంతటకును ఉన్న విధముగా నున్నట్లు ఈపద్యము శోభిల్లుచున్నది.

7. కర్ణవృత్తాంతము ఆది పర్వమునందు నన్నయ గారును, ఉద్యోగపర్వ, శాంతిపర్వ, ఆశ్రమవాసపర్వములలో తిక్కన రచించి యున్నాడు. కర్ణజననము అరణ్యపర్వశేషమున తిక్కనవలెనే సహజరీతిగ జన్మించినట్లే పై పర్వములలో ప్రయోగించిన కొన్ని పదములు మూర్త్యంతరంబు, కన్యావికలత్వము, దేవరహస్యము వర్ణింపబడియున్నది. నన్నయగారి ఆదిపర్వములో మాత్రము సద్యోగర్భమని యున్నది. అంతేకాక కర్ణపర్వమునందు కర్ణుడు దానమిచ్చురీతి చెప్పబడిన విషయమునే అరణ్యపర్వ శేషమున చెప్పియుండుట కూడ అరణ్యపర్వశేషము తిక్కన రచనమని గూఢముగ తెలుపును చూడుడు (8-2-30) - (3-7-359).

సీ॥ వలను శోభిల్ల నెవ్వడైన వీడె యర్జునుఁడని నా కిప్డు సూపెనేని
బసదనం బే నిచ్చుభంగి యందఱకును, వివరించి చెప్పెద వినుడు మీరు
పొగడంగఁ దగు రథ్యముల తోడి సౌవర్ణ, రథములు వలసిన రయము లావు
బొలుపును గలుగు కాంభోజహయంబుల, వలసిన బేర్చు సత్త్వంబునందు

తే॥ బరిణతములగు సుందర కరివరముల, వలసినను జారులావణ్యవతుల వలసి
నను మహాగ్రామములు వలసినను గోర్కి, కెక్కు డమ్మేటిమగని కే నిచ్చువాడ.

చ॥ అలసవిలాసలాలస రసాన్వితు లైన నితంబినీజనుల్
వలసిన భూరి సస్యపరివస్తు సమగ్రములైన గ్రామముల్

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

వలసిన నుల్లసన్మణి సువర్ణ విభూషణ గోధనావళుల్
వలసినఁ గోరు మిచ్చెద ధ్రువంబుగ నావుడు నాతఁ డిట్లనున్

పైరెండు పద్యములందలి 'వలసిన' పదప్రయోగము ఏకకవికృతమని గూఢముగ గుర్తుచేయునని, ఆ గూఢకవి శరద్భయంబున నిగూఢాకారతం వనాంతంబున దిగినట్లు చెప్పబడియుండుట ముందు తెలిసికొని యుంటిమి.

అరణ్యపర్వశేషములోని రామాయణ కథను పరిశీలించినచో క్రింది విషయములు తెలియును.

రామాయణ ఉత్తరకాండకథ షష్ఠమాశ్వాస 270 నుండి 288 వరకు (19 గద్యపద్యములు)
రామాయణ బాలకాండకథ షష్ఠమాశ్వాస 288 నుండి 292 వరకు (5 గద్యపద్యములు)
రామాయణ అయోధ్యకాండకథ షష్ఠమాశ్వాస 294 నుండి 312 వరకు (19 గద్యపద్యములు)
రామాయణ అరణ్యకాండకథ షష్ఠమాశ్వాస 312 నుండి 363వరకు (52 గద్యపద్యములు)
రామాయణ కిష్కింధకాండకథ షష్ఠమాశ్వాస 364 నుండి 387 వరకు (31 గద్యపద్యములు)
" " " సప్తమాశ్వాస 2 నుండి 8 వరకు " "
రామాయణ సుందరకాండ షష్ఠమాశ్వాస 388 నుండి 409 వరకు (47 గద్యపద్యములు)
" " సప్తమాశ్వాస 8 నుండి 33 వరకు " "
రామాయణ యుద్ధకాండము సప్తమాశ్వాస 34 నుండి 166 వరకు (133 గద్యపద్యములు)

తిక్కన నిర్వచనోత్తర రామాయణమున పూర్వరామాయణకథ ప్రథమాశ్వాసమున 64 నుండి 85 వరకు (22 గద్యపద్యములు) చెప్పబడియున్నది. తక్కిన 9 ఆశ్వాసముల కథ ఉత్తరరామాయణకథ తిక్కన రచియించియున్నాడు.

అరణ్యపర్వశేషమున పూర్వరామాయణకథ విపులముగ వర్ణించి ఉత్తర రామాయణము 19 గద్యపద్యములలో రచించి యుండుటచేతనే, తిక్కన నిర్వచనోత్తర రామాయణమున పూర్వరామాయణకథ 22 గద్యపద్యములలో రచించి ఉత్తర రామాయణము విపులముగ రచించి తన అరణ్యపర్వ శేషరచనను ధ్వనించియుండునని భావింపవచ్చును.

అరణ్యపర్వశేషమున సరస్వతీదేవి ప్రార్థనలో 'భారతీ' అని భారతకథావాణిని ఉద్దేశించెనా అనునట్లు నిర్వచనోత్తర రామాయణమున 'ఏ నిన్ను మామ యని యెడు,

దీనికి దగనిమ్ము భారతీ కన్యక' అనిన మనుమసిద్ధి పలుకు భారతమును అంకితమివ్వమని కోరగా, ప్రత్యుత్తరమివ్వక (నిర్వచనుడై) మనుమసిద్ధిని శ్రీరాముని వంశప్రభువుగా కృతినాయక వంశవర్ణనచేసి తిక్కన నిర్వచనోత్తరరామాయణము అంకితమిచ్చెనా అని ధ్వని చేయుచున్నది. దీనికి నన్నయ గారికి రాజరాజు చెప్పిన 'హిమకరుదొట్టి పూరుభరతేశకురు ప్రభుపాండు భూపతుల్, క్రమమున వంశకర్తలనగా మహినొప్పిన యన్మదీయవంశమున ఁబ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవోత్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెంతయున్' విషయము స్ఫురణకు తెచ్చుచున్నది.

సాధారణముగ రామకథ ఒకేఒక అశ్వాసమున రచించుట సముచితము. 400పద్యములు దాదాపు ఒకఅశ్వాసమునకు అధారమై యుండగా దాదాపు 310 పద్యగద్యములున్న రామాయణకథ సగము షష్ఠమాశ్వాస, సగము సప్తమాశ్వాసములుండుట రామాయణము సప్తకాండ సమన్వితమని దానిని నిర్వచనోత్తర రామాయణ సమన్వితముగా పఠించుకొనవలెనని రామపట్టాభిషేకము వరకు పూర్వరామాయణము షష్ఠపర్వమని ఉత్తరరామాయణ మొకటి ప్రత్యేకమని స్ఫురించుటకు, కళద్వారా తిక్కన ధ్వనించెనా అను సంశయము పొడసూపక మానదు. నన్నయ నలదమయంతి కథ ఒకే ఆశ్వాసమున రచించుట దీనికి బలమునిచ్చుచున్నది.

యాదృచ్ఛికముగ వచ్చిన బృహదశ్వమహామునితో ధర్మరాజు

కII పుడమియు రాజ్యము బంధుల విడిచి మృగావలులఁగలిసి విపినంబులలో
గడుకొని మాయట్లిడుమల, బడిన నరులు గలరె యొరులు పరమమునీంద్రా

అని అడుగగా బృహదశ్వ మహాముని

కII దేవసములైన యనుజులతో విప్రులతో రథాలితో వచ్చి యర
ణ్యావాసము సేసెదు ధర,ణీ వల్లభ నీవు ధర్మనిష్ఠిత బుద్ధిన్

కII నరనుతుడు దొల్లి నలుఁడను, ధరణీశుఁడు జూదమాడి తన విభవము పు
ష్కరుచేత నోటువడి యొ, క్కరుడుఁగరం బిడుమబడడె కాననభూమిన్

అని నలదమయంతి కథ విపులముగ చెప్పెను.

ఇకరామాయణము 'కామ్యకవనవాసుండై భూసురనివహంబుతో నున్న ధర్మజు పాలికి మార్కండేయుం డరుగుదెంచిన ననుజసహితంబుగాఁబ్రత్యుద్గతుండై

యమ్మునివరుం బ్రభూతసపర్యల సంతుష్టహృదయుం గావించియవ్విభుండు పాంచాలియెడ జయద్రథుండుచేసిన దుర్వ్యవసాయంబును, వానిం బరిభవించుటకునై తమపడిన యాయాసంబును నమ్మహాత్మున కెఱింగించి, మహనీయ శౌర్యధైర్యధర్మారంభ సమగ్రులమైన మా కివ్విధంబున నఖిలసామ్రాజ్యభోగవియోగంబై దుస్తరంబగు వనవాసంబు సంప్రాప్తంబయ్యె గావున విధికృతం బెవ్వనికి నెబ్బంగుల నలంఘ్యంబని తలంచెద ననిపలికి మఱియు నిట్లనియె.

తే॥ ద్రుపదనందనక్రియఁ గడుదుఃఖపడిన, నృపవధూటియు నాయట్ల నియతశోక
వనధి నిర్మగ్నుఁడైన భూవరసుతుండుఁ, గలడె వినఁజూడ ననఘ యెక్కాలమునను

వ॥ అనిన నతనికి నత్తపోనిధి యిట్లనియె

క॥ కడుదుఃఖము నొందితినని, యుడుగక యిటు వగచెదేల యుర్వీశ్వర నీ
పడు టెంతది రఘురాముడు, గడఁగి యిడుమ వడఁడె తొల్లి కాఱడవులలోన్

ఉ॥ ఆవిభుకాంతగాదె జనకాత్మజ రావణుచే గృహీతయై
పోవదె వానరప్రకరముల్ వెసఁదోడుగ నేఁగి యాధరి
త్రీవిభుఁ డబ్ధిగట్టడె వధింపడె దివ్యశరంబులన్ దశ
గ్రీవుని గ్రమ్మఱం జని యకిల్బిషరాజ్యవిభూతి నొందడే

అని రామాయణకథ ప్రారంభించును.

పై పద్యములోని ఆవిభుకాంతగాదె ఎత్తుగడ తిక్కనగారి 'భాగ్యముగాదె' (4-2-252) ఎత్తుగడ రచనను స్ఫురణకు తెచ్చుచున్నది. మిగిలిన రచనము కూడ తిక్కన రచనావిధానమునే సూచించు చున్నవి.

తిక్కన మౌసలపర్వమును నిర్వచనముగ రచించియున్నాడు. ఉత్తర రామాయణముకూడ నిర్వచనముగ రచించియున్నాడు. ఈక్రిందిపద్యములను యథాతథముగ నిర్వచనోత్తరరామాయణమునను, భారతవిరాటపర్వమునను కనవచ్చును.

భా(4-4-172) మ॥ కలగెం దోయది సప్తకంబు ని.రా (5-56)
భా(4-5-132) శా॥ శ్రావ్యంబై బెలగన్ గభీర ని.రా. (4-71)

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

ఈ క్రింది భారతపద్యములను కొలది మార్పులతో నిర్వచనోత్తర రామాయణమున చూడవచ్చును. అందు 'గుణమున' (4-5-30) యందు 'గాండీవ' బదులు 'శార్ఙ్గి' మాత్రమే మార్పు.

భా(4-5-30) గుణమున లస్తకంబునను ని.రా. (3-18)
భా(4-1-107) సీ॥ కలపంబు లభినవగంధంబులుగ ని.రా. (8-22)
భా(4-1-247) చ॥ తిగిచి కవుంగిలించి జగతీవిభు.. ని.రా. (10-47)
భా(4-2-191) క॥ చిచ్చునకుఁదోడు కరువలి ని.రా. (6-126)
భా(4-1-24) క॥ పెరుగుట స్రగ్గఁజవులం బొరయుట ని.రా. (9-75)
భా(4-3-187) మ॥ పటువేగంబున శాతభల్లచయ ని.రా (6-98)

ఈక్రింది భారతవచనముల భావము నిర్వచనోత్తరరామాయణమున పద్యరూపమున దర్శనమిచ్చును.

భా (4-3-236) వ॥ మన నగరంబునకుం.....కీలాలజలంబుల పయిం దేలుచు నవ్వినట్లున్న శిరంబు ని.రా (4-61)
భా(11-1-26) వ॥ కావున వారికి వగవంబనిలే దదియట్లుండె ని.రా (9-76)

స్త్రీ పర్వ శ్లోకభావములు అరణ్యపర్వచతుర్థాశ్వాసమున యుండుటచేతను, స్త్రీ పర్వములోని రెండు శ్లోక భావములు నిర్వచనోత్తర రామాయణమున ఉండుటచేతను తిక్కన విరాటపర్వముతో రచన ప్రారంభించి స్వర్గారోహణపర్వరచన కథాంతము తర్వాత ఫలశ్రుతి వ్రాయక హరిహరనాథ సంబోధనా పద్యమును స్వర్గారోహణ పర్వ మధ్యలో రచించి అరణ్యపర్వ చతుర్థాశ్వాసములోని నన్నయ రచనను కొనసాగించెనని భావింపవచ్చును.

నవ్వులలో వెడనవ్వు, పెడనవ్వు, పెల్చననవ్వు, నవ్వుకాని నవ్వు వంటి రకములు అరణ్య పర్వాశేషమున, తిక్కన రచనలో కలవు.

## ★అరణ్యపర్వశేష ఛందోరీతి తిక్కనదే★

పై కారణముల వలన అరణ్యపర్వశేషరచన ఎవరిదో పరిశీలించుటకు అరణ్యపర్వ శేష ఛందో రీతులను నన్నయ తిక్కన ఎఱ్ఱన రచనలతో పరిశీలితము.

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

| నన్నయ | అరణ్యపర్వశేష ఛందో వివరము | ఆ. శే.లో ఆవృత్తి సంఖ్య | తిక్కనభాగమున ఆవృత్తియైన సంఖ్య | | ఎఱ్ఱన రచన యందు ఆవృత్తియైన సంఖ్య | |
|---|---|---|---|---|---|---|
| | | | భారతము | ని.రా | నృ.పు | హ.వం. |
| 183 | ఉత్పలమాల | 128 | 696 | 172 | 116 | 259 |
| 242 | చంపకమాల | 135 | 1004 | 186 | 105 | 259 |
| 61 | మత్తేభము | 69 | 268 | 77 | 25 | 343 |
| 19 | శార్దూలము | 18 | 122 | 44 | 24 | 135 |
| 1228 | కందము | 413 | 5394 | 529 | 221 | 1361 |
| 195 | ఆటవెలది | 91 | 1022 | 100 | 26 | 60 |
| 183 | తేటగీతి | 109 | 1584 | 89 | 47 | 481 |
| 251 | సీసము | 102 | 1152 | 70 | 98 | 373 |
| | సీసంలో తే.గీ | 40 | - | 24 | 67 | 352 |
| | సీసంలో ఆ.వె | 62 | - | 46 | 31 | 21 |
| 26 | మత్తకోకిల | 13 | 8 | - | 2 | 3 |
| 25 | తరలము | 8 | 5 | 1 | - | 1 |
| 12 | తరువోజ | 2 | 5 | - | - | 3 |
| 1 | ఉత్సాహము | 2 | 7 | - | - | - |
| 1 | మధురాక్కర | 2 | - | - | - | - |
| 39 | మధ్యాక్కర | 1 | - | - | - | - |
| 2 | మహాస్రగ్ధర | 2 | 16 | 1 | 3 | 6 |
| 1 | స్రగ్ధర | 2 | 9 | - | 2 | 3 |
| 7 | మాలిని | 1 | 46 | 10 | 3 | 18 |
| - | స్రగ్విణి | 1 | 1 | - | 1 | - |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 3 | లయగ్రాహి | 1 | 4 | - | - | - |
| 1 | వనమయూరము | 1 | 1 | - | 1 | - |
| 1505 | వచనము | 492 | 4517 | - | 160 | 1377 |

అరణ్యపర్వశేషమున కనవచ్చు విశేష వృత్తములు వాటి విభజన అరణ్య పర్వశేష కథయందును, నన్నయ సారస్వతాంశ ప్రశస్తి (రాజరాజప్రశస్తి) యందును ఉన్న పద్యములసంఖ్య క్రింద చూపబడినది

| కథాంశము | మత్త కోకిల | తర లము | తరు వోజ | ఉత్సా హము | స్రగ్ధర | మహా స్రగ్ధర | మధ్యా క్కర | మదురా క్కర | లయ గ్రాహి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| రామకథ | 3 | - | 1 | 2 | 2 | 1 | - | 1 | 1 |
| ఘోషయాత్ర | 1 | 3 | - | - | - | 1 | - | - | - |
| ప్రళయ ప్రకారం | 3 | - | 1 | - | - | - | 1 | - | - |
| అరణిరక్ష | 2 | 1 | - | - | - | - | - | - | - |
| కువలయాశ్వకథ | 2 | 1 | - | - | - | - | - | - | - |
| కర్ణచరిత్ర | - | - | - | - | - | - | - | 1 | - |
| సతీసావిత్రికథ | - | 1 | - | - | - | - | - | - | - |
| కుమారస్వామి వృత్తాంతము | - | 1 | - | - | - | - | - | - | - |
| కౌశికవృత్తాంతము | 1 | - | - | - | - | - | - | - | - |
| బ్రాహ్మణ ప్రభావం | 1 | - | - | - | - | - | - | - | - |
| మొత్తము | 13 | 7 | 2 | 2 | 2 | 2 | 1 | 2 | 1 |

అశ్వాసాంతము మాలిని । స్రగ్విణి । మయూరము । తరలము । మొత్తము36

పై పట్టిక గమనించిన రామకథయందు రచించిన 7 విశేషవృత్తులు మొత్తము 9 విశేషవృత్తములలో హెచ్చు అని తెలియగలదు. నిర్వచనోత్తర రామాయణమున

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

1 తరల విశేష వృత్తమును రచించి అస్థిమాలగా అరణ్యపర్వ శేషమున నన్నయ స్మరణగా 7 తరల వృత్తములను రచించినట్లు మనము గ్రహింపగలము.

తిక్కన కరుణ రసభరితమైన స్త్రీపర్వమునందు అనేక విశేషవృత్తములను, సౌప్తికపర్వమునందు స్రగ్ధర, మహాస్రగర్ధ పద్యములను, మౌసలపర్వమును నిర్వచనముగా రచించియుండుట భారతమునందే తెలియవచ్చును.

'ఏ నిన్ను మామ యనియెడు దీనికిఁదగనిమ్ము భారతీకన్యక' అని అర్థించిన మనుమసిద్ధికి ప్రత్యుత్తర మీయక ఉత్తర రామాయణమును నిర్వచనముగ రచించుట పూర్వరామాయణ కథ కలిగిన అరణ్యపర్వశేషమును 'అస్థిమాల' అని గూఢార్థముగ. చెప్పుట, నన్నయ రాజరాజును చంద్రవంశీయునిగ పాండవుల వంశపువానిగ పేర్కొనగా తిక్కన మనమసిద్ధిని సూర్యవంశస్థుడని రామునివంశపువానిగ పేర్కొనుట ఈ సందర్భమున గుర్తుచేసికొనుట ముఖ్యము.

'కరుణారసము వొంగి తొరగెడు చాడ్పున శశిరేఖ నమృతంబు జాలువాఱ' అని హరిహరనాథుని వర్ణించిన హరపాదము అరణ్యపర్వశేషమును సూచించునః ముందు చూచితిమి. 'అస్థిమాల'గా రచించిన అరణ్యపర్వశేషమున అరణ్యపర్వమ. కరుణారస సూచితమని అరణ్యపర్వ ప్రారంభమునందలి ఎత్తుగడతోనే గ్రహింపవచ్చును చూడుడు.

"వ॥ అప్పాడవులం జూచి పౌరులెల్ల దుఃఖితులై

క॥ చనునె యధర్మద్యూతం,బున నిట్టుల పాండురాజపుత్రుల బ్రభులన్
వనగతులఁజేయ దుర్యోధన ధృతరాష్ట్రులకు విగతదయహృదయులకున్

పౌరుల దుఃఖముతో ప్రారంభమైన అరణ్యపర్వము అరణి తెచ్చుటకు వెళ్ళిన పాండవులలో సహదేవ, నకులార్జున భీములు యక్షుని మాటలు నిరాదరించి వివశహృదయులై ధర్మరాజు సమాధానములతో ధర్ముని వరప్రదాతులై మేల్కొనుటతో అంతమగుచున్నది. ఇట్టి కరుణారస ప్రధానమైన అరణ్య పర్వమున కరుణారసప్రధానమైన రామకథలో అనేక విశేషవృత్తములు వ్రాయుట తిక్కన రచనను ధ్వనించుచున్నది.

పై వివరములను పరిశీలించినచో తిక్కనయే అరణ్య పర్వశేషమును రచించెనని సూచించును. కారణము తిక్కన, నన్నయ రచించిన అరణ్యపర్వశేషములోని ఛందో

భేదపద్యములన్నియు విరాటపర్వాది తక్కిన భారతభాగములలో రచించెను కాని మధురాక్కర , మధ్యాక్కరలు మాత్రము రచింపలేదు. నిర్వచనోత్తరరామాయణమున నన్నయవలె ఆటవెలదులే తేటగీతులకంటె ఎక్కువగా రచించియున్నాడు. అంతేకాక నిర్వచనోత్తరరామాయణములోని 70 సీసములలో 46 పద్యములకు నన్నయవలె ఆటవెలదులే రచించినాడు. తిక్కనరచనారీతి అరణ్యాపర్వశేషమునకలదు.

మధురాక్కర, మధ్యాక్కరలు ఎఱ్ఱన, తిక్కనలలో ఎవరు రచించిరని తెలిసికొనవలెను. ఎఱ్ఱన నన్నయ రచించిన ఉత్సాహ, లయగ్రాహి చంధములను రచింపలేదు. కాని తిక్కన రచించియున్నాడు. 1 మధ్యాక్కర, 2 మధురాక్కరలు అస్థిమాలగా తిక్కన రచించియుండిన తిక్కన అరణ్య పర్వశేషమున కనవచ్చు చంధోరీతులన్నియు రచించునట్లు తెలియగలదు. కాని ఎఱ్ఱన విషయమున అట్లు కాదు, కనుక తిక్కనయే అరణ్య పర్వ శేషము రచించెనని భావింపవచ్చును. ఎఱ్ఱన 'తద్రచనయకా' రచించినందున మధ్యాక్కరలు నన్నయ రచనకు తగునట్లు ఎక్కువసార్లు అరణ్య పర్వశేషమున రచించియుండవలెను. ఉత్సాహ, లయగ్రాహులను కూడ రచించియుండవలెను. అట్లు లేనందున ఇది ఎఱ్ఱన రచన కాదని భావింపవచ్చును. ఇట్లు పరిశీలించినపుడు అరణ్యపర్వ శేషములోని చంధోభేదములన్నియు తిక్కన రచించినట్లు గమనింపగలము.

అరణ్యపర్వశేషములోని ఎత్తుగడ, శైలి, పదప్రయోగములు తిక్కన వలె యుండుట చేతనే పండితులందఱు నన్నయవలె ప్రారంభించి తిక్కనవలె ఎఱ్ఱనపూర్తి చేసెనని చెప్పుచున్నారు. కాని ఎఱ్ఱన అట్లు చెప్పుకొనలేదు.

అరణ్య పర్వశేషకథ చివరకు, విరాటపర్వప్రారంభముతో సరితూగునట్లు అన్వయించి రచించుట, అరణ్యపర్వశేష కడపటి శ్లోకములోని కొన్నిపదములను, అరణ్యాపర్వమున ప్రయోగింపక విరాటపర్వమున ప్రయోగించుట తిక్కన రచనమే కాని, ఎఱ్ఱనరచనము కాదని తెలియచేయగలదు.

పై చూపిన ఉపపత్తుల మూలముగ అరణ్య పర్వశేషము తిక్కనదే కాని ఎఱ్ఱనది కాదని తేటతెల్లమగును. విరాటపర్వము నుండి కేవల వచనములే చదువుచు వచ్చి తరువాత అరణ్య పర్వ శేష వచనములు మాత్రము చదివినచో తిక్కన రచనయేయని బోధపడును.

(గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

ఇప్పుడు మనము ఉపక్రమమందు గమనించిన అసంగతములు విశేషములను గుర్తు చేసుకొని పైవిషయ సముదాయముల మూలముగ సమాధాన పరచుకొందముగాక.

1. తిక్కన, ఎఱ్ఱనల రచనలను కూలంకషముగ పరామర్శించి తిక్కన తన రచనను విరాటపర్వమునుండి ప్రారంభించి స్వర్గారోహణకథవరకు రచించినాడు. స్వర్గారోహణఫలశ్రుతి వ్రాయక, హరిహరనాథుని ఆశ్వాసారంభపద్యమును రచించి హరిహరనాథుని రూపమును తనమనస్సున నిలుపుకొని (అంతస్సన్నిధి చేసుకొని) అరణ్య పర్వశేషకథను మాత్రము 'అస్థిమాల'గ అనగా నన్నయ ఆశ్వాసాంతగద్యతో నన్నయమరణస్మృతిగా ఏడు ఆశ్వాసములుగ విభజించి హరిహరనాథునకు విన్నవించినాడు.

అనగా చతుర్థాశ్వాసమధ్యవరకు రాజరాజునకు నన్నయ బహిర్గతముగ చెప్పిన కథ తర్వాతి కథ 'తత్సమయానంతరంబున' వచనమునుండి 'అస్థిమాల'గ, నన్నయ ఆశ్వాసాంత గద్యముతో తిక్కన హరిహరనాథునకు దివ్యచిత్తమున యశోదాస్తన్యముగ శ్రీపదప్రారంభముతో హరిహరనాథ సంబోధన స్వర్గారోహణపర్వమున చేసి అరణ్యపర్వచతుర్థాశ్వాసమును వృద్ధిపొందించి అవధరింపచేసినాడు. కనుకనే తిక్కన విరాటపర్వప్రారంభములో షష్ఠ్యంతములేకాక అంతస్సన్నిధి కలిగించుకొని విరాట పర్వముననే పంచమ, షష్ఠమ, సప్తమాశ్వాస కథలు విన్నవించిన సంకేతముగ మూడు హరిహరనాథ సంబోధన పద్యములను యశోదాస్తన్యముగ మధ్యఆశ్వాసములకు నిర్దేశించినవి కనుక శ్రీపదముతో మూడు పద్యములను ప్రారంభింపక రచించి, కడపటి పద్యమున మాత్రమే హరిహరనాథా అను సంబోధన జతపరచినాడు. ఈ రచన చతుర్థాశ్వాసములోని నన్నయ రచనను కొనసాగించిన చతుర్థాశ్వాసాంత కథను కలుపుటకు తిక్కన ప్రయోగించిన గూఢ ప్రయోగము. తను అంతస్సన్నిధి కలిగించి నివేదించుటచేత ఆశ్వాసాంత, ఆశ్వాసారంభ హరిహరనాథ ప్రశస్తులను వదలినట్లు చెప్పకొనినాడు. తద్వారా కథ సంస్కృత కావ్యములలో వలె కథ ఆశ్వాసారంభ కథలతో ప్రసన్నము చేసుకొనవలసిన అవసరములేదని చెప్పకొని నాడు. అనగా ప్రసన్న కథకు ప్రబంధించిన కృతి ప్రశస్తి నుండి ప్రతిఆశ్వాసాంత,ఆశ్వాసారంభకథలతో సమన్వయించు కొనవలసిన అవసరములేదని చెప్పకొనినాడు. అట్లు తిక్కన వదలివేసిన హరిహరనాథప్రశస్తుల వలన 'ప్రతి ఆశ్వాసాంత ఆశ్వాసారంభములందు రాజారాజ ప్రశస్తి ఇక్కడ లేవే. ఏవైన కొన్ని పద్యములు పోయినవా?' అను సందేహమును పొందు తదనంతరకాల సాధుజనుల సందేహ నివారణార్థము నన్నయ

సారస్వతాంశప్రశస్తులను తత్కవితారీతియు కొంతదోప, తద్రచనయకా చతుర్థాశ్వాసాంత, పంచమ, షష్ఠమ, సప్తమాశ్వాసాంతమున, పంచమ, షష్ఠమ సప్తమాశ్వాసారంభములందు ఎఱ్ఱన పూరించినాడు. అట్లు పూరించినట్లు చతుర్థాశ్వాసాంత రాజరాజప్రశస్తి తర్వాతనే చెప్పుకొనినచో తిక్కన రచించిన వ్యాసాంశ అరణ్యపర్వశేషకథ ఎఱ్ఱన రచించెనని భావింతురని చతుర్థాశ్వాసాంతమున చెప్పుకొనలేదు. సప్తమాశ్వాసాంతమున తిక్కన రచించిన భారతకథ పూర్తికాగానే తన అవతారిక పద్యము సీస, కంద పద్యములలో రెండు పద్యములుగా వ్రాసిన తర్వాత రాజరాజ ప్రశస్తి పద్యములను రెండింటిని నన్నయ రచించినట్లే అనగా తిక్కన రచించినట్లు మూడు పద్యములు కాక రెండే రచించి, కథ తిక్కన రచనమని అరణ్యపర్వశేషపూరణ' పదప్రయోగముద్వారా ధ్వనించినాడు. ఎఱ్ఱననే కథ రచించియుండినచో అరణ్యపర్వ కథ పూరణమని కాశీ, అరణ్యపర్వశేషరచన చేసితినని కాని ప్రయోగించియుండెడివాడు. కనుకనే వ్యాసస్తుతికాని, నన్నయ, తిక్కనల కవిస్తుతులు కాని అరణ్యపర్వశేషాంతమున ఎఱ్ఱన చేయలేదు. కనుక 'ఇక్కడినుండి ఎఱ్ఱాప్రెగడ కవిత్వము ప్రారంభము' అను చతుర్థాశ్వాస కథమధ్యలోని వాక్యములు భారతము వ్రాయించుకొనినవారు సప్తమాశ్వాసమున ఎఱ్ఱన అవతారికయున్నదికదా, ఎఱ్ఱనరచన మెక్కడనుండి లేదే?' అని పదేపదే ప్రశ్నించువారి సమాధానముగా చతుర్థాశ్వాసములోని 'స్ఫురదరుణాంశు'లోని 'అరుణ' శబ్దమును బట్టి లేఖకులు జొప్పించినవే కాని, ఎఱ్ఱన రచన కాదని మనము పరిశోధనద్వారా తెలుసుకుంటిమి.

2. నుండి 8 వరకు గల అసంగతులు. అస్థిమాల రచన అని తిక్కన ప్రయోగమువలన నన్నయపేర తిక్కన అరణ్యపర్వశేష రచన సూచితమని; ఎఱ్ఱన వ్యాసాంశకథ రచించినట్లు చెప్పుకొననందున,నృసింహపురాణ,హరివంశములలో వలె అరణ్యపర్వ అశ్వాసాంతమునందున నన్నయ, తిక్కనల కవిస్తుతి చేయనందున కథాంశము తిక్కనది, ప్రశస్తి అంశము ఎఱ్ఱనదని పరిశోధనద్వారా తెలుసుకొంటిమి.

ఓం ఇతిశమ్

శ్రీరామచంద్రః శ్రితపారిజాతః సమస్త కళ్యాణ గుణాభిరామః
సీతాముఖాంబోరుహ చంచరీకో నిరంతరమ్ మంగళమాతనోతు.



(గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

## అనుబంధము

# భారతావతారిక తిక్కనదే

తెలుగువిశ్వవిద్యాలయమువారు ప్రచురించిన వ్యాససంకలనమైన 'నన్నయభారతి' ప్రథమసంపుటమున 'ఆంధ్రమహాభారతావతారిక మీమాంస'అను శీర్షమున శ్రీచింతలపూడి వెంటేశ్వర్లుగారు 'శ్రీవాణీగిరిజాశ్చ' అను మంగళశ్లోకమునకును 'హరిహరాజగజాననార్క' అను ప్రార్థనాపద్యమునకును గల మధ్యభాగము, ప్రక్షిప్తముగ తోచుచున్నదని చెప్పి క్రింది ఉపపత్తుల నిచ్చియున్నారు. (1) "నన్నయ తానై యీయవతారిక రచించెనా ? లేక తరువాతి కాలమున మరొక రెవరేని రచించిరా? నన్నయ స్వయముగారచించియున్న, నది ప్రథమ పురుషమం దేల యుండవలయును? అట్లు రచించుటకు కారణమేమి? పూర్వకవి సంప్రదాయమా? లేదే? (2) నన్నయవిరచితమహాభారత భాగమునకు కృతిపతి రాజరాజనరేంద్రుడనునది నిర్వివాదమే. మరి యవతారికయందు కృతిసమర్పణ ముండితీరవలయునుకదా! ఎందుచేత నన్నయ అట్లు గావింపలేదు.... రాజరాజు నన్నయతో 'మహాభారతబద్ధనిరూపితార్థమేర్పడ దెనుగున రచియింపు మధికధీయుక్తిమెయిన్ అనిమాత్రమే యనెను. కాని 'రచియించి దానిని నాకంకితమిమ్మని' యతడు నన్నయను అడిగినట్లులేదు. కాని యతనిలో కృతిపతిత్వాకాంక్ష యుండియుండదా? రాజారాజున కంకితమిచ్చితినని యెచ్చటను నన్నయయుఁ బైకిఁ దేలలేదు. కాని కృతిపతికిఁ దక్కవలసిన మరియాదలన్నియు నతని కతడు గ్రంథమున జెల్లింపనే చెల్లించెను. ఆశ్వాసారంభములందును, నాశ్వాసాంతములందును రాజరాజ ప్రశంసాస్పదములగు పద్యములను రచించియే యుండెను .... అవతారికను సూక్ష్మముగా పరిశీలించినయెడల 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' అను మంగళశ్లోకానంతరము 'అని సకల భువన రక్షణప్రభువులై యాద్యులైన హరిహరహిరణ్య గర్భపద్మోమావాణీపతుల స్తుతియించి, తత్ప్రసాదసమాసాదితనిత్యప్రవర్ధమానమహామహీరాజ్య విభవుండును...' అనికృతికర్తయగు రాజరాజనరేంద్రునివర్ణనము, మంగళశ్లోకమందలివిషయము వచనమున పునరావృతమైనది. అంతియేగాక త్రిమూర్తుల క్రమము మారినది. ఏ ప్రయోజనము నాశించి యట్లు మారియుండును?.... 'శ్రీయన గౌరినాబరగు' అను ప్రార్థనాపద్యానంతరము 'అనిసకల బ్రహ్మప్రార్థనంబు సేసి' అనుచు వెంటనే ప్రస్తావనావిషయమునకు సాగును. అవతారికయం దట్లుగాక ప్రారంభమందు నుతింపబడిన హరిహరహిరణ్యగర్భాదులు, మరల ముగింపులో 'హరిహరాజగజానననాదు' ల యందు ప్రార్థింపబడిరి. ఆలోచింప నీ రెండు ప్రార్థనాభాగములకు నడుమనున్న భాగమంతయు ప్రక్షిప్తముగనే తోచుచున్నది. (3) కాళిదాసు,భవభూతి,మాఘుడు మున్నగుసంస్కృతకవుల కీయాచారమున్నది. మంగళాశ్లోకానంతరమో, లేక, తదర్థానంతరమో నేరుగా కథలోనికి వెళ్ళుదురు. కృతిసమర్పణాదు లుండవు. నన్నయ గారి మంగళశ్లోకమును జూచినపు డట్లే యనిపించును. అత డాయవతారికను వ్రాసియుండలేదా . ... ఏది యెట్లున్నను నన్నయ తనగ్రంథమునందు అశ్వాసాద్యంతముల కృతిపతిని పొగడియున్నందున, అవతారికను కూడ వ్రాసియేయుండనగును. కాని మనముందున్న యవతారికమాత్ర మతడు వ్రాసినదికాదు. (4) ఆశ్వాసాద్యంతములం దెక్కడను నన్నయ, రాజరాజనరేంద్రుని రాజమహేంద్రపాలకునిగ పేర్కొనలేదు. ఆదిపర్వప్రథమాశ్వాసాంతమునందు 'నిరవద్యనరేశ్వర' అనియు, ఆదిపర్వపంచమాశ్వాసాంతమునందు 'నిరవద్యయువతీమదన' అనియు, ఆదిపర్వాంతమందు 'నిరవద్య రవిప్రభ' అనియు రాజరాజనరేంద్రుడు వర్ణింపబడెను. ఆదిపర్వద్వితీయాశ్వాసమందుమాత్రము 'రాజమహేంద్రకవీంద్రసమాజసురక్ష్మాజ'అని కలదు.కాని రాజరాజనరేంద్రుని 'రాజమహేంద్ర'యని సంబోధించుట కలదు. అట్టిసంబోధన ఆదిపర్వ సప్తమాశ్వాసాంతమందు కాననగును. కావున పైవర్ణనము 'రాజమహేంద్ర ! కవీంద్రసమాజసురక్ష్మాజ!' అని చదువనగును. అప్పుడు ఆశ్వాసాద్యంతములం దెచ్చటను రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరపాలకునిగా పేర్కొనబడనటులే అనగా నన్నయ తనఆంధ్రమహాభారతమును

(గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

రచియించుసమయమునకు రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరమును చేరియుండడు. బహుశః అప్పటికి వేంగీరాజధాని బెజవాడ నుండి నిరవద్యపురము (నిడదవోలు)నకు మారియుండును.... వాస్తవికమిట్లుండ, నవతారికయందు నన్నయమహాభారతరచనాకాలమునకు రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరమును పాలించుచుండినయట్లు స్పష్టముగా గలదు. 'మనుమార్గుండగు విష్ణువర్ధనుండు అఖిలజలధివేలావలయితవసుమతీ వనితావిభూషణంబైన వేంగీ దేశంబునకు నాయకరత్నంబునుంబోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబు ననవరతమహామహీరాజ్య సుఖము అనుభవించుచుండె'నని యవతారిక యందున్న విషయము . ఆశ్వాసాద్యంతములపద్యములబట్టి మన మూహించినదాని కివి పూర్తివ్యతిరేకము. ఇం దేదియో ఒకటి నన్నయకృతము కానిదై యుండవలయును. అట్లు కానిది అశ్వాసత్రయము కాదు కదా ! దీనిని బట్టి అవతారిక నన్నయ కాలమున గాక ఆతరువాత ఎప్పుడో వ్రాయబడియుండవలయును.... యింకను ఈవిషయమై విజ్ఞులగువిమర్శకులు నన్నయపై తమకున్నభక్తిని కొంత ప్రక్కకునెట్టి చారిత్రక, హేతువాద దృష్టులతో పరామర్శింతురుగాక' పైకారణములే కాక క్రింది కారణములు భారతావతారిక తిక్కన రచనమని సూచించుచున్నవి. (1) సాధారణముగ కవి ఇష్టదేవతాస్తుతితో కేవల కావ్యరచన ప్రారంభించి, కావ్య సమాప్తి చేసిన తర్వాతనే తన స్వవిషయమును, కావ్య కరణ హేతుత్వాది విషయములను కృతిపతికి అంకితము చేయుట కంగీకారముతెలిపి, కృతిపతి వంశావతారవర్ణనము రచించి, ఆశ్వాసాంత గద్య రూపమును నిర్ణయించి, వాటిని ఇష్టదేవతాస్తుతి, కావ్యారంభముల మధ్య ఉండునట్లు శుద్ధప్రతిని తయారుచేయును. కాని నన్నయ అకాలమరణముతో భారతరచన నిలిచిపోయినందున, భారతావ తారికకాని, ఆశ్వాసాంత గద్యములు కాని నన్నయ రచనలు కావని భావింపవచ్చును. అట్టి సందర్భమున 'హరిహరాజ గజాననార్క' నుండి రచించిన నన్నయభాగములో ఆశ్వాసాంత, ఆశ్వాసా రంభములందు రాజరాజ నరేంద్రున కంకితమిచ్చినట్లు ధ్వనించుచు,రాజరాజు అర్థింపకయే భారతమును రాజరాజున కంకితము చేసినట్లున్నది. అట్టి భారతమును పూర్తి చేయదలిచిన తిక్కన, పై లోపమును పరిహరించుటకు విరాటపర్వమునుండి రచన ప్రారంభించి; స్వర్గారోహణపర్వము పూర్తయిన తర్వాత, భారతావతారికా భాగమును, వృద్ధిపొందిన అరణ్యపర్వమును రచించియుండునని 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' శ్లోకములోని 'వక్షోముఖాంగేషు'పదప్రయోగము ధ్వనించుచున్నది. కారణము తిక్కన రచనాప్రారంభము విరాటపర్వము భారతకావ్యచెల్వవక్షోభాగమున, భారతావతారిక కావ్య చెల్వముఖభాగమున, వృద్ధిపొందిన అరణ్యపర్వము కావ్యచెల్వశరీర(అంగ)భాగమున ఉండుట వలన; శ్లోకమున 'స్త్రీ,పుంస యోగోద్భవాం' పదప్రయోగము 'ఏ నిన్ను మామ యనియెడు'ను ధ్వనించుచున్నందున. దీనినే తిక్కన విరాటపర్వప్రారంభమున 'శ్రీయన, గౌరినా బరగు చెల్వకు' అను పద్యమున విరాటపర్వాది స్వర్గారోహణ పర్యంత, వృద్ధిపొందిన అరణ్యపర్వకథా భాగములను (లక్ష్మి, పార్వతులను) సూచించి; వాటిని హరిహరంబగు రూపముదాల్చిన భగవంతున కంకితము చేసి, తర్వాతవచనములో 'సకలబ్రహ్మ ప్రార్థనంబుసేసి' అనిన బ్రహ్మభాగము, కథాభాగము కాని భారతావతారిక భాగమని; పాఠకులకు సూచింపజేసియుండును. భారతసంశోధితప్రతిలోని భారతావతారిక ప్రథమవచనములోని పాఠాంతరములు కూడ దీనిని సూచించుచున్నవి. చూడుడు "అని సకలభువనరక్షణ [1]ప్రభువులై [2]యాద్యులైన [3]హరిహరహిరణ్యగర్భపద్మామావాణీపతుల [4]స్తుతియించి [5]తత్ప్రసాదసమాసాదితనిత్య[6]ప్రవర్ధమాన [7]మహా[8]మహీ [9]రాజ్య విభవుండును.....

1. ప్రవణులై-ఈ,మ; ప్రవణులైనహరిహర-ర; ప్రముఖులై-అ,ఉ,ఊ.ఏ,ఓ,ఔ,ద,ప,బ,మ; ప్రభువులై-వ; ప్రశస్తులై-స; 2. యాద్యులైన అ,ఈ,ఉ,ఊ,ఎ,ఏ,క,మ,వ; 3. హరిహరహిరణ్యగర్భ పద్మామావాణీసతుల - అని వేదం వేంకట్రాయశాస్త్రిగారును(మద్రాసు విశ్వవిద్యాలయమువారి తెలుఁగుసెలక్షన్సు)సూచించినపాఠములు గమనింపఁదగినవి-4 నుతియించి-అ; సంస్తుతించి-మ; ప్రస్తుతించి-కే; 'స్తుతియించి' రూపము గ్రాహ్యము కాదని కొందరి యభిప్రాయము-5 తత్ప్రసాదంబున నిత్య-ఊ; తత్పసాదిత-ఏ,క,మ,తత్ప్రసాదాసాదిత-అ,ఆ, ఇ,ఈ,ఇ,ఐ,ఒ,గ,ట,య 6. ప్రవర్తమాన-చే

(గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

పై వచనము సరియైన పాఠాంతరములతో నిట్లుండునని భావింపవచ్చును.

'అనిసకలభువనరక్షణ ప్రవణులైన హరిహరయాద్యులైన హరిహరహిరణ్యగర్భపద్మోమావాణీసతుల స్తుతియించి తత్ప్రసాదాసాదిత ప్రవర్ధమాన మహామహీరాజ్యవిభవుండును... ప్రవణులైన హరిహర' అనుభాగము,హరిహరనాథునివాక్కు 'దీని(భారతరచన) కెద నియ్యకొని వేడ్కనూని కృతిపతిత్వమర్థించి వచ్చితి తిక్కశర్మ' నందలి ఆసక్తిని వ్యక్తపరిచి తిక్కనరచనను సూచించును.

పైవచనములోని 'అనిసకలభువనరక్షణప్రవణులైనహరిహర' అనునది, విరాటపర్వములోని 'అని సకల బ్రహ్మ'ను పోలి, కావ్యాంకితము ధరించిన హరిహరరూపము ఒక ఉద్దేశ్యము ననుసరించి హరిహరహిరణ్యగర్భుల నుండి రూపొందినదని ధ్వనించును. హరిహరభాగములోని హరి, విరాటాది స్వర్గారోహణపర్యంత 'శ్రీ' పదప్రారంభ కావ్య చెల్వ (కృతిపతి) భాగమని; హర, వృద్ధిపొందిన అరణ్యపర్వకావ్యచెల్వ (కృతిపతి) భాగమని; ముందు తెలుసుకొంటిమి. 'బ్రహ్మ'కథాభాగముకాని కావ్య కరణ హేతుత్వాది కావ్యచెల్వముఖభాగ(కృతిపతి)మని మనము తిక్కనభావనగా భావింపవచ్చును. 'తత్ప్రసాదాసాదిత' అనుపాఠము విరాటపర్వవచనముతో సమముగనున్నది

పై భాగములను అనుసంధింపగా విరాటపర్వాదిస్వర్గారోహణ పర్యంతమైన (పురుషోత్తమ) తర్వాత బ్రహ్మభాగమైన భారతావతారికను(అంబుజభవ)దానితర్వాత అంగభాగమైన వృద్ధిపొందిన అరణ్యపర్వమైన శ్రీకంధర భాగముతో కావ్యరచన పూర్తయినదను భావనమే పురుషోత్తమాంబుజభవశ్రీకంధర క్రమమునుతెలుపును. కథాభాగము (హరిహర)ను, కథాభాగముకాని అవతారిక (హిరణ్యగర్భ)ను హరిహరహిరణ్యగర్భక్రమమునుసూచించునని దాని సమన్వయమునకే తిక్కన విరాటపర్వమున 'హరిహర' రూపమును పద్యభాగమున 'హిరణ్యగర్భ' రూపమును వచనభాగమున రచించి భారతావతారికలో 'పురుషోత్తమాంబుజభవ శ్రీకంధర'క్రమమును శ్లోకమునతెలిపి తదుపరివచనములో 'హరిహరయాద్యులైన హరిహరహిరణ్యగర్భపద్మోమావాణీసతుల' అని ప్రయోగించినట్లు గమనింపగలము. ఈసమాసములో 'పద్మ'విరాటపర్వాదిస్వర్గారోహణపర్యంతకథగను,'ఉమ'వృద్ధిపొందినఅరణ్యపర్వ కథగను,'వాణీ' భారతావతారిక వృత్తాంతముగను, 'సతి' 'హరిహరాజగజాననార్క' పద్యమునుండి అరణ్యపర్వచతుర్థాశ్వాస వర్షఋతుపరిసమాప్తివరకు గల నన్నయరచనాకథ (రాజరాజాంకితము)గను మనము సమన్వయము చేసుకొనుభావన తిక్కన సహృదయులకు వదలివేసెను. తిక్కన నిర్వచనోత్తర రామాయణము క్రింది శ్లోకముతో ప్రారంభమగును.

శ్రీ రాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తంభే జగన్మండల, ప్రాసాదస్థిర భారభాజి దధతీ సా సాలభంజీశ్రియం, శుండాలోత్తమ గండభిత్తిషు మదవ్యాసంగవశ్యాత్మనాం, యా ముత్తేజయతేతరాం మధులిహా మానంద సాంద్రస్థితిః (ఏరాజ్యలక్ష్మి శ్రేష్ఠమైనగజములయొక్క గోడలవంటి గండస్థలములయందు గల మదమునందు ఆసక్తిచేత వశ్యములైనమనస్సుగల తుమ్మెదలయొక్క ఆనందముతో నిండినస్థితి ఎక్కువగాప్రకాశింపజేయుచున్నదో, అట్టిలక్ష్మి జగన్మండలమనే ప్రాసాదముయొక్క స్థిరమైనభారమును మోయుచున్న మనుమసిద్ధి రాజుయొక్క భుజస్తంభములందు వస్త్రదంతకాష్ఠాదులచేత చేయబడినబొమ్మశోభను ధరించుచున్నదై ఉండుగాక) పైశ్లోకము భారతావతారిక శ్లోకములోని 'దధతః,స్థితిః'పదములుకలదై, మనుమసిద్ధి భుజస్తంభమున జగన్మండల ప్రాసాదము యొక్క స్థిరమైన భారమును ధరించినట్లును,భారతావతారికశ్లోకములో లక్ష్మీ వాణీ, గిరిజలను హరి హిరణ్యగర్భ, హరులు వక్ష, ముఖ, శరీరములందు ధరించినట్లు సామ్యము చెప్పుట, రెండుశ్లోకములును శార్దూలములగుట, రెండుశ్లోకములును కృతిపతినుద్దేశించినవగుట, 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ'లోని 'స్త్రీపుంసయోగోద్భవాం' నిర్వచనోత్తర రామాయణములోని "ఏ నిన్నుమామ యనియెడు దీనికి దగనిమ్ము భారతీకన్యక నాకీనర్హుడవగుదనినను భూనాయకు పల్కు చిత్తమున కింపగుడున్' అని ప్రత్యుత్తరమీయక వదలివేయుటచేత; భారతావతారిక నన్నయరచనలో అసంపూర్ణముగ నున్నదని

సూచించుటకు, నిర్వచనోత్తర రామాయణశ్లోకమును తర్వాతి ప్రార్థనాపద్యమునకు అన్వయించక రచించినట్లు భావింపవచ్చును. (2) భారతావతారిక శ్లోకము, దాని భావమిది. 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే, లోకానాం స్థితి మావహన్త్యవిహితాం స్త్రీపుంసయోగోద్భవాం, తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై, ర్భూయాసుః పురుషోత్త మాంబుజభవ శ్రీకన్ధరా శ్రేయసే,(లక్ష్మీ,సరస్వతీ,పార్వతులను వక్షస్థలమునందు,ముఖమునందు శరీరమునందు ధరించుచున్న ఏత్రిమూర్తులు, లోకముయొక్క స్త్రీ,పురుష సంబంధమువలన ఏర్పడిన నిరంతర స్థితిని చిరకాలము ఏర్పరచుచున్నారో, అట్టి వేదత్రయ మూర్తులు దేవతలచేత పూజింపబడినవారైన హరి, హిరణ్యగర్భ,హరులు మీ యొక్క శ్రేయస్సు కొఱకు అగుదురుగాక)

ఆలోచనామృతమైన కావ్యరచనము ఒకలోకమని 'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః, యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే' అని ఆలంకారికదర్శనప్రణేతల అభిభాషణము. ఆలోకపు భారతకథాభాగమను కృతిచెల్వకు ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతములందున్న స్త్రీ, పురుషయోగ సమన్వితముచే బంధ మేర్పడుచున్నది. భారతము పంచమవేదము. దానిలోని కథాభాగమును ధరించినవారు వేదత్రయమూర్తులైన హరిహరహిరణ్యగర్భులు(రాజరాజు) లక్ష్మీ,పార్వతి,వాణి (భూసతులు). కనుక పైభావమును కావ్యపరముగ క్రిందివిధముగ భావింపవచ్చును.

భారతప్రబంధకథాచెల్వలైన లక్ష్మీ,వాణీ,గిరిజలను పంచమవేదమైన భారతకృతి వక్షస్థలమైన విరాటపర్వమునందు,కృతిముఖమై అవతారికయందు,కృతి శరీరమై వృద్ధిపొందినఅరణ్యపర్వమునందు ధరించుచున్న ఏత్రిమూర్తులు, కావ్యలోకముయొక్క కృతికన్య,కృతిభర్తలయొక్క స్త్రీ పురుషసంబంధమువలన ఏర్పడిన నిరంతర(కీర్తి) స్థితిని చిరకాలము ఏర్పరచుచున్నారో, అట్టి వేదత్రయ స్వరూపులు దేవతలచేత పూజింపబడిన వారైన హరి, హిరణ్యగర్భ, హరులు మీ యొక్క శ్రేయస్సు కొఱకు అగుదురు గాక. వక్ష, ముఖ, అంగ అని మూడు వేరు వేరు కావ్యభాగములుగ తెలుపుట, విరాటపర్వము అధిక తెలుగు పదములతో, భారతావతారిక అధిక సంస్కృతపదములతో, వృద్ధిపొందిన అరణ్యపర్వము తెలుగు సంస్కృతపద సమపాళ్ళతో రచించనట్లు ధ్వనించును. రచనాప్రారంభమువలన విరాటపర్వము, భారతావతారికప్రారంభమువలన శ్రీపదప్రయోగప్రారంభసూచితము 'శ్రీయనగౌరినాబరగు; 'శ్రీవాణీగిరిజాశ్చ'; 'భూసతికిం, దివంబునకు, మూడును ఏకకవి కృతప్రారంభమని సూచించును.

పైశ్లోకములోని 'శ్రీకన్ధర'పదప్రయోగము 'కిమస్థిమాలాం' శ్లోకములోని 'కాలకూటః'ను హరిహరినాథుడు సన్నిధిచేసినట్లు చెప్పిన'కరుణారసమువొంగి' పద్యములోని 'గురియైన చెలువున నెఱసినలోకరక్షణమనంగ గళంబుచాయ దోప'ను గుర్తుచేసి శ్లోకములోనికౌస్తుభము'ప్రథమాద్రిదోతెంచు భానుబింబమునా నురమ్మున కౌస్తుభరత్నమొప్పను (వక్ష,ఉర పదప్రయోగములచే) స్ఫురింపజేయుచున్నది. (3) కృతిపతిత్వముకాంక్షించురాజు కవిని సగౌరవముగ రాజసభకు పిలిపించి అర్థించును. కవి దానికి సమ్మతించి తాంబూలము స్వీకరించును. అది రచనలో ప్రతిబింబించును. కాని భారత కావ్యావతారిక దీనికి భిన్నముగ 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ' మంగళశ్లోకపు కృతికర్త రాజరాజేయైనట్లుండి, రాజసభను వర్ణించి, రాజసభయందున్న నన్నయను భారతము రచింపమని అర్థించినట్లున్నది. కాల ప్రవాహములో కవి,కృతిభర్త గుర్తింపుకు మూడుతరముల పూర్వులను పేర్కొనుట, సంప్రదాయముకాగా, కేవల రాజరాజవర్ణన తప్ప మూడుతరముల పూర్వులను కృతిపతి వంశావతార వర్ణమునకాని, నన్నయ తండ్రి, తాత, ముత్తాతల పేర్లుకాని అవతారికయందు చెప్పక, ఆశ్వాసాంతగద్యములందు తండ్రిపేరు కూడ చెప్పకుండుట వలన భారతావతారిక, గద్యరచన నన్నయకృతము కాదని సూచించును. (4) ఆదరణీయ సారవిదితార్థగతి స్ఫురణంబుగల్గి, అష్టాదశ పర్వనిర్వహణ సంవృతమై పెనుపొందియుండగా, అందులో ఆదిపర్వమునుండి విరాటపర్వపూర్వపు అరణ్యపర్వమునందు మూడుకృతులు నన్నయ రచించెనని తిక్కన చెప్పెనే కాని, నన్నయ రచించిన భాగము స్పష్టముగా చెప్పి, దాని తర్వాతనుండి

తాను రచించి పూర్తిచేసితినని చెప్పలేదు. అట్లు చెప్పుటలోని భావమేమి? నన్నయ రచింపక వదలినదంతా తనురచించితినని కాదా? నన్నయ రచన (అశ్వాసమధ్యలో) నిలిచిపోయినందున దానిని స్పష్టముగ చెప్పుట కిష్టములేదని కదా?

నన్నయ'శ్రీవాణీగిరిజాశ్చిరాయ'శ్లోకరచన చేసియుండినచో, 'హరిహరాజగజాననార్క' అని తిరిగి త్రిమూర్తుల ప్రస్తావనతో ప్రార్థన చేసియుండడు. 'శ్రీవాణీగిరిజాశ్చ' శ్లోకరచన వలన, నన్నయ ఆదికవి అని పాఠకుని భావనలో మొదలును. ఇట్టిరచనఒక శిల్పరహస్యము. కనుక అరచన'అమలోదాత్తమనీష నే నుభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమునం పారగుడన్ అని చెప్పిన తిక్కన రచనమని సూచించుటకు తిక్కన నిర్వచనోత్తరరామాయణము శ్లోకరచనతో ప్రారంభించెనని, విరాటపర్వమున 'శ్రీయన, గౌరినాబరగు' పద్యముతో ప్రారంభించుట నన్నయ రచించిన 'దుర్భర తపోవిభవాదికున్, గురుపద్యవిద్యకునాద్యు నంబురుహగర్భనిభున్' అన్న వాల్మీకి స్తుతికి ప్రయోగించిన పదజాలము నన్నయగారికి సన్వయించుట కొరకేనని భావింపవచ్చును. (5) భారతభారతీశుభగభస్తిచయంబులఁ జేసి ఘోరసంసారవికార సంతమసజాల విజృంభము వాపి' అను నన్నయగారి వ్యాసస్తుతి, వృద్ధిపొందిన అరణ్యపర్వమునందలి 'స్ఫురదరుణాంశురాగరుచి పొంపిరివోయి నిరస్తనీరదావరణములై' అను అస్థిమాల పద్యపాదమును తలపింపజేయుచు, భారతావతారికలోని 'బుద్ధిబాహువిక్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసముద్రము దఱియంగనీదను విధాతృనకైనను నేరబోలునే? అని 'ఆదరణీయ'పద్యములోని 'విద్యాదయితుని' పర్యాయపదమైన 'విధాతృ' పదప్రయోగముతో సూచించి, రెండుపద్యముల కర్తృత్వము తిక్కనగా తలపింపజేయును. (6) 'జగత్పరి పూజ్యములైన యీశ్వరాగమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్' అని 'పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవమున్' పాయవని పరమేశ్వరభక్తివే రాజరాజు విన్నవించుకొని యుండుటచే 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' అను కృతిభర్తపరమైనస్తుతిలో త్రిమూర్తుల ప్రస్తావన తిక్కనరచనమని ధ్వనించును. నన్నయ అవతారికయందు 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ' అనిశ్లోక రచన చేసి యున్నచో 'హరిహరాజగజాననార్క' అని ప్రార్థనాపద్యమును తిరిగి త్రిమూర్తులను స్తుతింపుచు చేసియుండడేమో అనిపించును. 'శ్రీయనగౌరినాబరగు' అని హరిహరరూపమును వర్ణించిన తిక్కన 'సకలబ్రహ్మప్రార్థనంబు సేసి' అను పదప్రయోగము వలన భారతావతారిక తిక్కనరచనమని ధ్వనించును. (7) 'ఈత్రయిఁదాఁ బ్రబంధపరమేశ్వరుడై విరచించె శబ్దవైచిత్రి (1) నరణ్యపర్వము నశేషము (2) శ్రీనరసింహ (3)రామచారిత్రములన్ బుధవ్రతగరిష్ఠత నెఱ్ఱయ' అనిఎఱ్ఱనను జక్కన తన'విక్రమార్కచరిత్రమున' స్తుతించినాడు. హరివంశప్రస్తావన దీనిలో లేనందున, ఎఱ్ఱన అప్పటివరకు హరివంశము రచింపలేదని, ఎఱ్ఱన, జక్కనలు సమకాలికులని, తిక్కన సమీపకాలవర్తులని మనము భావింపవచ్చును. ఎఱ్ఱన 'భాసురభారతార్థములభంగులు' 'ఉన్నత సంస్కృతాది' అను నృసింహపురాణ పద్యములలో నన్నయతిక్కనలనువిడదీయక 'అబ్జాసనకల్పులం అద్యుల 'అని స్తుతించెను. అదేకావ్యమున 'మించినవేడ్క'పద్యమునందు 'ప్రౌఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు' అని అద్యుల పదప్రయోగముచే నన్నయ, తిక్కనలను తిరిగి ధ్వనిద్వారా స్తుతించినట్లు భావింపగలము. భారత కావ్యచెల్వ వక్షోముఖాంగములందు అనగా విరాటపర్వ,భారతావతారిక,అరణ్యపర్వశేషములందలి కృతిభర్తలుగా పురుషోత్తమాంబుజభవ శ్రీకంఠరులను నిల్పిన రచన తిక్కనదే అని నన్నయ తిక్కనలను విడదీయకుండుట వలన భావింపవచ్చును. ఇది తిక్కన 'ఆదరణీయ' పద్యమునందు రచించిన అష్టాదశపర్వనిర్వహణసంవృతమై పెనుపొందియుండ'కు అనువుగానున్నది. 50 నుండి 53 పుటలందు పేర్కొనబడిన జక్కనకవిస్తుతిపద్యములలోని గూఢనిక్షిప్తములలోని (6) ఈవిషయమును బలపరచునవిగా నున్నవని మనము ముందే చూచితిమి.

**- గోపినాథ శ్రీనివాసమూర్తి**

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)

# ప్రార్థన

## దుర్గాదేవి స్తోత్రము (దండకము)

శ్రీ మత్పరబ్రహ్మరూపా, విపజ్జాలసంహారిణీ, సచ్చిదానందరూపా, మహాదేవి, నారాయణీ, విష్ణుమాయా, మహాభాగ, బ్రహ్మాదిదేవాళికిన్, సర్వలోకాళికిన్, తల్లియున్ నీవ, దేవీ! గుణంబున్ రహిన్ దాల్చినన్ ధాత్రి సాకారవౌ దీవు, వేడ్కన్, గుణాతీతవై యున్నవేళన్ నిరాకారవౌ దీవు, జీవుండవున్ నీవ, దేహంబొగిన్ నీవ, యీరెంటికిన్ సాక్షియై యొప్పు శశ్వత్పరబ్రహ్మమున్ నీవ, వేదాళికిన్ తల్లియై యొప్పు సావిత్రియున్ నీవ, వైకుంఠమం దచ్యుతోరస్థలంబందు నిత్యంబు శోభిల్లు పద్మామహాదేవియున్ నీవ, క్షీరోదధిన్ శేషపర్యంక మధ్యంబునన్ బొల్చు శ్రీవిష్ణునిం గొల్చు క్షీరాబ్ధిరాట్పుత్రియున్ నీవ, స్వర్గంబునన్ వజ్రభృల్లక్ష్మియున్ నీవ, మర్త్యంబునన్ మర్త్యలక్ష్మీ స్వరూపంబు నీ, వెన్న, పాతాళలోకంబునన్ భోగిరాడ్లక్ష్మియున్ నీవ, ప్రీతిన్, నతశ్రేణికిన్, సర్వసంపత్తు లెల్లప్పుడున్ కోర్కితో నిచ్చు విన్నాణియున్ నీవ, నిత్యంబునన్, సత్యలోకంబునన్ బొల్చు భాషాసరోజాక్షియున్ నీవ, గోలోకమం దెప్పుడున్ కృష్ణవక్షస్థలంబందుఁ జెల్వొందు రాధామహాదేవియున్ నీవ, బృందావనంబందు బృందాచకోరాక్షియున్ నీవ, దాక్షాయణీదేవియున్ నీవ, శైలాధి రాట్కన్యయౌ పార్వతీదేవియున్ నీవ, సర్వామరశ్రేణికిన్ తల్లియౌ దేవతామాతయున్ నీవ, స్వాహా స్వధా దేవులున్ ధాత్రియున్ గంగయున్ నీవ, నిక్కంబుగా, దేవతాపత్ను లెల్లన్ రహిన్ నీకళల్, పూరుష క్లీబ నారీ స్వరూపంబులున్ నీవ, వృక్షాళికిన్ బీజమున్ నీవ, సృష్ట్యంకురం బీవ, విశ్వంభరాదేవియం దొప్పు సద్గంధమున్, వహ్నియం దొప్పు బల్దాహికాశక్తియున్, వారియం దొప్పు శీతత్వ, మాకాశమం దొప్పు శబ్దంబు, పద్మాప్తునం దొప్పు తేజంబు, శీతాంశునం దొప్పు సత్కాంతియున్ నీవ, బ్రహ్మాకృతిన్ సర్గమున్ చేయుచున్, విష్ణురూపంబునం పాలనం బర్థిఁ గావింపుచున్, శంభురూపంబునన్ సర్గ మంతంబు నొందింపుచున్, మూటికిన్ కర్త్రియై యొప్పు భాస్వత్పరాశక్తియౌ దీవు, సద్బుద్ధియున్ దుష్టియున్ పుష్టియున్ గాంతియున్ భ్రాంతియున్ దాంతియున్ శాంతియున్ శ్రద్ధయున్ మేధయున్ నిద్రయున్ భీతియున్ దృష్ణయున్ క్షుత్పిపాసాదులున్ కీర్తియున్ లజ్జయున్ మాయయున్ భుక్తియున్ ముక్తియున్ శక్తియున్ రక్తియున్, భక్తియున్ సర్వమున్ నీవ, నీ సత్ప్రభావంబు వర్ణింపగా, వేదముల్ చాల, వాణియున్ నేర, దాబ్రహ్మయున్, శేషుడున్, ధర్ముడున్ చాల, రే నెంతవాడన్, దయాదృష్టిచే నన్ను వీక్షించి, దైత్యేశ్వరున్ నాశ మొందించి, రక్షించవే, లోకమాతా, సదాచారపూతా, హిమాద్రీంద్రజాతా, సదా పాహి, మాంపాహి, మాంపాహి (శ్రీకృష్ణ జన్మఖండము)



- గోపినాథ వేంకటకవికృతము

గ్రంథకర్త: గోపినాథ శ్రీనివాసమూర్తి (గోపినాథ వేంకటకవి మనుమని మనుమడు)